


ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

మే చతుర నవల సమాంతర రేఖలు

**సమీక్షకుని పేరు :** ..............................................

**చిరునామా :** ..............................................

..............................................

..............................................

..............................................

# ఏరిన ముత్యాలు

★ ప్రపంచంలో అన్నీ నశించేవే - భావాలూ, ఆశయాలూ, కలలూ తప్ప!

-సుభాష్ చంద్రబోస్

★ మన అభివృద్ధికి బద్ధ విరోధి అసహనం!

-రాధాకృష్ణన్

★ అలవాట్లనేవి అత్యంత శక్తివంతమైనవి!

-బలిర్

★ వివేకానికి మొదటి బిడ్డ జాగరూకత!

-విక్టర్ హ్యూగ్

★ మానవుడి పరిపూర్ణత అతని సంపదలో కాదు అతని స్వభావంలో ఉంటుంది!

-ఆస్కార్ వైల్డ్

★ విచక్షణ లేని వీరత్వం రాణించదు!

-షేక్స్‌పియర్

★ తక్షణం నిర్వర్తించవలసిన కర్తవ్యం నిర్వర్తిస్తే తరువాత చేయవలసిన పని ఏమిటో అపుడే అవగతమవుతుంది!

-థామస్ కార్‌లైల్

★ నిన్నెవరూ ప్రేమించకపోతే అది ముమ్మాటికీ నీ తప్పే!

-డాడ్రిజ్

★ విద్యార్థి జ్ఞానాన్ని అన్వేషించాలి. జ్ఞానం విద్యార్థిని వెతుక్కోదు!

-జార్జ్ బెర్నార్డ్‌షా

★ మూర్ఖుని హృదయం అతని నోట్లో ఉంటుంది. వివేకి నోరు అతని హృదయంలో ఉంటుంది!

-బెంజిమిన్ ఫ్రాంక్లిన్

★ మనిషి నేలను తనది చేసుకొంటే చివరికి నేల మనిషిని తనవాణ్ణి చేసుకుంటుంది!

-ఎమర్సన్

★ సూర్యుడికేసి నుంచో నీ నీడ నీకు కన్పించదు!

-హెలెన్ కెల్లర్

★ విజ్ఞాని అంటే ఒకశాతం ప్రేరణ 99 శాతం ప్రయత్నం

-ఐన్‌స్టీన్!

★ వెయ్యి మైళ్ల ప్రయాణం ఒక్క అడుగుతోనే మొదలవుతుంది!

-లాలోట్జు

★ నిజాయితీ లేని జ్ఞానం ప్రమాదకరం

-శామ్యూల్ జాన్సన్

సేకరణ: వాకాడ శ్రీను



# చవులూరించే తాంబూలం

హిందూ సంప్రదాయంలో తాంబూలానికి ప్రత్యేకత ఉంది. శుభకార్యాలలోనేకాక, ఆరోగ్యపరంగా కూడా దీనికే ప్రాముఖ్యం. 'అగ్ర తాంబూలం' అనేమాట మనకు సుపరిచితమే. అయితే దీన్ని శృతిమించి తింటే ఆరోగ్యం పాడవడం, పళ్లు నల్లబడి, గారకట్టి చూడ్డానికి అసహ్యంగా కనిపించడం కూడా మామూలే. అంతేకాదు వక్కలోని బూజు, ఆకుమీద చిన్నచిన్న గ్రుడ్లు, సున్నంలోని నల్లని రాళ్లలాంటి పదార్థం... ఈ మూడూ పొరపాటువలనో, అజాగ్రత్త వల్లనో కలిపి తినడం జరిగితే దానంత విషం మరొకటి లేదని అంటారు. అందుకే తాంబూల చర్వణా

కవర్‌ఫోటో: వికీహండా



ఇత్తడి తాంబూల పేటిక

నికి ముందు ఆకులను శుభ్రంగా కడిగి, పొడిబట్టతో తుడిచి, వక్కను గట్టిగా ఊది, మెత్తని తెల్లని సున్నాన్ని రాసి వేసుకుంటారు. ఇప్పుడు వక్కల స్థానంలో వక్కపొడి వచ్చింది.

సాంప్రదాయ పద్ధతిలో జాజికాయ, జాపత్రి, ఏలకులు వగైరా అన్ని సుగంధ ద్రవ్యాలతోటి తీరిగ్గా కూర్చుని తాంబూలం వేసుకునే మనుషులు ఈ యాంత్రిక యుగంలో చాలా అరుదైపోయారని చెప్పచ్చు. వివాహాలలో కూడా కిళ్లీ పద్ధతి రావడంతో చవులూరించే సువాసన భరితమైన తాంబూలపు రుచికి చాలామంది దూరమయ్యారనిపిస్తోంది.

కొన్ని తెగలలో తాంబూలానికి సంబంధించిన దినుసులను ప్రత్యేకమైన పెట్టెలలో భద్రపరిచివుంచుతారు. ఇప్పటికీ



కొంతమంది వక్కలను కత్తిరించే కత్తెరనుపయోగించి వక్కలను తీరిగ్గా కత్తిరించుకుని మరీ తాంబూలం వేసుకుంటారు.

12వ శతాబ్దానికి చెందిన నారాయణ అనే పేరుగల ప్రసిద్ధ రచయిత తన హితోపదేశ పుస్తకంలో తాంబూలాన్ని అద్భుతంగా వర్ణించాడు. కొంచెం వగరుగా, కమ్మగా, ఘాటుగా అనిపించే తాంబూలం... పెదాలకు పగడపు రంగునీ, సువాసనల వెచ్చని ఊపిరినీ ఇవ్వడమేకాక, ఉదర సంబంధపు మాంద్యాన్ని, అరుచిని పోగొట్టి ఆకలిని పుట్టిస్తుందంటాడాయన.



ఇంతకుముందుగానే అంటే రెండవ శతాబ్దంలోనే ధన్వంతరి అయిన శుశృతుడు కూడా తన వైద్య రచనల్లో తాంబూలానికున్న గుణాలన్నిటినీ వర్ణిస్తూ దానికి ఆరోగ్యపరంగా అగ్రస్థానమిచ్చాడు. 1443లో విజయనగర రాజ్యానికి వచ్చిన పర్షియన్ యాత్రికుడు అబ్దుల్‌రజాక్ కూడా తాంబూలం ముఖానికి కాంతిని, పళ్లకు గట్టితనాన్ని ఇస్తూ, శ్వాసను శుభ్రపరిచి, అగ్నిమాంద్యాన్ని పోగొట్టి, ఇంద్రియ పటుత్వాన్ని ఇస్తుందని చెప్పాడు.

తాంబూల సేవనం ఈనాటిది కాదని, దాదాపు 8,000 సంవత్సరాలకు పూర్వమే ఇది ప్రారంభమైందని పరిశోధనలవల్ల తెలుస్తోంది. ఒక్క ఇండియాలోనేకాక ప్రపంచంలోని చాలా దేశాల్లో ఈ తాంబూలసేవనం అనాదిగా వస్తోంది. ఫిలిప్పైన్స్‌కు చెందిన డయానా ఎల్.ఇమెమోటో అనే చరిత్రకారుడు లెక్కల ప్రకారం ప్రపంచజనాభాలో పదవవంతు జనం ప్రతిరోజూ క్రమం తప్పకుండా ఉదయం, సాయంత్రం తాంబూలసేవనం చేస్తున్నారంటాడు.

మొదట్లో చాలాకాలంవరకు తాంబూలసేవనంతో నల్లబడిన పళ్లు అందానికి ప్రతీకగా భావించేవారు. పైగా అలా తిన్నా పళ్లు నల్లబడక పోతే ఒకరకం చెట్టు బెరడు రసాన్ని నిత్యం పళ్లకు పులుముకుని పళ్లు నల్లబడేలా చేసుకునేవారు. ఆ రోజుల్లో థాయ్‌లాండ్‌కు చెందిన క్రిస్టియన్ మిషనరీ వైద్యులు కట్టుడు



పళ్లని నల్లరంగులో కూడా తయారుచేసే వారు. కానీ క్రమంగా ఈ పద్ధతి మారింది. అయితే ఇప్పటికీ కొన్ని తెగల్లో ఈ నల్లపళ్ల పిచ్చి లేకపోలేదు. అరుణాచల్ ప్రదేశ్‌లో ఇప్పటికీ ఈ రకం నల్లపళ్ల సుందరీమణులు దర్శనమిస్తూనే వుంటారు.

భారతదేశం నిత్యం నేపాల్, మిడిల్ ఈస్ట్ లకి అధిక మొత్తంలో వక్కలను ఎగుమతి చేస్తూ వుంటుంది.

వివాహానికి ముందుగా ఆ సంబంధాన్ని నిశ్చయించుకున్నందుకు గుర్తుగా ఇరుపక్షాలవారూ ఒకరికొకరు ఇచ్చిపుచ్చుకునేది తాంబూలాన్నే. కొన్ని ప్రాంతాల్లో తాంబూల సేవనం వారి సాంఘిక, ఆర్థిక ఉన్నత స్థితిగతులను తెలుపుతుంది.

తాంబూలం త్రిమూర్తులకు ప్రతీకగా చెప్పబడుతుంది. వక్క బ్రహ్మకు, ఆకులు విష్ణువుకు, ధవళవర్ణంలో వుండే సున్నం శుద్ధ



శివతత్వానికి ప్రతీకగా చెప్పబడుతుంది. అందుకే పూలు, పళ్లతోపాటు తాంబూలం కూడా పూజా కార్యక్రమాల్లో చోటు చేసుకుంటుంది.

మొగలుల పరిపాలనా కాలంలో కూడా తాంబూలానికి ప్రముఖ స్థానం వుండేది. తాంబూలం, వక్క ఇచ్చిపుచ్చుకుని, పొరుగు రాజులతో స్నేహ సంబంధాలను పటిష్టం చేసుకునేవారు ఆ రోజుల్లో.

ఒకప్పుడు బర్మా న్యాయస్థానంలో తాంబూలానికి సంబంధించిన కొన్ని ప్రత్యేక ఆచార వ్యవహారాలుండేవి. బర్మారాణి తన ప్రత్యేక పరిచారకులను తను నములుతున్న తాంబూలాన్ని ఇచ్చి సత్కరించేది. బర్మా యువతులు సాయంత్రం పూట తమ వరండాల్లో నూలు వడుకుతూ, పక్కనే తాంబూల పేటికను పెట్టుకుని కూర్చునే వారు. దారిని పోయే యువకులు ఆమె మనసును దోచుకు నేందుకు ప్రయత్నిస్తే ఆమెకి ఏ వ్యక్తి నచ్చితే అతగాడికి స్వయంగా తాంబూలాన్ని చుట్టి చేతికందిస్తుంది. ఆ విధంగా ఆ అమ్మాయి తన మనసును ఆ యువకుడికి తెలియపరుస్తుంది. ఆ తరువాత కథ మామూలే. ఆసియాలో కొన్ని ప్రాంతాల్లో పెళ్లిచూపుల తర్వాత పిల్లవాడు నచ్చిందీ లేనిదీ తెలుసుకుందుకు పెళ్లికూతురుకి ఇత్తడి లేదా వెండితో



వివిధ రకాల తమలపాకులు



చేసిన తాంబూల పేటికను తప్పనిసరిగా బహూకరిస్తారు. అది ఆ అమ్మాయి స్వీకరిస్తే వరుడు నచ్చినట్టే. అలాగే వరుడి తరపువారు ఆ పెట్టెను ఆ అమ్మాయికి కానుకగా ఇవ్వబోతే వారికి ఆ అమ్మాయి నచ్చినట్టే. ఆవిధంగా నోటి మాటతో పని లేకుండా తాంబూల పేటికతో జీవన బాంధవ్యాలు ముడిపడేవి.

బర్మాలో పెళ్లికాని అమ్మాయిని 'సిరేహ్' అంటారు. అంటే ఆ భాషలో అర్థం 'మృదువైనలేతాకు' అని.

ఇండియాలో అనేకచోట్ల తమలపాకు తోటలు కన్నుల పండుగగా దర్శనమిస్తాయి. రుచిలో, ఆకారంలో, మృదుత్వంలో వైరుధ్యం కూడా కనిపిస్తుంది తమలపాకుల్లో. ఉత్తర భారతంలో కలకత్తా, బనారస్ ఆకులు చాలా ప్రసిద్ధిగాంచాయి. దక్షిణ భారతంలో 'చిన్నసైజులో దర్శనమిచ్చే కర్నాటకకు చెందిన 'చిగురుమాలే అనే తమలపాకు, దళసరిగా, కొంచెం ఘాటుగా వుండే అంబాడీ, కరియాలే' అనే తమలపాకులను ఎక్కువ ఇష్టపడతారు ప్రజలు.

అనేక ఆకృతుల్లో నగిషీలు చెక్కబడిన పాన్‌దాన్‌లు, వక్కపొడి పెట్టెలు, సున్నం డబ్బాలు ఇప్పటికీ ఎన్నో గృహాల్లో అతిథులను అలరిస్తూనే వున్నాయి. ఎక్కువగా ఇత్తడితో చేయబడిన పెట్టెలు వాడకంలో వుంటే, కొన్ని చోట్ల వెండివి కూడా దర్శనమిస్తున్నాయి.

ఈ పెట్టెలకు అగ్రభాగంలో ఏదైనా జంతువు లేదా పక్షి లేదా మనిషి బొమ్మగానీ చెక్కబడి వుండటంకద్దు.

-రాధా శివమోహన్

# చతుర

సంపుటి: 20

సంచిక: 4

మే 1997

మతకల్లోలాలకు కారణమైన దేశ విభజనలో హిందువులూ ముస్లిములూ కూడా తమతమ ధర్మసూత్రాలని మరచి పరస్పరం రాక్షసుల్లా ప్రవర్తిస్తున్న కాలం అది.

ముఖ్యంగా హిందువులు తక్కువగా వున్న ముస్లిం ప్రాంతంలో... స్మశాన నిశ్శబ్దం!

ప్రతివారి గుండెల్లో కరాళనృత్యం చేస్తోన్న మృత్యుభయం!

పసిబిడ్డతో పరుగెడుతున్న ఓ యువతిని బిడ్డతో సహా లాక్కుపోయారు దుండగులు. ఆమె భర్తని మృత్యువాతన పడేసి ఆమెపై అత్యాచారం చేయబూనారు. అలాంటి పరిస్థితిని ఆమె ఎలా ఎదుర్కొంది?

సార్వజనీన మత కలహాలు వ్యక్తిగత కుటుంబ కలహాలుగా ఎలా రూపుదాల్చాయి?

ఆనాటి మతోన్మాదుల రాక్షసకృత్యాలకు సాక్షరరూపం

## 'కన్హయ్యాలాల్ గాంధీ'

హిందీ మూలానికి

## జ్యోతిరాణి

అనువాదం

## 'సమాంతర రేఖలు'

ఈ నెల చతుర సమగ్ర నవల.



**ఆనాడు...**

మన దేశ చరిత్రలో 1947వ సంవత్సరాన్ని ఒక రక్తసిక్తమైన పుటగా అభివర్ణించవచ్చు. ఈ పుటలో లక్షలాది సామాన్యుల దయనీయగాథలు, హత్యల ఉదంతాలు కన్పిస్తాయి.

ఈ సంవత్సరమే లెక్కకుమించిన మాంగల్యాలు మంటగలిసిపోయాయి.

పిల్లలు అనాథలయ్యారు.

అన్నలు తమ్ముళ్లను కోల్పోయారు. అక్కచెల్లెళ్ల ప్రేమలకు దూరమయ్యారు.

ఎందరెందరో మిత్రులు శాశ్వత నిద్రలోకి జారుకున్నారు.

కష్టసుఖాలలో చేదోడువాదోడుగా నిలిచిన ఇరుగుపొరుగు కుటుంబాలు మత కలహాల ఫలితంగా శత్రువులుగా మారాయి.

హిందూ, ముస్లిం, సిక్కుల రక్తాలు ఏరుల్లా పొంగాయి.

మానవులు దైవసంతానమనీ, దేవలోకం నుండి దిగివచ్చారనీ చెప్పే మాటలన్నీ పూర్తిగా అబద్ధాలేనని నిరూపించటంలో అందరూ పోటీపడ్డారు.

మనిషి వస్తుతః పశువు సంతానమేననీ, నాగరికత పెరిగి ఎన్ని రంగాలలో ప్రగతి సాధిస్తున్నా అంతరాంతరాలలో అతను పశు, మానవ, రాక్షస పరిధులలోనే బంధింపబడి ఉన్నాడని రుజువు చేశాడు

స్వాతంత్ర్యానంతరం దాదాపు యాభై సంవత్సరాల కాలవ్యవధి తదనంతరం ఈ సంఘటనలు సద్దుమణిగి గతం ఏమిటన్నది చాలామందికి తెలియకుండానే పోయింది.

ఆనాటి దురంతాలకి ప్రత్యక్షసాక్షులు ఇప్పటికీ అక్కడక్కడా కొందరున్నా, ఆనాటి సంగతులు నెమ్మదిగా విస్మృతిపథంలో దాగిపోయాయి. వేలాది సంఘటనలు వెలుగుచూడనేలేదు. చరిత్రపుటలలో చోటు సంపాదించుకోలేదు.

మన చరిత్రకారుల దృష్టి ఎక్కువగా రాజరిక లాంఛనాలు, రాజుల, మహానాయకుల పేర్లు, ఊర్లు, పుట్టిగిట్టిన సంవత్సరాలు, జరిగిన యుద్ధాలు, ఉద్యమాలు, సంఘటనలు, ప్రేమ గాథలు మొదలైనవి వర్ణించటంపైనే ఉంటుంది తప్ప వాస్తవ సంఘటనలు, కళ్లెదుట జరుగుతున్న, జరిగిన ఘోర అత్యాచారాలపైనా, అత్యాచారాలకు బలయిన వారి హాహాకారాలపైనా మళ్లదు.

ఎన్నెన్ని కన్నీళ్లు?

ఎన్నెన్ని కష్టాలు?

ఎన్నెన్ని ఘోరాలు?

ఓహ్! ఆనాటి జీవన సమరం తల్చుకుంటున్న స్వాతంత్ర్య సమరయోధుల గుండెల్లో ఎన్నెన్ని అలజడులు? జ్ఞాపకాల పొరల్లో ఎన్నెన్ని దయనీయ ఉదంతాలు! జాలిగాథలు! బాధలు!!

**ఆ ఊరు...**

ఆగస్టు 15న స్వాతంత్ర్యం లభించి దేశ విభజన జరిగాక పాకిస్తాన్ పరిధిలో ఉన్న మఖ్దుమ్‌పూర్‌లో జరిగిన మారణకాండను తలచుకుంటే మనసున్నవారి కళ్లు చెమ్మగిల్లక తప్పవు.

నేటివరకు ఆ ఊరిగాథను ఎవరూ చెప్పుకోనేలేదు. అక్కడ జరిగిన సంఘటనలను ప్రత్యక్షంగా చూసినవారు ఆ ఉదంతాల్ని నేటికీ మరిచిపోలేరు. ఆ ఊరు ప్రస్తుతం పాకిస్తాన్‌లోని ముల్తాన్ కమీషనరీలో ఉంది. అప్పట్లో ఈ ఊళ్లో హిందూ జనసంఖ్య దాదాపు మూడు నాలుగు వేలుండేది. ఆ ఊళ్లో అత్యధికులు ముస్లింలే.

దేశ విభజన వార్త వెలువడినా రావీనది మడమటి తీరంవైపు నివసించే హిందువుల భవిష్యత్తూ, తూర్పువైపు నివసించే ముస్లిముల భవిష్యత్తూ అనిశ్చితస్థితిలో పడిందనే చెప్పాలి.

ముస్లిం జనాభా అధికంగాగల మఖ్దుమ్‌పూర్‌లాంటి గ్రామంలో హిందువులు నివసించడం మృత్యువుతో చెలగాటమే!

వాళ్లకు ఒక్కోరోజు ఒక్కోయుగంలా గడవసాగింది. ఇల్లూ వాకిలీ వదిలేసి భారతదేశానికి పారిపోవటం తప్ప మరో మార్గమే లేకపోయింది. కానీ అంతమందిని ఒక దేశంనుండి మరో దేశానికి చేరవేయటం మాటలా? అంత రవాణా సౌకర్యం ఏదీ? రైళ్ల సంఖ్య చాలా తక్కువ.

ప్రజలంతా భయంతో నిరీక్షించక తప్పని పరిస్థితులవి!

మఖ్దుంపూర్‌ని విడిచి చుట్టుపక్కల కొన్ని గ్రామాలకు తరలి వెళ్లారు కొందరు.

కొన్ని గ్రామాల్లో రాత్రివేళల్లో యువకులు గస్తీ తిరిగి తమ కుటుంబాల్ని రక్షించుకుంటున్నారు. స్థానిక అధికారి వారికి అభయమిచ్చినా ప్రజలు తమ జాగ్రత్తలు తాము తీసుకుని ఇటుకలు, రాళ్లు పోగుచేసుకుని ఆత్మరక్షణకై సిద్ధంగా వుంటున్నారు. స్త్రీలు, చిన్న పిల్లలు, వృద్ధులు భయంభయంగా కాలం గడుపుతున్నారు. యువకులు విజయమో వీరస్వర్గమో అన్నట్లు పోరాటానికి సంసిద్ధులవుతున్నారు.

ఆపదలు రెండు రకాలుగా వస్తాయి. కొన్ని ప్రకృతిపరంగా సంభవిస్తే మరికొన్ని మనుషులు సృష్టించేవే! ప్రజలపై విరుచుకుపడిన ఈనాటి ఆపద రెండో కోవకు చెందుతుంది.

భారత, పాక్ సరిహద్దులలో మనుషులు పరస్పరం చంపుకుంటూ ఆనందిస్తున్నారు.

అదెలాంటి ఆనందం?

ఆ పైశాచికానందమే శాశ్వతమనీ, తామేదో ఘనకార్యం సాధించినట్లు విర్రవీగుతున్నారువారు.

రెండు దేశాల్లోనూ భయానక వాతావరణం : అలముకొని ఉంది. మృత్యుభయం అందర్నీ వెంటాడుతోంది. ఏ శబ్దం విన్నా భీతితో తమతమ పనులు వదిలేసి సురక్షిత ప్రదేశానికి పరుగెత్తి దాక్కోవటం అలవాటైంది. వ్యాపారస్తుల దుకాణాలు, లావాదేవీలు మూతపడ్డాయి. అంతటా అరాజకత్వమే!

నిశ్శబ్ద వాతావరణమో, విద్రోహుల వికటాట్టహాసమో తప్ప ప్రేమాస్పద సంభాషణలు, చతురోక్తులు, దరహాసాలు ఎక్కడా కన్పించటం లేదు. యువతీ యువకుల భవిష్యత్తు అంధకారమయమైంది. సమాజంలో నైతిక విలువలు నశించాయి. హిందూ, ముస్లిములు తమతమ ధర్మ సూత్రాలను, మానవతా భావనలను విస్మరించి ఈ మహా దేశవాసులు స్వాతంత్ర్యానికి యోగ్యులు కారనే బ్రిటిషర్ల ఆరోపణను నిజమని నిరూపిస్తున్నారు.

1947 సెప్టెంబర్ 26న మఖ్దుమ్‌పూర్ చుట్టుపక్కల గల గ్రామాలకు చెందిన ముస్లింలందరూ ఊరి బయట ఉన్న ఓ మసీదులో సమావేశమవుతున్నారన్న వార్త హిందువులకు తెలిసింది.

శుక్రవారం నమాజు చేసుకోవటంకోసం అందరూ మసీదుకు రావటం సహజమే! అందులో వింతేంలేదు.

మరి ఈనాడు మసీదుకు ప్రార్థనా సమావేశానికి వచ్చినవారు ఎలా వచ్చారు?

చేతుల్లో గొడ్డళ్లు, లాఠీలు, బరిసెలు, కొడవళ్లు వంటి మారణాయుధాలున్నాయి. నమాజు చదివేవారు ఆయుధాల్ని వెంటబెట్టుకు వెళ్తారా? మందిరం, మసీదు, చర్చి, గురుద్వారాలు సంస్కృతికి కేంద్రాలు. పవిత్ర భావనల్ని పంచి మనిషిని మనీషిని చేసే ఈ స్థలాలలో ఒక మతానికి విరుద్ధంగా మరొకరు వ్యాఖ్యానించటం, నిందించటం, ఆవేశపూరిత ఉపన్యాసాలు కొనసాగించటం జరుగుతోంది. ఆలయాల మూల సూత్రాలకి విరుద్ధమైన చర్యలు ప్రస్తుతం అక్కడ జరుగుతున్నాయి.

ఐదారుగురు హిందూ జమీందారులవద్ద తుపాకులున్నాయి. అవి చూసి అక్కడి థానేదారు వారితో, "రెండు మూడు రోజుల్లో మిమ్మల్నందర్నీ భారతదేశానికి

సచిత్ర విచిత్రం




# పేపర్లమ్మే మిషన్

అమెరికాలో ముఖ్యమైనచోట్ల ప్రముఖ పత్రికలకు ఇలాంటి స్వంత మిషన్లుంటాయి. దాని ధర అందులో వేస్తే పేపర్ చేతికి వచ్చేస్తుంది.

పంపించేస్తున్నాం. తుపాకులు ఊరుదాటి పోరాదని ప్రభుత్వం కొత్తగా నిబంధనలు జారీ చేసింది. అవి మా పరం చేయండి" అంటూ తుపాకుల్ని జప్తు చేసుకున్నాడు. ఫలితంగా జమీందార్లు సైతం నిరాయుధులుగా, నిస్సహాయులుగా మిగిలారు.

శుక్రవారం నమాజు పూర్తయిన మూడు గంటల వరకు ఏ అనుచిత సంఘటనా జరగకపోవటంతో హిందువులంతా ఊపిరి పీల్చుకుని ఎవరి పనులలో వాళ్లు నిమగ్నమయ్యారు. మహిళలు రాత్రి భోజనాలకు వంట ఏర్పాట్లు చేసుకుంటున్నారు. కొందరిళ్లలో వంట ముగిసింది. కుటుంబ సభ్యులంతా కలిసి భోజనాలకి కూర్చున్నారు.

మౌనంగా ఉన్నా వాతావరణం తుపాను ముందరి ప్రశాంతతని సూచిస్తోంది. మరి కొద్ది నిమిషాల్లో ఏం జరగనుందో ఎవరికి తెలుసు? అనుకోనివే జరుగుతుంటాయి. ఇక అనుకుంటున్న సంఘటనలే జరిగితే? ఎవరి ఆలోచనల్లో వాళ్లున్నారు.

అంతలో...

'అల్లాహో అక్బర్, నారా-ఎ-తక్‌బీర్' వంటి నినాదాలు విన్పించాయి.

చీకటి దట్టమవుతున్న ఆ సమయంలో ఆకాశంనిండా మేఘాలు ఆవరించాయి. భయంకరమైన ఆ వాతావరణం గుబులు పుట్టిస్తోంది. ఏదో ఆపద విరుచుకుపడబోతోందని అందరికీ అర్థమైపోయింది.

మృత్యు భయాన్ని మించిన భయం మరోటిలేదు. అది కబళించబోతోందని అర్థమైన ఆ క్షణాలలో వారి హృదయ స్పందనలని, మనోస్థితిని అంచనావేయటం అసాధ్యం. చూస్తుండగానే ముస్లింల గుంపు హిందువులపై విరుచుకుపడింది. కత్తులు, గొడ్డళ్లతో వాళ్లొచ్చి నరికిపారేస్తుంటే ఇటుకముక్కలతో, రాళ్లతో వీళ్లు ఎంతదాకా అడ్డుకోగలరు? ఎంతవరకు పోరాడగలరు? ఆ ఘోరకలిలో గురువులను శిష్యులు పొడిచారు, మిత్రులు మిత్రులను చంపుకున్నారు అవతలవారు ఎవరైనదీ ఎవరూ పట్టించుకోవటంలేదు.

గంట రెండు గంటల్లో పరిసర ప్రాంతాలన్నీ రక్తపుమడుగులయ్యాయి. మృత్యువాకిళ్లయ్యాయి. వైద్యుల ఇళ్లల్లో అయోడిన్ సైతం మిగలనంతగా దోపిళ్లు జరిగాయి.

కొందరు దుండగులు ప్రాణాలుతీసి సంతృప్తిపడితే మరికొందరు దుండగులు స్త్రీల మాన ప్రాణాల్ని హరించే ప్రయత్నంలో పడ్డారు. దాంతో స్త్రీల పరిస్థితి మరింత బాధాకరంగా మారింది.

అలా అపహరించుకుపోబడుతున్న స్త్రీలలో సీమ అనే గృహిణి కూడా ఒకతె! ఆమె తన కూతురు కామినిని ఎత్తుకునే దుండగుల్ని ప్రతిఘటిస్తోంది. అయినా అవతలి వారు బలిష్టులు.

భార్యనీ, కూతుర్నీ విడిపించుకోవడానికి మన్మోహన్ పరుగెత్తుకు వచ్చాడు. వెనుదిరిగి భర్తను చూసిన సీమకు ధైర్యమన్పించింది. మన్‌మోహన్‌ను అతని తల్లి నిలువరించినా అతడు పెనుగులాడి సీమను ఎత్తుకు పోతున్న దిశవైపు పరుగుతీశాడు.

"సీమా! భయపడకు! ఇదిగో నేను వచ్చేస్తున్నా" అని పెద్దగా అరిచాడు.

ఇతని స్వరం విన్న దుర్మార్గుల క్రోధం నషాళానికి అంటి, ఆయుధాలకి పని కల్పించారు.

'హా' అన్న అతని ఆర్తనాదం చాలా దూరం వరకు విన్పించింది. అది విని వాళ్లు క్రూరంగా నవ్వుతూ, "మాతో తలపడటానికి వచ్చాడు! ఆయుధానికి పూసిన విషం ఐదారు నిమిషాల్లో ప్రభావం చూపిస్తుంది. మనిషి చల్లబడిపోతాడులే" అంటూ వెళ్లిపోయారు.

ఏ ధర్మ శాస్త్ర ప్రకారం అయినా ఇతరులను చంపటం, మహిళల్ని అవమానించటం, వారి పాతివ్రత్యాన్ని కొల్లగొట్టటం, అత్యాచారాలు చేయటం నేరమని ఈ ఆక

తాయులకు తెలియదా? 'నీవు భూమిమీద ఉన్నవారిని దయతో చూస్తే, పైనున్నవాడు నిన్ను కరుణతో చూస్తాడు' అనే సూత్రం వీరెరుగనిదా? అయితేనేం? ఇప్పుడు వికటాట్టహాసాలు, దురంతాలు తప్ప వాళ్లకేమీ జ్ఞాపకం రావటంలేదు.

సీమను, ఆమె కూతుర్ని త్వరగా పదమంటూ గూండాలు బెదిరించి తీసుకుపోతున్నారు. తన చిన్నారి కామినిని చంపుతామని వాళ్లు బాకు చూపుతుండటంతో సీమ నడకవేగం హెచ్చించింది.

పిల్లల కారణంగానే తల్లిదండ్రులు బలహీనులవుతారేమో! పిల్లల కోసం ఎంతటి త్యాగానికైనా సిద్ధపడతారు. ఇప్పుడు సీమకు కూతురు తప్ప ఏం మిగిలింది?

ఓ బొమ్మ నెత్తుకుని కామిని నడుస్తోంది! ఆమె చేయి పట్టుకుని సీమ!! అలా చాలా దూరం నడిచారు. మఖ్దుమ్‌పూర్ సమీపంలోని మరో నగరం నుండి పోలీసులు కుమక్ గ్రామ పరిసరాలకు వచ్చారని అటు నుండి వస్తున్న వ్యక్తి వీరికి వార్త అందించి పరుగులంకించుకున్నాడు.

పోలీసులముందు తమ పప్పులేం ఉడకవని గూండాలకి తెలుసు. క్రమంగా ఒక్కొక్కరే చీకట్లో వెనక్కి తగ్గసాగారు. బాధితులకు అభయమిస్తున్నట్లుగా పోలీసులు గాలిలో కాల్పులు జరపటంతో హిందువులకు ప్రాణం లేచివచ్చినట్లయింది.

గూండాలందరూ పారిపోగా ఒకే ఒక్కడు మిగిలాడు. వాడు సీమను పక్కనున్న పొలాల్లోకిలాక్కు వెళ్లాడు. కొంతదూరంవెళ్లి గొడ్డలి కిందపెట్టాడు. క్షణాల్లో సీమపై అత్యాచారం చేయబోయాడు. సీమ కాస్సేపు పెనుగులాడింది, బతిమిలాడింది. తనను వదిలెయ్యమని కాళ్లపట్టుకుని ఏడ్చింది. చివరికి తన వేలి బంగారపుటుంగరం తీసి అతనికిచ్చి తననేం చేయవద్దని వేడుకోసాగింది. అయినా ఆ దుండగీడు వెనక్కి తగ్గలేదు.

సీమ దుర్గాదేవి ఆవేశించినట్లుగా మరుక్షణం కిందికి వంగి గొడ్డలిని అందుకుంది. తనపై చేయివేస్తున్న వాడి మెడను కసిగా నరికివేసింది.

రెప్పపాటులో ఊహించని ఈ సంఘటన జరిగిపోయింది. ఆశ్చర్యపోబోయి ప్రాణాలు కోల్పోతున్న దుండగుని రక్తం చివ్వున ఎగిసి పరిసరప్రాంతం రక్తమయమైంది. ఆ దుర్మార్గుడి మొండెం కాస్సేపు గిలగిలకొట్టుకుని ఆగిపోయింది.

శవాన్ని చూసి భయభ్రాంతురాలైన సీమ పెద్దగా అరుస్తూ ఖాళీ మైదానంవైపు పరుగెత్తుకు వచ్చింది. ఆకాశంపై మేఘాలు దట్టంగా అలముకున్నాయి. ఏ క్షణాన్నైనా వర్షం పడవచ్చు ఆ చీకట్లో ఎక్కడికి పారిపోవాలో, ఏం చేయాలో పాలుపోలేదు.

తనేం చేసింది? ఓ నిండు ప్రాణాన్ని నిలువునా తీసింది. ఇక తనకీ వాళ్లకీ తేడా ఏముంది? తను తప్పుచేసిందా? నరహత్య పాపంకాదూ! ఆ ఘోరకలి జరిగిన చోటికి వెళ్లి క్షమ అర్థిస్తే.. ఏమో! పోలీసులు వచ్చి తనను బంధిస్తే... శిక్షపడుతుంది. తను అపరాధా? కాదు. తను నిరపరాధి. తన మానసంరక్షణకోసం చంపక తప్పలేదు. భారతీయస్త్రీకి శీలాన్ని మించిందేముంటుంది? శీలం నష్టపోవటంకంటే మరణించటం మేలు. పతితగా సమాజంలో నిందలకు గురవుతూ బతకాల్సి వచ్చేది! వాణ్ణి వదిలితే శీలం చెరచకుండా వదిలేవాడా? తను చేసింది సరైనదే! దురాలోచనతో దుష్క్రియకు పూనుకోబోయిన అతనికాశిక్ష పడాల్సిందే! మరి ఇప్పుడు తను ఎక్కడికి వెళ్లాలి? దాహంతో నోరెండిపోతోంది. భయంతో గుండె ఆగిపోయేలా ఉంది.

తన చిన్నారి కామిని ఏదీ? అయ్యో!!

సీమకి కళ్లు తిరిగాయి. స్పృహకోల్పోయి పడిపోయింది.

సీమ స్పృహ తప్పిపోయిన స్థలం జమీందారు జాహిద్ ఆలీఖాన్‌ది. అతని తండ్రి

పేరు ప్రఖ్యాతులున్న జాగీర్దారు. తల్లిదండ్రు లిద్దరూ మరణించటంతో ప్రస్తుతం జాహిద్ ఒంటరిగా ఉంటున్నాడు. సివిల్ సర్వీస్ పరీక్షలలో ఉత్తీర్ణుడై శిక్షణ పొందిన విద్యా ధికుడు. మేధావి. విదేశ రాయబార కార్యా లయాల్లో తన చదువుకు తగిన ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్నాడు.

అతని ఫారం-హవుజ్ సమీపంనుండే ఆ దుర్మార్గులు వెళ్ళినప్పుడు ఆ సందడి జాహి ద్‌కి వినిపించింది.

అప్పుడతడు భోంచేస్తున్నాడు. భోజనం ముగిశాక కాస్సేపు చల్లగాలిలో తిరిగిరావా లని బయల్దేరాడు. అతని వెంట ముగ్గురు నౌకర్లున్నారు. ప్రస్తుత పరిస్థితులను గురించి ఆలోచిస్తూ "మనిషి మనుగడకు ఎంతటి ముప్పు వాటిల్లుతోంది? దారు ణాలు ఎప్పుడు తగ్గుతాయి? శాంతిసు మాలు వెల్లివిరుస్తాయా? " అని తీవ్రంగా తనలోతనే తర్కించుకుంటున్న అతడు ఓ మేఘం గర్జించటంతో ఈ లోకంలోకి వచ్చి పడ్డాడు. చుట్టూ నిశితంగా చూస్తూ నడక కొనసాగించాడు.

ఆకాశంలో ఓ మెరుపు మెరిసింది. మేఘాలు ఉరమసాగాయి.

ఆ మెరుపుల వెలుగులో జాహిద్ దృష్టి స్పృహతప్పి పడివున్న సీమవైపుకు మళ్ళింది.

ఆశ్చర్యంగా ఆమె దగ్గరికి వచ్చాడు. ఆమె సౌందర్యం అతన్ని ఆకర్షించినా ఆమె పరి స్థితి జాలి కలిగించింది. ఆమె శరీరంపై రక్తపు మరకలు చూసి ఎవరో ఆమెని గాయపర్చారనుకుని పరిసరాలను బ్యాటరీ లైట్ వెలుగులో పరిశీలించసాగాడు. రక్తం చుక్కలు దారిచూపగా పొలం మధ్యలోకి వెళ్ళాడు. నగ్నంగా పడి ఉన్న మగశవాన్ని చూడగానే జరిగిందేమిటో ఊహించుకు న్నాడు.

చేనుకావల ఆ శవాన్ని పూడ్చిపెట్టమని తన అనుచరులను ఆదేశించి, రక్తం మర కలు చెరిపి వేయించాడు. ఎవరికీ ఏ అను మానం రాకుండా ఏర్పాట్లుచేసి వారి సాయంతోనే సీమను తన ఇంటికి చేర్చాడు.

సీమని ఇంటికి చేర్చి పక్కపైన పడుకోబె ట్టాడు. ముఖంపై నీళ్లు చిలకరించాడు. కాస్సేపటికి సీమకి స్పృహ రాగా కళ్లు తెరి చేసరికి జాహిద్ గండం గట్టెక్కిందన్నట్లు నిట్టూర్చాడు. కానీ ఆమె మగతగా అలాగే పడుకునేసరికి జాహిద్ ఆమె నాడి

చూశాడు. అది వేగంగా కొట్టుకుంటోంది. ఆమె మనసులో అశాంతిని అణచుకోవాలని

చేస్తున్న తీవ్రప్రయత్నానికి ముఖకవళికలే సాక్ష్యం చెబుతున్నాయి. ఆమె పరిస్థితి చూసి డాక్టర్‌ని పిలిపించాలనుకున్నా ఇంత రాత్రివేళ ఏ డాక్టరొస్తాడు? అక్కడికి ఆ పరిస్థితుల్లో డాక్టర్ని పిలవటమంటే కష్టాల్ని ఆహ్వానించినట్లే! మరి ఉపచారాలు, మందులూ లేకుంటే ఆమెకేమైనా ప్రమాదం వాటిల్లితే... ఆలోచిస్తుంటే ఒక ఆలోచన వచ్చింది. లేచి నిద్రమాత్ర తీసుకుని ఆమెకు బలవంతంగా మాత్రవేసి మంచి నీళ్లు తాగించాడు. మాత్ర ప్రభావంతో సీమ నిద్రలోకి జారుకుంది. జాహిద్ పక్కగది లోకి వెళ్ళి పడుకున్నా, రాత్రంతా మధ్య మధ్య వచ్చి చూసి వెళ్తూనే ఉన్నాడు. తెల్ల వారాక అతను వచ్చేసరికి ఆమె ఇంకా నిద్ర లోనే ఉంది.

తెల్లవారి సుమారు ఓ గంట గడిచాక సీమ కళ్ళు తెరిచింది. నలువైపులా అపరి చిత వాతావరణం. అది ధనికుల ఇల్లు అని గుర్తించింది. గూండాల్ని తప్పించుకున్నా శ్రీమంతుల ఇంట్లో బందీగా చిక్కుకున్నాన నుకుందామె! ఇక్కడినుండి విముక్తి పొందటం ఘోరింత కష్టం! "భగవంతుడా! నన్నెందుకు బ్రతికించావ్? ఇలాంటి రోజులు చూడడానికేనా" అనుకోసాగింది.

ఇంతలో జాహిద్ వచ్చాడు. అపరిచితు డైన అతన్ని చూడగానే భయంతో కంపిం చింది సీమ!

"భయపడకు! నీకు ఇక్కడ ఏ అపాయమూ లేదు" అన్నాడు జాహిద్ చిరునవ్వుతో.

"నన్ను చంపెయ్యండి! నన్ను హింసించవద్దు..." అరిచింది సీమ.

"ఇక్కడ నేను తప్ప ఎవరూ లేరు. నా పేరు జాహిద్! నిన్నెవరూ ఏమీ అనరు..'

అంటూ వంటమనిషిని పిలిచి పాలు తెమ్మని చెప్పాడు. ఆమె పాలు తీసుకురాగానే అతను గ్లాసు అందుకుని సీమకి స్వయంగా అందించాడు.

అతని సహృదయతని చూసి ఆమెకు విశ్వాసం కలిగినా ఆమె వ్యాకులత పూర్తిగా తొలగిపోలేదు.

"నిన్నటినుండి ఏమీ తినలేదనుకుంటాను. తేనె కలిపిన పాలు తీసుకోండి. తేనె శరీరానికి మంచిదనీ, శక్తినిస్తుందనీ అంటారు" అన్నాడు జాహిద్.

జాహిద్ ప్రవర్తనతో సీమ కళ్లు చెమరించాయి. దుఃఖంతోనో, సంతోషంతోనో వచ్చిన కన్నీళ్లు కావవి... కృతజ్ఞతను రంగరించుకుని పొంగిన కన్నీళ్లవి. జాహిద్ చేతిలోనుండి గ్లాసందుకుని కాసిని పాలు తాగి గ్లాసు బల్లపై పెట్టింది. జాహిద్ పదేపదే తాగమని బలవంత పెట్టటంతో మిగతా

పాలూ తాగక తప్పలేదు.

సీమ మరికొంచెం తేరుకోవటం చూసి, "మీ పేరేమిటో తెలుసుకోవచ్చా?" అన్నాడు జాహిద్ ఎంతో మర్యాదగా.

సీమ మౌనంగా ఉండిపోవటంతో, "నాపై, ఇంకా నమ్మకం కుదరలేదనుకుంటాను. మీ పాపిటలో సింధూరం, నుదుట కుంకుమ మీరో హిందూ మహిళ అని చెప్పకనే చెబుతున్నాయి. ఈ కారణంగా మీరు భయపడాల్సిన పనేమీలేదు. మావల్ల మీకే అపకారమూ జరగదు. నమ్మటం, నమ్మకపోవటం మీ ఇష్టం. మాటకు బద్ధులమై ఉండటం మా వంశంలోని ప్రత్యేకత"

"నా పేరు సీమ! నా పాపిడిలో కుంకుమ..." అంటూనే ఆమె గొంతు పూడుకుపోయి వెక్కి వెక్కి ఏడవసాగింది. కాస్సేపలా గడిచాక శాంతించి, "ఓ దుర్మార్గుడు విషం పూసిన కత్తిని నా భర్తపై ప్రయోగించాడు. బ్రతకటం అసంభవం అని వాడు వికటాట్టహాసం చేస్తుంటే విన్నాను. నేనో ముసల్మాను వ్యక్తిని హత్య చేశానన్న నిజం మీకు తెలిస్తే మీరిలా నన్ను ఆదరించరు..."

"నీ కథంతా తెలుసు. అతన్ని పూడ్పించి రక్తం మరకలు కన్పించకుండా ఆ ప్రదేశమంతా శుభ్రం చేయించాను. మనిషి కుల మతాలతో నాకు నిమిత్తంలేదు. మానవత్వం ప్రధానమని భావించే మనిషిని నేను..." అన్నాడు జాహిద్ గంభీర స్వరంతో.

సీమకు జాహిద్‌పై క్రమంగా విశ్వాసం పెరగసాగింది. అయినా "ముస్లిం వ్యక్తిని చంపిన మహిళకు మీ ఇంట్లో ఆశ్రయమిచ్చారని మీ వాళ్ళకు తెలిస్తే...?" అంది బితుకు బితుకుగా.

"తెలిస్తే తెలియనీ... నాకేం భయం లేదు. మా పైగంబర్ హజరత్ మొహమ్మద్ సాహిబ్ అప్పటి అరబ్ సమాజం హితవు కోరి ఎన్ని కష్టాల్ని సహించలేదు? ఆయన మక్కా వదిలి మదీనాకి వెళ్ళిపోవాల్సివచ్చింది. కాని ఆయన తన సంకల్పం నుండి విచలితుడు కాలేదు..."

"జాహిద్‌పై సంపూర్ణ విశ్వాసం కుదిరిన సీమ ఏదో చెప్పాలనుకుని ఆగిపోయింది. ఇది గమనించిన జాహిద్, "సీమా! ఏదో చెప్పబోయి ఆగిపోయావెందుకు? ఏమిటో చెప్పు! నేను ఏకవచనంతో సంబోధిస్తున్నాను. నువ్వూ అలాగే పిలువు!" అన్నాడు.

నిష్కల్మష హృదయంతో పలికే మాటలకు ప్రభావం ఉంటుంది.

"నా కూతురిని ఆ దుండగులు ఏం చేశారో... అందరికందరూ క్రూరులే! నా

ప్రాణాలన్నీ నా బిడ్డపైనే ఉన్నాయి. మా అమ్మాయి కామినికోసం నేను ఏ బలిదానమైనా చేయడానికి సిద్ధంగా ఉన్నాను. అది దుండగుల కత్తులకు ఎరైపోతే నేను బతికీ ప్రయోజనంలేదు. అలా అని మా కోసం నిన్ను ప్రమాదాలలోకి పంపించలేను..."

"ఈ విషయంలో నువ్వు చింతించే పని లేదు. దుండగులు నా ఫారం హౌజ్ మీదుగానేకదా వెళ్ళారు...! చుట్టుపక్కల ఊళ్ళలోనే ఉండిఉంటారు..."

జాహిద్ నౌకరుని పిలిచి తన గుర్రాన్ని సిద్ధం చేయమన్నాడు. అతని వెనకాలే రక్షణగా, తోడుగా మరో ఇద్దరు నౌకర్లు రెండు గుర్రాలపై బయల్దేరారు.

కామినిని వెతకడం కోసం ఆ కొద్ది నిమిషాల వ్యవధిలోనే జాహిద్ బయలుదేరుతాడని ఊహించని సీమ దిగ్భ్రమ చెందింది.

జాహిద్ ఇంత త్వరగా బయల్దేరడానికి బలీయమైన కారణం ఉంది. జాహిద్ తల్లిదండ్రులకి ఏకైక సంతానం. అతనికి 8 ఏళ్ళ వయసున్నప్పుడు ఓ రోజున తన మేనమామ ఇంటికి వెళ్ళాడు. ఆ రాత్రి మేనమామ బలవంతంపై అక్కడే ఉండిపోయాడు. ఎంతకీ కొడుకు రాకపోయేసరికి జాహిద్ తల్లిదండ్రులు అర్ధరాత్రి మేనమామ వాళ్లింటికి వచ్చారు. ఎంత కొడుకైనా... 'మరీ ఇంత ప్రేమా? గారాబమా?' అని మేనమామ ఇంట్లోవాళ్లు జాహిద్ తల్లిదండ్రుల్ని ఎగతాళి చేశారు. అయినా వాళ్ళేం పట్టించుకోకుండా జాహిద్‌ని తీసుకుని తమ ఇంటికి వచ్చేశారు. ప్రేమ హృదయ సంబంధమైనది. సీమ కన్నీళ్లు చూసి జాహిద్‌కి తన తల్లిదండ్రులు గుర్తొచ్చారేమో! సీమ హృదయం ఎలా విలపిస్తున్నదో సులభంగానే ఊహించుకోగలిగాడ తను.

జాహిద్, అతని అనుచరులు చుట్టుపక్కల గల నాలుగు ఊళ్లలో ముందుగా ఒక ఊరికి వచ్చారు. గ్రామపెద్ద ఐదుక్రోసుల దూరంలో ఉన్న ఓ బస్తీకి వెళ్ళాడని తెలిసింది. ఇల్లిల్లు తను తిరుగుతాడుకదా! ఆ బస్తీని వెదుక్కుంటూ వెళ్ళి ఆ గ్రామపెద్దను కలుసుకున్నారు. తను వచ్చిన పని అతనికి చెప్పాడు జాహిద్ రహస్యంగా. ఆ గ్రామపెద్దకు జాహిద్ కుటుంబంపై ఎంతో గౌరవం ఉంది. ఆ గ్రామపెద్ద ఓ గుర్రం ఎక్కి వీరికి తోడుగా తనూ బయల్దేరాడు. మఖ్దుమ్‌పూర్ లూటీకి ఎవరెవరు వెళ్ళారో అతనికి

తెలుసు. ఆయా వ్యక్తుల ఇళ్లకి వెళ్ళి విచారించగా, వాళ్ళంతా ఇంకా ఊళ్ళోకి రాలేదని తెలిసింది. గ్రామపెద్ద అన్నాడు- "హుజూర్! బహుశా వీరు పోలీసులకి చిక్కి ఉంటారు. లేదా మరో ఊళ్లో దాక్కుని ఉండిఉంటారు. పదండి! వెదుకుదాం..." అంటూ బయల్దేరదీశాడు.

రెండో గ్రామానికి వెళ్ళి అన్వేషిస్తే ఫలితం కన్పించలేదు. వచ్చినపని పూర్తికానిదే వెనుతిరుగని ధీరుడు జాహిద్. మరో రెండు గ్రామాల్లో వెదకాలి. అందరూ కలిసి మూడవ గ్రామానికి బయల్దేరారు. ఊరు చేరగానే ఆ ఊరి గ్రామపెద్ద వద్దకు వెళ్ళారు. వచ్చినపని చెబితే లూటీదార్లంతా ఈ ఊళ్లోనే ఉన్నారని తెలిసింది. అయితే వారిలో ఒక్కవ్యక్తి కన్పించటంలేదనీ, బహుశా పోలీసులకు దొరికిపోయాడేమోననీ మిగతావాళ్ళు భావిస్తున్నట్లుగా తెలిసింది. ఆ వ్యక్తి వివరాలు తనకు తెలిసినా మౌనంగా ఉండిపోయాడు జాహిద్. ఆ ఊరి గ్రామపెద్ద జాహిద్‌ని తమ ఇంటికి ఆహ్వానిస్తూ, "ప్రభూ! మా ఇంటికి దయచేయండి. మొక్కజొన్న రొట్టెలు, మజ్జిగతో భోజనం చేయ్యండి. దోపిడీదార్లు ఓ చిన్న పాపను వెంబడించుకొచ్చారని విన్నాను. బహుశా మీరు వెదికే అమ్మాయీ, ఈ అమ్మాయీ ఒక్కరే కావచ్చు..." అని తను లూటీదార్లు చేసిన విడిదివైపు వెళ్ళాడు అతని పరిజనం అతిథులను ప్రేమగౌరవా

లతో అపూర్వంగా సత్కరించి, విందుభో జనం వడ్డించారు.

గ్రామపెద్దను ఎదిరించే సాహసం లూటీ దార్లకు లేదు. ఆయన సమ్మతంపైనే వీళ్ళు సురక్షితంగా అక్కడ ఉన్నారుమరి! అడగ్గానే అమ్మాయిని గ్రామపెద్దకు అప్పగించారు. పాపను తీసుకుని వెంటనే ఆయన జాహిద్ వద్దకు వచ్చి అమ్మాయిని అందించాడు.

సీమ పోలికలు కొన్ని ఆ అమ్మాయిలో కన్పించాయి జాహిద్‌కు. పెద్ద కళ్ళు, గులాబీవర్ణంలో మేను... సీమ కూతురేనని చెప్ప కనే చెప్పాయి. పాపవైపు చూస్తూ, "పాపా నీ పేరేమిటమ్మా" అని అడిగాడు ఆప్యాయంగా.

"కామిని" అందా అమ్మాయి బితుకు బితుకుగా.

పాపను అప్పగించినందుకూ, తనకు చక్కని ఆతిథ్యం ఇచ్చినందుకూ గ్రామపెద్దకు కృతజ్ఞతలు చెప్పి తన అనుచరులతో బయల్దేరాడు జాహిద్. ఫారంహౌజ్‌కి చేరేసరికి మధ్యాహ్నం రెండు గంటలైంది. అక్కడే గుర్రాల్ని నిల్పి లోపలికి వెళ్ళాడు.

సూర్యుడు అస్తమిస్తున్నా ఇంకా జాహిద్ తదితరులు ఇల్లు చేరుకోకపోయేసరికి సీమ ఆందోళన చెందుతోంది. ఆమెను రకరకాల భయాలు వేధిస్తున్నాయి. కొంపదీసి జాహిద్‌కేదైనా హాని తలపెట్టలేదుకదా? ఏమో? తిరుగుబాటుదార్లకు న్యాయం ఉంటుందా? ... భయాలు, సందేహాలు ముప్పిరిగొనటంతో వెర్రెత్తినదానిలా గదిలో పచార్లు చేయసాగింది సీమ. చీకటి దట్టమయ్యాక గుర్రపుడెక్కల చప్పుడు లీలగా విన్పించేసరికి పరుగుపరుగున తన గది నుండి బయటికి వచ్చింది ఆమె! దూరం నుండి ధూళి రేపుతూ వస్తున్న అశ్వాలు కనిపించాయి. అశ్వారోహకులు ఎవరో, ఏ వార్త తెస్తున్నారో తెలియక, ఊహించుకోలేక బెంబేలుపడింది సీమ! ఇలాంటి మానసిక స్థితిలో దైవప్రార్థన తప్ప మరో ఉపాయం ఏం ఉంటుంది? ఆకాశంవైపు చూస్తూ చేతులెత్తి, "ఓ సృష్టికర్తా! రసూల్- అవతారాలలో ఎవరు నీకు దగ్గరవారో తెలియదు. కృష్ణుడు, యేసుప్రభువు, మహమ్మద్ సాహెబ్‌లలో ఎవరు నీకు ప్రీతిపాత్రులు! ఏ పేరుతో పిలిస్తే నీకు ఇష్టం? నేను అన్ని పేర్లతో నిన్ను పిలుస్తున్నాను. వేడుకుంటున్నాను. జాహిద్, కామినిల జీవితాలు నీ చేతిలో ఉన్నాయి. వీరిద్దరినీ నువ్వే రక్షించాలి! ప్రభూ! నువ్వే కాపాడాలి!"

సీమ ప్రార్థిస్తుండగానే జాహిద్ తదితరులు అక్కడికి వచ్చేశారు. జాహిద్ ముఖంలో సంతోషం వెల్లివిరుస్తోంది. అతని వెంటనున్న కామినిని చూడటంతో సీమ ఒక్క ఉదుటున కూతురివైపు పరుగు దీసింది. కొంగుజారిపోతున్నా పట్టించుకోనంతటి ఉద్వేగం, ఆనందం ఆమెను ఆవరించాయి.

జాహిద్ కామినిని అందివ్వగానే సీమ ఉల్లాసంతో మరో ప్రపంచంలోకి వెళ్ళిపోయిందానిలా తోచింది. కూతుర్ని గుండెలకు హత్తుకుని సంతోషం, దుఃఖం కలగాపులగం కాగా కన్నీళ్లు పెట్టుకోసాగింది. తల్లి ఏడ్చేసరికి కూతురికీ ఏడుపు ఆగలేదు. "నన్ను వదిలి ఎక్కడికెళ్ళావు తల్లీ! మీ అమ్మని వంటరిగా విడిచి మళ్ళీ ఎప్పుడూ వెళ్ళద్దు. కామినీ... నా చిట్టీ... నువ్వు లేకుండా నేను బతకలేనే అమ్మా..." సీమ పదేపదే ఉన్మాదిలా అవే మాటలు పలకసాగింది. కామినిని ముద్దులు పెట్టుకుంటూ, గుండెలకు హత్తుకుంటూ కన్నీరు కురిపిస్తూనే ఉంది. ఇలా పిచ్చిగా ప్రవర్తించటమే ప్రేమకు చరమసీమ కాబోలు! ఈ స్థితికి వచ్చాక తనను తనే మర్చిపోలేనివారు అరుదనే చెప్పాలి!

జాహిద్ మౌనంగా ఈ సన్నివేశాన్ని పరికిస్తున్నాడు. ఈ దృశ్యం చూస్తుంటే అతనికి తన తల్లి జ్ఞాపకానికి వచ్చింది. చేతి రుమా

లుతో కళ్లు తుడుచుకున్నాడు. తన భావాలను అణచి ఇంట్లోకి పదమని సీమని కోరాడు. కృతజ్ఞతగా, సంతోషంగా అతని వైపు చూసి కామినిని ఎత్తుకొని లోపలికి వెళ్ళింది సీమ. కాస్సేపటివరకూ కళాహీనంగా కన్పించిన ఆ ఇంటిగోడలు ఈ క్షణంలో తేజోమయంగా తోచసాగాయి సీమకి.



ఆక్రమణదార్లు దాడిచేసి విధ్వంసం సృష్టించి వెళ్ళాక మఖ్దుమ్‌పూర్ గ్రామ పరిస్థితి దయనీయంగా మారింది. పిల్లలే హత్యాకాండకి ఎక్కువగా గురయ్యారు. మరణించినవారిలో వృద్ధులూ, యువకుల సంఖ్యా కూడా తక్కువేమీ లేదు. ఆ కాళరాత్రి ఎందరికో అంతిమరాత్రి అయింది. క్షతగాత్రుల సంఖ్య మరణించినవారికంటే ఐదురెట్లు ఉంది. మిగిలిన కొందరు లాంతర్లు పట్టుకుని గాయపడ్డవారి మధ్య, శవాల మధ్యా తిరుగాడుతున్నారు. వాళ్లు గాయపడ్డవారికి సహాయమందిస్తూనే తమ సంబంధీకులను వెదుక్కుంటున్నారు. అన్నలూ, తండ్రులూ, భర్తలూ... పోయిన స్త్రీలంతా రోదిస్తున్నారు. వారిని ఓదార్చేవారెవరూ లేరు. అందరూ వేదనను అనుభవిస్తున్నవారే మరి! తల్లిదండ్రుల శవాల వద్ద ఒక పాప కూర్చుని పులుకు పులుకున చూస్తూ ఉంది. బహుశా వాళ్లు కాస్సేపటికి మేల్కొంటారని !ఆశగా ఎదురుచూస్తోంది కాబోలు! ఆ నిద్రనుండి ఎవరూ మేల్కొనలేరని ఆమెకేం తెలుసు? రెండు రోజులకిందటే పెళ్ళయిన ఓ నవవధువు కంటికీ మంటికీ ఏకధారగా విలపిస్తోంది. ఓ వృద్ధురాలు ఆమెని ఓదారుస్తూ, "ఏడవకు తల్లీ! ఈ ఏడ్పు ఇక జీవితమంతా ఉండేదే! ఈ దుఃఖం నీ ఒక్కదానిదే కాదు మాది కూడా!" అంటోంది.

ఈ ఘోరకలి తరువాత మఖ్దుంపూర్ వాసులకు ముసల్మానులపై, స్థానిక పోలీసు అధికారిపై కోపం, అసహ్యం పెల్లుబికాయి. కానీ చేసేదేం ఉంది? తమ కోపాన్ని మింగుకోవటం తప్ప ఏమీ చేయలేని నిస్సహాయత వారిది. ఈ సంఘటనను చూసి, కష్టాలకు గురైనవారి మనసు ఆ దుర్మార్గుల పట్ల, ఈ ఘోరకలిని చేసిన వారిపట్ల పెరిగిన వ్యతిరేకత ఏదో ఒకనాటికి, ఏదో ఒక రూపంలో వ్యక్తమవకమానదు. రావీ నదికి పశ్చిమదిశలో నివసించే హిందువులు తూర్పువైపున జరిగిన ఉదంతాన్ని విని పలురకాల వ్యాఖ్యానాలు చేస్తున్నారు. దెబ్బకు దెబ్బ అనేవారు కొందరు కాగా, భారతదేశంలో ముసల్మానుల్ని హత్య చేస్తే మాత్రం పోయినవారు బతుకుతారా అని మరికొందరు. రావీ నదికి తూర్పువైపునా, పడమరవైపున గల జనాభాలో కొందరు హిందువులూ ముస్లిములు మరొక విధంగా ఆలోచించేవారు. "హత్యలు హిందుస్తాన్‌లో చేస్తే ఏం? పాకిస్తాన్‌లో జరిగితే ఏం? శవం హిందువుదైతేనేం? ముస్లిందైతేనేం? ప్రవహించే రక్తం మనిషిదే కదా?" అని బాధపడే తటస్థ వర్గీయులూ ఉన్నారు.

దుఃఖ సమయంలో రాత్రిళ్లు చాలా సుదీర్ఘమైనవిలా భ్రాంతి కలుగుతుంది. దేవుణ్ణి తలచుకొంటుండగానే రాత్రి గడిచిపోయింది. తెల్లవారింది. రాత్రి జరిగిన సామూహిక హత్యలు సూర్యరశ్మికి మరింత స్పష్టంగా కన్పించసాగాయి. అస్పష్టమైన



దృశ్యాలన్నీ స్పష్టంగా దృగ్గోచరం అవుతు న్నాయి. హిందువుల ఇళ్లకు పెట్టబడిన నిప్పు ఇప్పటికీ దాని ప్రభావం చూపుతూనే ఉంది. భగభగమంటూ గృహాల్ని దహనం చేస్తున్న మంటలు ఆరేదెప్పటికో? ఊళ్లో

ఒకే ఒక్క ఆలయం ఉంది. దుర్మార్గులు దాన్ని కూడా కాల్చేసి బూడిదగా మార్చారు. సూర్యుడు కన్పించినట్లే కన్పించి వెళ్ళిపో యాడు బహుశా మానవుని ఈ హింసా పూర్ణ కృత్యాలని చూడలేక కాబోలు!

ప్రస్తుతం విగతజీవులకు అంతిమ సంస్కారం, క్షతగాత్రులకు చికిత్స చేయవల సివుంది. బతికినవారిలో ఓ డాక్టరు కూడా ఉండటం కాసింత ఊరట కల్గించేదిలా ఉంది. గాయాలకు వేసేందుకు మందు, బ్యాండేజ్ లాంటివి దొరికితే కనీసం కొంద రైనా మిగులుతారనిపించిందతడికి. మఖ్దుం పూర్లోని ముస్లిం కుటుంబాలలోని వారు కొందరు కుతూహలంగా హత్యాకాండ జరి గిన ప్రాంతానికి చూడడానికి రాసాగారు. అలా వచ్చిన వారిలో ఒక వ్యక్తి అంతకు



ముందు ఆ డాక్టరుగారి దగ్గర చికిత్స పొందినవాడే! డాక్టరు అతన్ని చాలా కాలంగా చూస్తున్నాడు! ఆ వ్యక్తిని పలకరించి మందులు తెమ్మన్నాడు డాక్టరు. మరి మందులకు డబ్బు కావాలికదా ఎలా? అని ఆలోచిస్తున్న డాక్టరుగారికి తన తల్లి గుర్తొచ్చింది. దుండగుల చేతులలో ప్రాణాలు కోల్పోయిన అతని తల్లి మెడలో బంగారపు నగ ఉంది. తల్లి దగ్గరికి వచ్చి ఆమె కాళ్లకు నమస్కరించి, బాధగా మెడలోనుండి ఆ హారం తీశాడు. ఆ వ్యక్తికి ఇచ్చి ఇది అమ్మి అవసరమైన మందులు కొనితెమ్మన్నాడు డాక్టరు. సరేనంటూ నగ పట్టుకెళ్లిన వ్యక్తి ఎంతకీ తిరిగి రాకపోయేసరికి డాక్టరుగారికి విపరీతమైన ఆశ్చర్యం కలిగింది. మనుషులు ఇంతలా పతితులవుతారని అతనే నాడూ ఊహించలేదు. ఇలాంటి వారికోసం ఈశ్వరుడు ఒక కొత్తరకమైన నరకం సృష్టించాలి కాబోలు! అనుకుంటూ నిట్టూర్చాడు.

మృతదేహాలకు అంతిమ సంస్కారాలు చేయడానికి బతికి ఉన్నవారు ప్రయత్నాలు ప్రారంభించారు. శవాల్ని శ్మశానానికి తీసుకువెళ్ళడం ఎలా? అన్నదే వారి ప్రస్తుత సమస్య. ఊరికి రెండు మైళ్ల దూరంలో శ్మశానం ఉంది. అంతలో నగరంనుండి వచ్చిన రక్షకభట బృందం ఘటనాస్థలి సమీపంలోనే విడిది చేసింది. తమాషా చూద్దామని వచ్చినవారిని పంపేసిన పోలీసు ఇన్స్పెక్టర్ శ్మశానంవరకు శవాలను చేరవేసేందుకు వాహనాల్ని ఏర్పాటు చేశాడు. గాయపడినవారికి ప్రాథమిక చికిత్సలు చేయించాడు. అంతిమ సంస్కారాలు ముగిసి ఇళ్లకు చేరేసరికి సమయం మధ్యాహ్నం పన్నెండు దాటింది. రాత్రి నుండి అందరూ నిరాహారంగా ఉన్నారు. మనసు భారంగా ఉండటంతో కొంచెం ఎంగిలిపడి లేచారు. తరువాత విశ్రమించారు.

మృతులకు శాస్త్రోక్తంగా కర్మకాండ జరిపించలేకపోయినా కనీసం ధర్మబద్ధంగా గీతాపఠనమైనా చేయాలనుకున్నారు కొందరు. దీనివలన రోదనలు, ఆలోచనల నుండి మనసు ఆధ్యాత్మికంవైపుకు మళ్ళుతుందని వారి ఆశ. పంతులుగారు శ్రావ్యంగా గీతాలాపన చేస్తుంటే శ్రోతలు తన్మయులవుతారు. అందుకే మధ్యాహ్నం రెండు గంటల తర్వాత గీతాపఠనం ఏర్పాటు చేశారు. కర్మకాండలలో గీతాలాపన పంతులుగారికి కొత్తేమీ కాదు. కానీ ఇవాళెందుకో ఆయన అన్యమనస్కంగానే పఠిస్తున్నాడు. మనస్ఫూర్తిగా ఎలా పఠించగలడు మరి? పాతికేళ్ల నవయువకుడైన కొడుకు దుష్టుల గొడ్డళ్లకు ఆహుతైపోయాడు. అలవాటుగా స్వరం ఆలపిస్తున్నా హృదయం రోదిస్తోంది. శ్లోకాలకు వ్యాఖ్యానం చేయలేకపోతున్నాడు.

మరుసటిరోజు స్థానికులు పోలీస్ ఇన్స్పెక్టర్‌తో దుండగులు అపహరించిన మహిళల్ని వెతికించమని ప్రార్థించారు. నగర పోలీసులకు తోడుగా స్థానిక పోలీసులు ఉండటం అవసరం. ఎందుకంటే స్థానికులైతేనే ఆ ఊరి స్త్రీలని గుర్తిస్తారు. అపహరించబడిన స్త్రీలని వెదుకుతూ పోలీసులు బయల్దేరారు. నలుగురు మహిళలు కన్పించగా వారిలో ముగ్గురు తమ తమ ఇళ్లకు పోలీసుల సాయంతో వచ్చేశారు. తన కుటుంబం తనని ఈ స్థితిలో స్వీకరించదనే అనుమానంతో, బాధతో ఒకావిడ రానని నిరాకరించింది. అన్వేషకులు జాహిద్ ఇంటి పరిసరాలవైపుకు రాలేదు. ఆ వచ్చిన ముగ్గురు మహిళల్లో ఇద్దరి భర్తలు మరణించారు. వారి అంతిమ సంస్కారాలూ అయిపోయాయి. వాళ్ళ శోకం వర్ణనాతీతం.

వలస వచ్చిన పదివేలమంది భారతీయులను పాకిస్థాన్ రాజధాని రావల్పిండినుండి మఖ్దుంపూర్‌కి పంపిస్తున్నామనే అధికారుల సందేశం అందింది. తర్జన భర్జనలు చేసి వచ్చినవారిని 'మియాంచను' శరణార్థుల

క్యాంపుకి పంపించాలని పోలీసులు నిర్ణయించారు.

★ ★ ★

"విపత్తు అంటూ వస్తే ఒకటో రెండో చడీచప్పుడు లేకుండా రావు. ఓ సైన్యంలా ముంచుకువస్తాయి" అనే సామెతలాగే మఖ్దుంపూర్‌లోని హిందువుల పరిస్థితీ తయారైంది. మరుసటిరోజు పాకిస్థాన్ రాజధాని రావల్పిండినుండి జిల్లా అధికారులకు ఒక ఆదేశం వచ్చింది. భారతదేశం నుండి వచ్చిన పదివేలమంది బాధితులను మఖ్దుంపూర్లో నివసించడానికి పంపుతున్నామని దాని సారాంశం. హిందుస్తాన్‌లో రక్తపాతం పాలై వచ్చేవారిలో ప్రతీకారేచ్ఛ రగులుతుండవచ్చునని కొందరు మఖ్దుంపూర్‌వాసుల భయం. అందుకే వారు మఖ్దుంపూర్‌కి రాగానే మరో హత్యాకాండ జరుగుతుందనుకోసాగారు. ఇక అధికారులు ఇంత మంది శరణార్థులను ఎక్కడ విడిది చేయించాలా అని సందిగ్ధంలో పడిపోయారు. చాలాసేపు తర్జన భర్జనలు చేసి వాళ్లు ఓ నిర్ణయానికి వచ్చారు. హిందువుల్ని అక్కడి నుండి సమీపంలోనే గల మియాంచనూ శరణార్థుల క్యాంపుకు పంపించాలనుకున్నారు. ఈ నిర్ణయం కాగానే హిందువులున్న చోటికి వెళ్లి అందరూ ఉదయం 9 గంటలకు బస్సుల్లో మియాంచనూకి సిద్ధం కావాలని ప్రకటించారు.

జన సంఖ్య అత్యధికంగా ఉన్నందున ఎవరూ తమతో 20 కిలోల బరువుగల వస్తువుల్ని మించి తీసుకువెళ్ళకూడదని నియమం పెట్టారు. అయితే శరణార్థులకు వస్తువులను గురించిన చింత లేదు. వారి చరాస్తులన్నీ చాలావరకూ ఆక్రమణదారులు దోపిడీ చేసేశారు. లేదా కాల్చేశారు. వాళ్ళ బంధుమిత్రులు బలైపోగా చేసిన శవదహనపు మంటలింకా చల్లారనే లేదు. ఆచారం ప్రకారం ఆ బూడిదను నదీ ప్రవాహంలో ఇంకా కలపనేలేదు. కాని ప్రస్తుతం వివశత్వంతో బయల్దేరక తప్పని దయనీయస్థితి వారిది.

మర్నాడు మియాంచనూకి బయల్దేరడానికి బస్సులు వచ్చాయి. బస్సుల్లోకి ఎక్కక ముందు శరణార్థులు తమ మాతృభూమికి నమస్కరించారు. అశ్రువులు నిండిన కళ్ళతో తమ నగరాన్నీ, ఇళ్ళనీ చూసుకుని భారమైన మనస్సులతో బస్సుల్లో కూర్చున్నారు. తమ జన్మభూమికీ కర్మభూమికీ వారి చివరి ప్రణామం అది! వీరందరూ తమ గమ్యమేదో ఎరుగని బాటసారులు!

హిందూ శరణార్థులు ప్రత్యేక శిబిరాలకు వెళ్ళాక, స్థానికులు ఒక నిశ్చయానికి వచ్చారు. భారతదేశంనుండి వచ్చిన శరణార్థులు ముమ్ముందు మఖ్దుంపూర్‌కి వస్తారని అందరికీ అన్పించింది. ముస్లింలీగ్ రాజనీతి కారణంగా హిందూస్తాన్ విభజింపబడింది. దాని వాలంటీర్లు రాబోయే శరణార్థులకోసం చందాలు పోగుచేయటంలో నిమగ్నమై ఉన్నారు. ముస్లింలీగ్ సూత్రాలను జాహిద్ అలీఖాన్ సమర్థించకపోయినా ముస్లింలీగ్ స్వయం సేవకులు అతని నుండి ఐదువేల రూపాయల చందా వసూలుచేశారు. ఈ కారణంగానే సీమకి మఖ్దుంపూర్‌లో జరిగే విషయాల వివరాలు తెలియసాగాయి. చందాకై వచ్చేవారు సమస్త వివరాల్ని ఎక్కడపడితే అక్కడ బాహాటంగానే చర్చిస్తున్నారు.

★ ★ ★

మఖ్దుంపూర్ వాసులను ఊరినుండి శరణార్థుల శిబిరాలకి పంపించారని విన్న సీమ తను కూడా ఆ క్యాంపుకు చేరుకోవాలని నిశ్చయించుకుంది. జాహిద్‌కి భారంగా ఇంకా ఎన్నాళ్ళుండగలదు? పైగా జాహిద్ ఓ హిందూ మహిళకు ఆశ్రయం కల్పించాడని ముస్లింలకి తెలిస్తే ఇంకేమైనా ఉందా? ఈ విషయం జాహిద్‌కి ఎలా చెప్పాలి?

ఎలా ఒప్పించాలి? అన్నదే ప్రస్తుతం సీమకో సమస్యగా మారింది. ఉపకారం చేసిన- ఉపకారం పొందిన వారి మధ్య బాంధవ్యం ఎంతో సున్నితమైనది మరి!

జాహిద్ సీమకూ, కామినికీ కొత్త బట్టలు తెచ్చాడు. వాటిలో సీమకోసం తెచ్చిన నల్లని బురఖా ఉంది. కామిని ఆడుకునేందుకు రకరకాల బొమ్మలు తెచ్చాడు. ఈ వస్తువుల్నీ ముఖ్యంగా బురఖాని చూసి సీమ మనస్సెందుకో శంకించింది. తన అసహాయస్థితి నుండి జాహిద్ లాభం పొందాలనుకుంటున్నాడేమో! వారించక తప్పదని, "ఎందుకింత కష్టపడ్డారు? నన్నెలాగైనా మియాంచనూ క్యాంపులోకి చేర్చండి. నేను మా వాళ్ళందరితో కలిసి భారతదేశానికి వెళ్ళిపోతాను. తరువాత వంటరిగా వెళ్ళటం కష్టం"

"వాళ్ళు శిబిరానికి వెళ్ళారని నీకెలా తెలుసు? "

"చందాలు వసూలు చేస్తున్న ముస్లింలీగ్ కార్యకర్తలు ప్రతిచోటా ఈ అంశాన్నే చర్చిస్తున్నారు"

"మంచిది! కానీ మీవాళ్ళు రేపో, ఎల్లుండో వెళ్తున్నారనుకుంటున్నావా? కొందరైతే నెల రోజులుగా శిబిరంలో ఉన్నారు. ప్రభుత్వం వారిని ముందుగా పంపిస్తుందా! నిన్నా, మొన్నా చేరిన వారినా? ఈ విషయంలో నిర్ణయం తీసుకోడానికి మనకింకా చాలా సమయం ఉంది. ముందుగా స్నానం చేసి శుభ్రమైన బట్టలు వేసుకో. ఈ బురఖా నిన్ను ప్రమాదాల్నించి రక్షిస్తుంది. లేకపోతే రహస్యం బట్టబయలయ్యే ప్రమాదంఉంది"

బదులేమని చెప్పాలో తోచలేదు సీమకి. నిశ్శబ్దంగా లేచింది. కామినికి స్నానం చేయించింది. తనూ తలారా స్నానం చేసింది. జాహిద్ తెచ్చిన కొత్త దుస్తులు ధరించారు. ఆ బట్టల్లో సీమ సౌందర్యం మరింత ప్రకాశించసాగింది. సీమ మనోహర రూపాన్ని చూసి జాహిద్ ముగ్ధుడయ్యాడు. ప్రేమగా కామినిని ఎత్తుకున్నాడు. ముగ్గురూ కలిసి భోజనాలు చేసే గదిలోకి వెళ్ళారు. భోజనం ముగించి వరండాలోకి వచ్చాక చాలాసేపటివరకు జాహిద్ కామినితో ఆడుకుంటూ గడిపాడు. కామిని బొమ్మలతో వంటరిగా ఆడుకోవటంలో నిమగ్నమయ్యేసరికి జాహిద్ నెమ్మదిగా సీమ వద్దకి వచ్చాడు.

"సీమా! ఓసారి నీవన్న మాటలు జ్ఞాపకం ఉన్నాయా? "

"ఏమాటలు? "

తన కుర్చీని సీమకి దగ్గరగా జరుపుకుని,

"కామిని కోసం ఏమైనా చేస్తానన్నావు! ఆమెను తిరిగి పొందడానికి ఏ త్యాగానికైనా సిద్ధమేనన్నావు"

"ఇదేమైనా విశేషమా? ఏ తల్లైనా ఇలాగే అంటుంది"

"ఒక మాటడుగుతాను. ఏమీ అనుకోవుగా!"

"జాహిద్! నువ్వు నాకూ, కామినికీ జీవన దానం చేశావు. నీ మాటల్ని తప్పుగా ఎలా అనుకుంటాననుకుంటున్నావు? "

"నేను, నీవు, కామిని ఒకే కుటుంబ సభ్యులమైతే? "

"నేనన్న మాటలకు అర్థం చెప్పనా జాహిద్! కామిని ప్రాణం కాపాడుకోవటం కోసం నేను హిమాలయాన్నైనా ఎదిరిస్తాను. నా ప్రాణం అడ్డువేస్తాను. దయచేసి ఇంత భారీ వెల అడగకు..."

"నిన్ను చేసుకున్న తరువాత మరో పెళ్ళి చేసుకుంటానని నీ అనుమానం, భయం కాబోలు! నేను నా సమస్త ఆస్తిపాస్తుల్నీ నీ పేరున రాస్తాను. దీనికి హక్కుదారు కామిని అవుతుంది" అన్నాడు జాహిద్.

"జాహిద్! సిరి సంపదలు, నగలు, భవంతులు మొదలైన వాటికి లొంగే ప్రలోభం నాలో ఏనాడూ లేదు. మా ఇంట్లో డబ్బుకేం లోటులేదు. మా నాన్నగారు నలభయ్యవయేట కాన్సర్‌కి గురయ్యాడు. ఎన్ని

ధనరాశులూ ఆయన్ని కాపాడలేకపోయాయి. జీవితంలో ఒక్కక్షణం కూడా అదనంగా బతకనివ్వలేకపోయాయి. అప్పటి నుండీ డబ్బు, సంపద నా దృష్టిలో విలువ లేనివే! సికిందర్ ఎంతటి వీరుడో మనకు తెలుసు. ఆయన మరణించాక రెండు ఖాళీ చేతులూ సమాధికి పైనే కన్పించాయి. ఎందరో శ్రీమంతుల బాధలను మరణాలను ఈ ధనం ఆపగలిగిందా?

నా పదహారేళ్ళ వయసుకే నన్ను మా అమ్మానాన్నలు వంటరిని చేసి పైలోకాలకు వెళ్ళిపోయారు. నా తల్లిదండ్రుల మరణం నాలో శూన్యస్థితిని కలిగించింది. ఆ శూన్యం ఇంకా అలాగే ఉంది. నిన్ను చూశాక నీ రూపంలో ఆ భగవంతుడే నాలోని ఉదాసీనతను పోగొట్టవచ్చాడనుకున్నాను. కానీ నా అంచనా పొరపాటని తేలిపోయింది" భావోద్వేగంతో జాహిద్ కళ్ళు సజలమయ్యాయి.

సీమ లేచి వంటింట్లోకి వెళ్ళి మంచినీళ్ళు తెచ్చింది. జాహిద్ రెండు గుక్కలు తాగాడు.

"జాహిద్! నువ్వంటున్నదంతా నిజమే! నీ మేలు జన్మజన్మలకీ తీర్చుకోలేనంత గొప్ప రుణం. కాని నా పరిస్థితిని అర్థంచేసుకో. ఒక హిందూ స్త్రీకి అన్నిటికంటే తన సతీత్వం గొప్పది. నా దృష్టిలో ఏ హిందూ స్త్రీ అయినా తన భర్త విశ్వాసం కోల్పోతే వేశ్యతో సమానం. ఏ పురుషుడైనా భార్య విశ్వాసంకోల్పోతే అతను విటుడు అన్పించుకుంటాడు" అంది సీమ.

అంతలో పోస్ట్‌మాన్ వచ్చి ఓ రిజిష్టర్డ్ కవరు అందించాడు. మాటలు ఆగిపోయాయి. జాహిద్ కవరు విప్పి చదివి సీమకు అందించాడు. ఆమె దాన్ని చదివి

మనస్ఫూర్తిగా అతనికి అభినందనలు తెలిపింది నవ్వుతూ. ప్రభుత్వం జాహిద్‌కి ఉన్నత అధికార పదవినిస్తూ నియమించిన పత్రం అది.

సీమ తమ చర్చని మరో అంశంపైకి మళ్ళించింది.

ఆ సాయంకాలం జాహిద్ ఉదయం ఆగిపోయిన చర్చను మళ్ళీ ప్రారంభించాడు. "భర్త పోయిన నాలుగునెలల పదిరోజులకే స్త్రీ మళ్ళీ పెళ్ళికి స్వతంత్రురాలు" అని ఈ పుస్తకంలో అల్ బకర్ రాశాడు అంటూ పుస్తకం చూపాడు.

"నాలో పరివర్తన తేవాలని చెబుతున్నావ్ కదూ!" అంది సీమ గాభరాగా.

"ఇందులో తప్పేముంది? హిందూ ధర్మం అన్ని ధర్మాలను సమానంగా గౌరవిస్తుందని విన్నాను. అదే నిజమైతే నీవు హిందువుగానే ఉండు లేదా ఇస్లాం స్వీకరించు! ఏదైనా ఒకటే!" అన్నాడు జాహిద్.

"నువ్వు విన్నది నిజమే! మా ధార్మిక గ్రంథాలలో "ఏకమ్ సద్విప్రా బహుధా వదంతి" అని ఉంది. దీనికి అర్థం "సత్యం ఒక్కటే" దాని వరకు చేరడానికి లోకులు తమతమ అభిరుచి, సామర్థ్యాలనుబట్టి విభిన్నమార్గాలను ఎన్నుకుంటారు. దీని పేరే మతం. ధర్మమును మార్చుకున్న వారు ఏదైనా బలీయమైన కారణం ఉండటంతో వివశులై మార్చుకుంటారు. లేదా వారు తమ ధర్మంనుండి సర్వదా అనభిజ్ఞులుగానే ఉంటారు"

జాహిద్ కొన్నిక్షణాలపాటు మౌనంగా ఉండిపోయాడు. సీమ తర్కంముందు తను ఓడిపోయాననిపించింది. కాస్సేపటికి

"మంచిది! నీ ధర్మాన్ని నువ్వు మార్చుకోకపోయినా నేను నిన్ను వివాహం చేసుకోవడానికి సిద్ధంగా ఉన్నాను" అన్నాడు.

సీమ నవ్వింది.

"కురాన్-మజీద్- అల్-బకర్‌లోని సూత్రాలని' ఇప్పుడే చెప్పావు. అదే అధ్యాయంలో 221వ సూత్రంలో ధార్మికుడైన ముసల్మాను షియాలకు ఏర్పర్చిన నియమాలు నీవూ చదివావు కదా, విగ్రహారాధన

చేసే స్త్రీలను ఇస్లాం మతంలోకి మార్చ కుండా నిఖా చేసుకోరాదు అని ఉంది"

హిందూ ధర్మసూత్రాలేగాక ఇస్లాం మత బోధలపట్లకూడా ఆమెకున్న అవగాహన చూసి ఆశ్చర్యపోయాడు జాహిద్. తన వాదనలేవీ ఆమెని ఒప్పించలేకపోతున్నా యని నిరుత్తరుడయ్యాడు. నిరాశతో ముఖం పాలిపోయింది. మానసిక వికాసంలో స్త్రీ పురుషునికంటే ఒక అడుగు వెనుకబడే ఉంటుందని మహాతత్వవేత్త అరిస్టాటిల్ చెప్పిన సూత్రాన్ని సీమ తారుమారు చేసింది.

జాహిద్ ఉదాసీనంగా ఉండటం చూసి, "నేను నీకు రుణపడి ఉన్నాను. నేను కూడా నిన్ను ఇష్టపడతాను. అందమైన, సంపన్న యువకుడివి. నీ ప్రతిపాదన ఫలితం ఎలా ఉంటుందో ఆలోచించావా? ప్రస్తుతం హిందుస్తాన్, పాకిస్తాన్‌లమధ్య పట్టుదలలు. పగలు రాజుకుంటున్నాయి. నన్ను చేసుకుంటే మీ ప్రభుత్వం నీకు ఈ ఉన్నతోద్యోగం ఇవ్వడానికి నిరాకరించవచ్చు. ఇక్కడ నీకు చిరపరిచితులైన ముస్లిములు నిన్ను సానుభూతితో చూడవచ్చుగానీ, భారతదేశంనుండి వచ్చిన ముస్లిములు మాత్రం నీకు పరమ శత్రువులుగానే ఉంటారు. నీవంటి ఉత్తముడు కష్టాలు, అపవాదాల పాలు కావటం నాకు ఇష్టంలేదు. అందుకే మనం ఒకరినొకరం ఇష్టపడుతున్నా వేరుగా ఉండటం మంచిది. సమాజపరంగా చూసినా, ధర్మ పరంగా ఆలోచించినా నా నిర్ణయం సమంజసమైనది"... అంది సీమ.

జాహిద్ తర్కమంతా వ్యర్థమైపోయింది. నిరాశగా, "నీ మాటలు నిజమేనన్పిస్తున్నాయి. కాని అటు మనస్సునూ ఇటు బుద్ధినీ సమన్వయించలేక పోతున్నాను. నువ్వు నా దగ్గర అతిథిగా ఉన్నావు. నీవు మరో వారం రోజులపాటు ఇక్కడే ఉండాలని నా అభ్యర్థన. ఆ తరువాత నేను స్వయంగా మియాంచనూ శరణార్థిక్యాంపులో నిన్ను దిగబెట్టి వస్తాను" అన్నాడు.

సీమ అందుకు అంగీకరించింది.

వారం రోజుల తరువాత సీమ, కామినిలను మియాంచనూ శరణార్థిశిబిరానికి చేర్చడానికి తన జట్కాబండిలో బయల్దేరాడు జాహిద్. వెలుగురేఖలు విచ్చుకోక ముందే ప్రయాణం ప్రారంభించారు. జాహిద్ సూచనపై సీమ బురఖా ధరించింది. శిబిరం దగ్గర పడగానే జట్కాని ఆపి దిగాడు జాహిద్.

ఇక ముందుకు జాహిద్ వీరికి తోడు వెళ్ళటం ప్రమాదకరం. కనుక అతను ఆగిపోయాడు. సీమ ఇకపైన బురఖా ధరిస్తే అనుమానహేతువవుతుంది. ఆమె బురఖాని జట్కాలోనే విడిచి బండి దిగి కామినికి చేతులందించి దింపింది. బండి వాడు ఆమె సామాన్లు కిందికి దింపాడు. ఓ సూట్‌కేస్‌లో సీమ, కామినిల దుస్తులు, పడక బట్టలు, తినే పదార్థాలుంచిన ఓ బుట్ట ఇవీ ఆమె సామాన్లు. ఇంతకంటే ఎక్కువ వస్తువులు మోసుకు వెళ్ళటం అనవసరం. దారి ఖర్చులకు ఉండనీ అంటూ బలవంతంగా జాహిద్ ఓ వెయ్యి రూపాయలు సీమ పర్సులో ఉంచాడు. ఆరోజుల్లో వంద రూపాయల వేతనంతో ఒక కుటుంబం నెలంతా హాయిగా గడిపే యెచ్చు వెయ్యి రూపాయలు చాలా ఎక్కువే.

ముగ్గురూ సామాన్లు పట్టుకుని శిబిరం వైపుకు నడిచారు. కాపలావాడికి జాహిద్ పది రూపాయలిచ్చి శిబిరంలో, మంచి టెంట్ సీమకు కేటాయించమనీ, ఈ సామానును ఆమె గదివరకూ తీసుకువెళ్ళమనీ చెప్పాడు. కాపలావాడు పది రూపాయలు అందటంతో సంతోషంగా ఉన్నాడు. జాహిద్ కామినిని హత్తుకున్నాడు. ప్రేమానురాగాలు నిండిన చూపుల్ని సీమవైపు

సారించాడు. తరువాత వీడ్కోలు చెప్పుకుని వెనుదిరిగాడు జాహిద్. ఇంకా ఎక్కువ సమయం అతను అక్కడ ఉండటం అనుమానాలకి దారి తీస్తుంది. జట్కా బండిలో కూర్చొని ఉదాసీనంగా తన ఫార్మ్‌వైపు వెళ్ళసాగాడు. విడిపోతున్న సమయంలో జాహిద్, సీమల నేత్రాలు సజలమయ్యాయి.

"అమ్మా! చిన్నాన్న మనల్ని వదిలి ఎక్కడికి వెళ్తున్నాడు? ఎప్పుడొస్తాడు" అంటోంది కామిని. సీమ జవాబు చెప్పలేదు. కనుచూపుమేర జట్కాబండి దాటేవరకూ సీమ అలా చూస్తూనే ఉండిపోయింది. "దేశం నుండి సీమవంటి గుణవతి వెళ్ళిపోవటం దేశానికి లోటు" అనుకోసాగాడు జాహిద్. సీమ క్షేమంగా భారతదేశానికి చేరుకోవాలని మౌనంగా భగవంతుని ప్రార్థించసాగాడు.

కాపలావాడు సీమతో, "చెల్లాయి! ఇతనెవరమ్మా! చాలా మంచి మనిషిలా ఉన్నాడు. ముసల్మానుల్లో కూడా ఇంతమంచి వ్యక్తులుంటారా? " అన్నాడు.

అతని ఆశ్చర్యం సహజమే! ఇంత ఎక్కువ బహుమానం ఇంతకుముందు ఎవరూ ముట్టచెప్పలేదు. మరి! భారత ప్రభుత్వం అతనిని శిబిరానికి కాపలాదారుగా నియమించినప్పటినుండి ముస్లింలు హిందువులను హత్యచేసిన ఉదంతాలు, రక్తపాతాల వార్తలే విన్నాడు. కానీ ఇలా మానవతా దృక్పథంలో ఒక ముస్లిం ఒక హిందువుకు రక్షణ కల్పించటం చూడలేదు, విన్లేదు.

జాహిద్ గురించే ఆలోచిస్తున్న సీమ కాపలాదారు మాటల్ని విన్పించుకోలేదు. ఆమెను కాపలావాడు రిజిస్ట్రేషన్ కార్యాలయానికి తీసుకువచ్చాడు. శిబిరంలో చేరేవారు తమ వివరాలు రిజిస్టర్ చేయించటం తప్పనిసరి. రిజిస్ట్రేషన్ క్లర్క్ సీమకి రిజిస్ట్రేషన్ కార్డు ఇచ్చి టెంట్ నెంబరు చెప్పాడు.

"మఖ్దుంపూర్ నుండి వచ్చిన శరణార్థులు ఈ శిబిరంలో ఉన్నారా" అడిగింది సీమ.

"ఇది రిజిస్ట్రేషన్ ఆఫీసు. విచారణ కార్యాలయం కాదు. ఇక్కడ మూడు శిబిరాలున్నాయి. లోపలికి వెళ్ళి అడుగు" విసుగ్గా అన్నాడు క్లర్కు.

రిజిస్ట్రేషన్ పని పూర్తవగానే కాపలావాడు సీమ సామానును పట్టుకుని ఆమెను టెంట్ వద్దకు తీసుకువెళ్ళాడు.

జాహిద్ ఫార్మ్‌హవుస్ నుండి పొద్దుపొడవకముందే బయల్దేరటంతో చాలినంత నిద్ర పోలేదు, పైగా ప్రయాణపు బడలిక, జాహిద్ దూరమయ్యాడన్న ఉదాసీనభావం! ఆమె అన్యమనస్కంగానే నేలపై దుప్పటి పరిచింది. తల్లీ కూతుళ్ళిద్దరూ పడుకున్నారు. ఇలా కటికనేలపై ఎప్పుడూ పడుకోలేదామె! కాలం మనిషికి అన్నీనేర్పిస్తుందేమో!

నిజానికి నిద్ర నిష్క్రియత్వస్థితే అయినా నిద్రతో చాలాసార్లు మనిషి మనసు చేతనత్వం పొంది జాగృదవస్థలో చూసిన, విన్న సంఘటనలను, అసంపూర్ణ కోరికలను, భయాలను స్వప్నంద్వారా అభివ్యక్తి చేసే మార్గం వెదుకుతుంది.

ఆక్రమణ దారుల ముఠా మఖ్దూంపూర్ నివాసులపై దాడి చేసినట్లు కలగంది సీమ. అంతటా హాహాకారాలు, అరుపులు. ప్రజలంతా ప్రాణాలు కాపాడుకోవడానికి ఇటూ అటూ పరుగులు పెడుతున్నారు. ఆ మారణకాండలో ఒకరి శిరసు మొండెంనుండి విడిపోయింది. మరొకరి చెయ్యి తెగిపడింది. మరొకరి కాలు విరిగింది. ఈ ఘోర కలిని చూస్తున్న సీమ ఓ గొడ్డలిని అందుకుని విధ్వంసకారులిద్దర్ని చంపేసింది. మిగిలిన వారు భయంతో పారిపోసాగారు. వాళ్ళంతా పరుగెత్తి జాహిద్ ఫారం హౌజ్ లోనే దాగారు. కొన్నాళ్ళక్రితం జరిగిన ఉదంతం ఇంకా సీమ మనోపటలంపైనుండి చెరిగిపోలేదు కనుకే కొంత వాస్తవం, మరి కొంత కల్పన కలగాపులగమై స్వప్నంగా మారింది. ఈ దృశ్యాల్ని చూస్తున్న సీమ

కంగారుగా నిద్రలేచింది. పరిసరాల్ని చూసి జరిగిందంతా కలలోని దృశ్యమేనని తెలిసి నిట్టూర్చింది.

లేచి శిబిరంనుండి బయటికి వచ్చింది సీమ. అనేక ఎకరాల దూరం వరకు ఈ శిబిరాలు వేసి ఉన్నాయి. రైల్వేలైను సమీపంలో బంజరుభూమి మైదానంలో చాలా భాగం శిబిరాలు వేశారు. అక్కడక్కడా చిన్నచిన్న మొక్కలు, చెట్లు కన్పిస్తున్నాయి. కొందరు శరణార్థులు టెంట్‌లలో కాకుండా ఆయా చెట్ల నీడల్లో విశ్రాంతి తీసుకుంటూ కనిపించారు.

ఇద్దరు ముగ్గురి దగ్గరికి వెళ్ళి మాటలు కలిపింది సీమ. మఖ్దూంపూర్‌వాళ్ళు ఒకటవ క్యాంపులో లేరని తెలిసింది. ఆమె రెండవ నెంబరు శిబిరంలోకి వెళ్ళింది. మఖ్దూంపూర్ వాళ్ళు కొన్నాళ్ళముందే ఈ శిబిరంలోకి వచ్చారని అక్కడి అధికారి ద్వారా తెలిసింది. వారిలో కొందరికి భారత్‌దేశంలోని కేంద్రప్రభుత్వంలోని ఉన్నతాధికారులు తెలుసేమో వారిని వెంటనే భారతదేశానికి పంపించమని ఆదేశాలు పంపారు. వాళ్ళంతా భారతదేశానికి బయల్దేరారు. భారతదేశంలో ఏ ఊరికి వెళ్ళారని సీమ అడిగింది. "ఇక్కడినుండి శరణార్థుల్ని రైల్లో కూర్చోబెట్టడం వరకే మా విధి. ఆ తరువాత సంగతులు మాకు తెలియవు. బహుశా భారత సరిహద్దులలోకి రైలు వెళ్ళాకే వీరిని ఎక్కడ విడిది చేయించాలా అనేది ప్రభుత్వం నిర్ణయిస్తుందేమో" అన్నాడు ఆ అధికారి.

సీమ నిరాశగా తన గుడారంలోకి వచ్చేసింది.

ఒకరినుండి మరొకరి దుఃఖం పంచుకోవటం, విన్న విషయాలను చర్చించుకోవటం తప్ప శిబిరంలో పనేముంది? సీమ తన గుడారంలోకి వెళ్ళిన కాస్సేపటికి ఓ స్త్రీ వచ్చింది. పరస్పర అభివాదాల తరువాత "అక్కా! నీవు ఇక్కడికి ఎప్పుడొచ్చావు?" అంది ఆగంతకురాలు.

సీమ జవాబివ్వబోయేసరికి మళ్ళీ తనే మాట్లాడుతూ, "మేమైతే నాలుగు వారాలుగా ఇక్కడ పడి ఉన్నాం. పొద్దున్నే నీళ్ళ కోసం క్యూకట్టాలి. వెలుతురుకు దీపాల ఏర్పాట్లు కూడా సరిగ్గాలేవు. ఇది అడవి ప్రదేశం. రాత్రి భయంభయంగా ఉంటుంది. ఏ పామో కరిచి పోదుగదా అని హడలిపోతుంటాం" అంది.

"మీ కుటుంబ సభ్యులంతా కుశలంగా వచ్చేశారా" అడిగింది సీమ.

"ఈ విషయంలో మేం భగవంతుని కృపకు పాత్రులమే! కాని నాదొక సందేహం. మొన్నమొన్నటి వరకూ అన్నదమ్ముల్లా గడిపిన వాళ్ళు ఇప్పుడీ పగలు, కార్పణ్యాలకు ఎందుకు పూనుకున్నారో?

మా నగరంలో హిందూ, ముసల్మానులు పాలూ, చక్కెరలా కలిసిపోయి జీవనం గడిపేవారు. ఒకరి పండగలకి మరొకరు హాజరయ్యేవారు. దేశవిభజన వార్త విన్న ముస్లింలు హిందువుల్ని వెళ్ళగొడితే వారి భూములు, ఇళ్ళు తమ చేతికే వస్తాయనుకున్నారు. అంతే! ఇక ఎక్కడి స్నేహం? సోదర భావం? సంపదల లాలూచీ సౌహార్దాన్ని విముఖతగా మార్చివేసింది. మా అబ్బాయి పెళ్ళి కొత్తగా అయింది. మేం గుండె రాయిచేసుకుని కట్నకానుకల రూపేణా వచ్చిన సంపదనంతా ముస్లింలకు అప్పగించాం. సాయంత్రం మా టెంట్‌కి రావాలి సుమా! నా కోడలిని నీకు పరిచయం చేస్తాను" అని ఆమె వెళ్ళిపోయింది. తన టెంట్ నెంబరెంతో చెప్పలేదు. బహుశా ఆమె తన దీనగాథని చెప్పుకోడానికే వచ్చినట్లుంది. కథ ముగిసింది. ఆమె వెళ్ళిపోయింది.

శరణార్థి శిబిరంలో సీమకి రోజులు ఇలా గడుస్తున్నాయి. ఒకటవ, మూడవ నెంబరు శిబిరాల్లోని శరణార్థులని భారతదేశానికి పంపించడానికి రైలు వస్తోందని ఓరోజు

సీమకి వార్త అందింది. వార్త వినగానే ఆమె తమ శిబిరానికి అధికారిగా ఉన్న మోతీరాం దగ్గరికి వెళ్ళింది. తన ఊరి వాళ్ళంతా భారతదేశానికి వెళ్ళిపోయారనీ, తనను కూడా రేపు రాబోయే రైల్లో పంపించమనీ వేడుకుంది. ఆ అధికారి "అది అసంభవం ఈ రైల్లో వెళ్ళేవారికి ముందే పర్మిట్ ఇవ్వటం జరిగింది" అని కటువైన పదాలతో తేల్చేశాడు.

ఖిన్నురాలైన సీమ నిరాశగా తన శిబిరానికి వచ్చేసింది. రెండు గంటలు ఆలోచిస్తూ గడిపింది. మళ్ళీ లేచి నిల్చుంది. మరోసారి ప్రయత్నించి ప్రార్థించి చూద్దాం అని మోతీరాం వద్దకు వెళ్ళింది. ఈసారి మరింత దీనంగా చేతులు జోడించి, "అయ్యా! మా బంధువులంతా హిందుస్తాన్‌క చేరారు. నేనింకా ఇక్కడే ఉంటే వాళ్ళని వెదకడం కష్టమవుతుంది. నాకొక చిన్న కూతురుంది. మీరు అధికారులు. నన్నెలాగైనా రైల్లో పంపించండి! ఆ పర్మిట్ మీరే ఇవ్వండి!" అని ప్రార్థించసాగింది.

మోతీరాం ఈసారి కొంచెం మృదువుగా సమాధానమిస్తూ, "ప్రస్తుతం నీకు పర్మిట్ ఇప్పించటం అసాధ్యం. కాని నేను ఎలాగో రేపటి రైల్లో నిన్ను భారతదేశానికి పంపేందుకు ప్రయత్నిస్తాను" అన్నాడు.

అప్పటికంతే చాలనుకుంది సీమ. మోతీరాంకి ధన్యవాదాలు చెప్పి తన టెంట్ నెంబరు చెప్పింది. సీమ వెనుదిరుగుతుండగా ఆ అధికారి, "రాత్రి కాగానే సామాను తీసుకుని ఇక్కడికి వచ్చెయ్యి. దీని వెనుక భాగంలోనే నేను ఉండేది. అక్కడే నీ సామాను ఉంచు. రైల్వేలైనుపై బండి రాగానే రాత్రిగాని, తెల్లవారుజామునగాని మిగతా ప్రయాణీకులు రైల్లో కూర్చొనక ముందే నిన్ను బోగీలో కూర్చోబెడతాను. రైలు వచ్చేవరకు నీవు ఇక్కడే విశ్రాంతి తీసుకో" అన్నాడు.

సీమ మోతిరాంకు ధన్యవాదాలు చెప్పింది. సంధ్యా సమయంలో తల్లీ కూతుళ్ళిద్దరూ ఆ అధికారి కార్యాలయానికి వెనుకే ఉన్న అతని నివాస గృహానికి వెళ్ళారు.

రాత్రి సుమారు ఒంటిగంట అయి ఉంటుంది. మోతిరాం నెమ్మదిగా అడుగులువేస్తూ తన గది వెనుకవైపుకు వచ్చాడు. సీమ, కామిని గాఢనిద్రలో ఉన్నారు. నిద్రపట్టిన తొలి మూడు- నాలుగు గంటల వరకూ ఆ నిద్ర ప్రగాఢమై ఉంటుంది. సీమ సౌందర్యం చూసిన మోతీరాం ఉదయమే మతిపోగొట్టుకున్నాడు. ఈ నిశ్శబ్ద నిశీథ సమయంలో ఏకాంతంలో ఆమెని చాలాసేపటివరకు అలా చూస్తూనే గడిపాడు. తరువాత నెమ్మదిగా ఆమె బుగ్గల్ని పుణికాడు. సీమనుండి ఏ ప్రతిక్రియా ఎదురుకాలేదు. ఇది ఆమె అంగీకార సూచకంగా భావించాడు మోతీరాం. మరికాస్త ముందుకు సాగాడు. ఆమె దుస్తులు విప్పే ప్రయత్నం ప్రారంభించాడు. సీమకి చటుక్కున మెళకువ వచ్చింది. పరిస్థితి వెంటనే బోధపడింది. ఉదయం మోతీరాం తన ఇంటికి రమ్మన్నప్పుడే కొంచెం సందేహం కలిగినా అదే తనకు సురక్షితమైన స్థలంగా భావించి అతనిది బహుశా దురాలోచన కాకపోవచ్చనుకుంది. తను వెంటనే తన వారిని కలుసుకోవాలంటే శీఘ్రమే పయనం కావాలి. మోతీరాం తప్ప తనెవరూ ఇక్కడినుండి పంపించలేరు. అతని నివాసానికి వెళ్లినంతమాత్రాన అత్యాచారం చేస్తాడని ఎందుకనుకోవాలి అని ఆలోచించింది. కొంచెం కదిలి నిశ్చలంగా ఉండిపోయింది. మోతీరాంని ఎలా వదిలించుకోవాలా అని ఆమె మేధస్సు ఆలోచించసాగింది. కాముకత్వంతో మోతీరాం పిచ్చివాడే అయ్యాడు. సీమ కాస్త కదిలినా మళ్లీ నిద్రకు ఉపక్రమించటంతో తను చేస్తున్నపని సీమకు నచ్చిందేమో ననుకున్నాడు. ఆమె పెదవులని చుంబించాలని వంగాడు. సీమ చటుక్కున

అతన్ని కొరికి లేచి కూర్చుంది. విపరీతమైన మంటతో మోతీరాం విలవిలలాడసాగాడు. సీమలేచి నిల్చుని చీర సరిచేసుకుంది. మోతీరాం వంక అసహ్యంగా చూస్తూ చెడామడా తిట్టిపోసింది. అపరకాళికలా ఆవేశంతో ఊగిపోతున్న సీమను చూసి మోతీరాం భయభ్రాంతుడయ్యాడు. అతని కామోన్మాదం మాయమై కళ్లముందరి స్వార్థపు పొరలు కరిగిపోయాయి. ఈ సమయంలో సీమ అరిచి గోల చేసిందంటే పరిణామాలు తీవ్రంగా ఉంటాయని అతనికి అర్థమైంది. ఉద్యోగం ఊడటమేగాక ప్రాణానికే ముప్పు వాటిల్లే ప్రమాదం ఉంది. శిబిరంలోని శరణార్థులంతా ఏకమై తాటవలిచేస్తారు. కళ్లు తిరిగినంత పనైన మోతీరాం చేతులు జోడించి క్షమించమంటూ వేడుకోసాగాడు.

అరిచి గోలచేస్తే తనకు కలిగే లాభమెంతోగానీ ప్రయాణం వాయిదా పడుతుంది. లోకులు తనని కూడా తప్పుగా భావించి విమర్శించే అవకాశాలున్నాయి. 'ఈమె ఆ అధికారి ఒంటరి మగవాడన్న విషయం తెలిసే వెళ్లింది. అపరిచితుని ఇంట్లో నిశ్చింతగా పడుకుంది. తన ఇష్టంతోనే వెళ్లి అనుకున్నపని కాలేదు కాబోలు ఈ తుపాను చెలరేపింది' అని అనుకునే వ్యక్తులూ ఉంటారు. ఇవన్నీ ఆలోచించి సీమ మౌనంగా ఉండిపోయింది. మోతీరాం ఆ గదిలోనుండి బయటకి నడిచాడు. సీమ ఆ గది కిటికీల పరదాల్ని తీసింది. ఆ చీకటిలో ఆమె తన శిబిరానికి తిరిగి రావాలన్నా కష్టమే! ఇప్పటివరకు తన శిబిరం ఖాళీగానే ఉందో, ఎవరైనా ఆక్రమించుకున్నారేమో తెలియదు.

సీమ కామినిని ఎత్తుకుని కూర్చుంది. రాత్రంతా జాగరణే అయింది. ప్రతి క్షణం ఓ యుగంలా భారంగా గడవసాగింది. ఎలాగో తెల్లవారింది. రైలు పట్టాలపైకి వచ్చేసింది. మోతీరాం తన గదిలోనుండి వచ్చి నిశ్శబ్దంగా సీమ, కామినిలను వెంటబెట్టుకుని ఓ డబ్బాలోకి వెళ్లి కూర్చోమన్నాడు. తరువాత పర్మిట్ జారీ అయిన శరణార్థులంతా ఒక్కొక్కరే రాసాగారు. డబ్బాలన్నీ నిండిపోయాయి. ఎక్కడ కాసింత స్థలం దొరికినా సదుపాయాలకోసం ఎవరూ ఆలోచించటంలేదు! ప్రాణం కాపాడుకోవటమొక్కటే వారి లక్ష్యం. అరగంట తరువాత రైలు ప్రయాణం ప్రారంభమైంది. రైలు బయలుదేరాకే సీమ నిశ్చింతగా ఊపిరి పీల్చుకుంది. రైల్లో ప్రవేశం దొరికినందుకు కాదుగానీ మోతీరాం లాంటి దుష్టుని నుండి శాశ్వతవిముక్తి కలుగుతున్నందుకు ఆమెకి సంతోషంగా ఉంది. ఏదో అత్యాచారం, అన్యాయం తనకు సంభవిస్తుందేమోనని భయపడిన స్థావరంలోనుండి మర్యాదగా, సురక్షితంగా, పవిత్రంగా బయటపడింది. ఎక్కడ తమ జాతివాడేనని నిర్భయంగా శరణువేడిందో అక్కడే ఈ అవాంఛిత సంఘటన జరగబోయింది.

రైలు కదిలాక మోతీరాం కూడా నిట్టూర్చాడు నిశ్చింతగా!



రైలు పెట్టెల్లో కొన్నిటికి పైకప్పులు లేనందున అందులో కూర్చున్న ప్రయాణీకులను పగలంతా ఎండవేడిమి బాధించింది. రాత్రి పూట వాతావరణంలో మార్పు కారణంగా చలి వణికించసాగింది. అయినా భారత-

పాక్ సరిహద్దుల్లో ఉన్న ప్రజలకంటే వీరే నయం అనవచ్చు ఎందుకంటే సరిహద్దులు దాటేవాళ్లంతా ఎవరి సామానువారే భుజాలపై మోస్తూ కాలినడకన వెళ్లవలసివస్తోంది. రైల్లో ప్రయాణించే వారంతా ఒకటవ నెంబరు, మూడవ నెంబరు శిబిరంలోని శరణార్థులే! వీరిలో హిందువులు, సిక్కులు, బౌద్ధులు, జైనులు, శ్రీమంతులు, నిరుపేదలు, నిమ్నజాతివర్గాలవారు అందరూ ఉన్నారు. రైల్లో భుజం భుజం కలిపే కూర్చున్నారు. జీవితం అపాయంలో ఉన్నప్పుడు మనిషి వర్గభేదాలు మరిచిపోతాడు. ఆ రోజుల్లో సూపర్ ఫాస్ట్ ఎక్స్‌ప్రెస్‌లు లేవు. రైలు నిదానంగా వెళ్తోంది. లాహోర్ చేరడానికి ముందు ఒకే ఒక స్టేషన్‌లో ఆగి ఇంజన్‌లో బొగ్గు, నీరు నింపుకుంది. ఆ తరువాత లాహోర్‌లో ఓ ముప్పావుగంట ఆగింది.

రాత్రి సమయం. గతరాత్రి భారతదేశం నుండి వచ్చిన ముస్లిం శరణార్థులలో ప్రస్తుతం ఒక్కరైనా ప్రాణాలతో బయటపడలేదని తెలిసింది. అందరినీ చంపేసి శవాల్ని పాకిస్తాన్ సరిహద్దులలోకి పంపించటం జరిగిందిట. తమకీ అదే స్థితి ఎదురవుతుందనుకున్నారంతా! లాహోర్‌లో ఏ దుర్ఘటనా ఎదురవకపోవటంతో యాత్రికులు హమ్మయ్యా అనుకుంటూ ఊపిరిపీల్చుకున్నారు. లాహోర్‌నుండి భారత సరిహద్దులోని మొదటిస్టేషన్ 'వాఘా' ఎంతో దూరంలేదు. కేవలం కొన్ని గంటల ప్రయాణమే మిగిలింది ఇక!

లాహోర్‌నుండి బయలుదేరిన రైలు కాస్సేపటికే ఆగిపోయింది. ప్రయాణీకులకు ఆశ్చర్యం, భయం కలిగాయి. విచారిస్తే రైలు నడిపే డ్రైవరు రాత్రిపూట తను బండి నడపలేనన్నాడు. తెల్లారాక వెళ్లొచ్చులే అని సమాధానమిచ్చేసరికి యాత్రికులకు డ్రైవర్ అంతరంగం అవగతమైంది. అందరూ తలా కొంత చందాలు పోగుచేసి డబ్బుమూట అతని దోసిట్లో పెట్టారు. అప్పుడుగానీ రైలు కదలలేదు. ఓ గంట నడిపాడో లేదో బండి మళ్లీ ఆగిపోయింది. డ్రైవర్ ఉద్దేశ్యం బోధపడసాగింది. నిన్నరాత్రి జరిగిన ఘోరానికి ప్రతీకారం తీర్చుకోవడానికి డ్రైవర్ ఉద్దేశ్యపూర్వకంగానే పాకిస్తానీయులకి అవకాశం కల్పిస్తున్నాడు. గంటసేపు రైలు ఆగినా ఎవరూ వారిపై దురాక్రమణ చేయలేదు. అయినా ప్రయాణీకులంతా భయం భయంగా హనుమాన్ చాలీసా చదువుకుంటూ కూర్చున్నారు. కొందరు వేళ్లు లెక్కబెడుతూ దైవస్మరణ చేస్తున్నారు. ప్రాపంచిక సహాయం అందనపుడే భగవంతుడు తలపుకొస్తాడు మరి! ఈ రైలుకంటే ముందుగా భారతదేశానికి వెళ్తున్న మొదటి రైల్లో ఉన్న హిందూ శరణార్థులందర్నీ మృత్యుముఖంలోకి పంపి విప్లవకారులు తమ కసి తీర్చుకున్నారన్న విషయం డ్రైవర్‌కి తెలియదు. డ్రైవర్ కుటిల భావం అర్థమైన నలుగురు నవయువకులు రైలు డబ్బా దిగి రైలు ఇంజన్ వద్దకి వెళ్లారు. వారిలో ఒక యువకుడు ఇంతకు ముందు రైల్వే డ్రైవరుగా పనిచేశాడు. ఆ రోజుల్లోనే ఒక రివాల్వర్ సంపాదించి రహస్యంగా లోపలి జేబుల్లో దాచుకున్నాడు. అతను రివాల్వర్‌ని డ్రైవర్ తలకు గురిపెట్టి "ఇక నువ్వు అతి తెలివి చూపావంటే నేనే రైలు నడిపి హిందుస్తాన్ సరిహద్దులకు చేరుస్తా! అవసరమైతే నీ ప్రాణం తీయడానికి వెనుకాడను తెలిసిందా? " అని బెదిరించాడు.

మనిషికున్న పెద్ద బలహీనత బతుకుపై గల ఆశే! హత్య చేస్తారేమోనని భయపడిన ఆ పాకిస్తానీ డ్రైవర్ బండి నడపటం ప్రారంభించాడు. తెల్లవారేసరికి రైలు వాఘా స్టేషన్‌కి చేరింది. కొందరు "హరహర మహాదేవ" అనీ మరికొందరు "జోబోలేసో నిహాల్- సత్‌శ్రీఅకాల్" అని నినాదాలిస్తూ రైలు దిగారు. ప్రయాణం చేసిన అలసట ఎవరికీ లేదు. అందరిలోనూ సంతోషం,

ఉత్సాహం వెల్లువుకుతున్నాయి.
ఇంజన్‌లోకి ఎక్కిన నలుగురు శరణార్థ యువకులూ దిగారు. వాళ్లు ఇంజన్ డ్రైవర్, క్లీనర్, ఫైర్‌మన్‌లను తమతో రమ్మన్నారు. వారికి విపరీతమైన వణుకుపుట్టింది. భయంభయంగా యువకుల్ని అనుసరించారు. యువకులు ఓ టీస్టాల్‌లోకి వెళ్లి అందరికీ టిఫిన్లూ, టీలు తెమ్మని ఆర్డరిచ్చారు. పాకిస్తానీ రైల్వే ఉద్యోగులు ముగ్గురూ గొంతుదాకా తిని తాగారు. ముందుగా వాళ్లు సంకోచించినప్పుడు, "మిత్రులారా! జరిగిందేదో జరిగిపోయింది. మర్చిపోదాం! భవిష్యత్తు గురించి ఆలోచిద్దాం. మనమంతా భూమి పుత్రులమే! రాజకీయ కారణాలవలననో, ఆంగ్లేయుల దుర్నీతి కారణంగానో ఈ భూమిపైన సరిహద్దు రేఖలు గీస్తే భూమి వేర్వేరవుతుందా? మన హృదయాల్లో సోదరభావమే ఉండనీ! పిల్లలు ఆటల్లో ఎన్ని గీతలు గీసుకోరు? వాటికోసం పోట్లాడతారా? మనం చిన్న పిల్లలకంటే వెనుకబడినవారమా? ఈ రేఖలను ఆధారంగా చేసుకుని వైరాలు పెంచుకోవడానికి!" అన్నారు.

ఈ మాటలు ఆ డ్రైవర్ గుండెను కదిలించాయి. ఈ ఉదంతం తరువాత అతను అనేకసార్లు హిందూ శరణార్థుల్ని రైల్లో భారతదేశానికి చేర్చాడు. ఏనాడూ లోగడ ప్రవర్తించినరీతిలో ప్రవర్తించలేదు. సురక్షితంగా త్వరగా రైలును గమ్యం చేర్చేవాడు. రైలుదిగిన ప్రయాణీకులు కొందరు వెళ్లిపోగా మరికొందరు అక్కడి భోజనశాలల్లో భోజనాదులు ముగించి మళ్లీ రైలెక్కారు. అలసట వలన కళ్లు నిద్రకి ఉపక్రమిస్తున్నాయి. సీమ కళ్లు మూసుకుని కూర్చుంది. సగం నిద్ర సగం మెళకువతో మగతగా ఉందామెకి.

సీమకి ఎదురుగా ఓ మహిళ కూర్చుని ఉంది. ఆమె తదేకంగా సీమనే గమనించసాగింది. "ఎంత అదృష్టవంతురాలు! తన వారిని కలుసుకోబోయే క్షణాలు దగ్గరయ్యాయని ఆనందిస్తోంది కాబోలు! నాకెవరూ ఆత్మీయులు లేరుకదా!" అనుకుందామె స్వగతంలా! తల్లిదండ్రుల్ని విధ్వంసకారులు పొట్టనబెట్టుకున్నారు. బంధుమిత్రులు ఎవరి పనుల్లోవారు మునిగి ఉన్నారు. ఆమె ఆలోచనలు ఇలా సాగుతుంటే గాఢనిద్రలోకి జారుకున్న సీమ ఏదో కలవరిస్తోంది. "నన్ను విడిచిపెట్టండి" అని ఆమె గొణగటం ఎదురుగా కూర్చున్న మహిళకి విన్పించింది.
సీమ దగ్గరికి వచ్చి భుజం తట్టింది. సీమ కళ్లు తెరిచింది.
"పీడ కలేమైనా వచ్చిందా? " అని అడిగింది ఆ యువతి.
సీమ మౌనంగా ఉండిపోయింది. ఓ అపరిచితురాలికి ఏం చెబుతుంది?
"అక్కా నన్ను విశ్వసించు నా పేరు నిర్మల. మనసులోని బాధ పంచుకుంటేనే మనసు తేలికవుతుంది" అంది ఆ యువతి.
సీమ ఇంకా మౌనాన్ని వీడలేదు. నిర్మల ఆమె జవాబుకోసం ఎదురు చూసింది. సమాధానం రాకపోయేసరికి, "సరే! కనీసం నీ పేరు, నీ కూతురి పేరైనా చెప్పు" అంది.
"నా పేరు సీమ. మా అమ్మాయిపేరు కామిని"
"అక్కా ఏమీ అనుకోనంటే ఒక్క మాట చెప్పనా? "
"చెల్లి మాటల్ని ఎవరైనా అపార్థం చేసుకుంటారా? " అంది సీమ.
"బ్రహ్మదేవుడు సృష్టిని విరచించినప్పటి కథ ఒకటి అందరూ చెప్పుకోగా విన్నాను. బ్రహ్మ ప్రపంచాన్ని సృష్టించాక ఆయనకి తన సృష్టిలోని అన్నింటిలో ఏదో ఒక లోపం కన్పించసాగింది. సృష్టి రచన కొనసాగించడానికి ఆయన దగ్గర మరికొంత సామగ్రి మిగిలింది. సమయం చాలా ఉండ

టంతో ఆయన నిశ్చింతగా, తీరికగా ఒక సుందర రూపాన్ని మలిచాడు. అందులో ఏలోపమూ లేకుండా తీర్చిదిద్దాడు. ఈ రూపమే 'స్త్రీ' అని పురాణాలు చెబుతున్నాయి. కాని ఆ సృష్టి 'సీమ' అని నా అభిప్రాయం!" అంది నిర్మల.

"సీమ కాదు! నిర్మలే. నీ కోమల చర్మం, మెరిసే దంత సౌందర్యం నల్లని, చిక్కని కేశసంపద, ఎర్రని పెదవులు, తోటి స్త్రీలకు ఈర్ష్యను కలిగించకమానవు"

సీమ తనకు కొంత చేరువైందనిపించింది నిర్మలకి. సీమ మనోవ్యధకి కారణం తెలుసుకోవాలనుకుందామె. అందుకే, "సీమా! మనిషి అసంపూర్ణ కోరికలు స్వప్నంలో సాక్షాత్కరిస్తాయంటారు మనోవైజ్ఞానికులు. కలలో నువ్వు ఎవరినుండి విడుదల పొందాలని ప్రయత్నించావో నీ చెల్లెలికి చెప్పవా? "

మాట మార్చాలని ప్రయత్నిస్తూ సీమ అంది. "మియాంచనూలో నువ్వు ఏ క్యాంపులో ఉండేదానివి? "

"అక్కా! మాట దాటెయ్యకు. నేను అంత తేలిగ్గా మరవను. నేను మూడవనెంబరు క్యాంపులో ఉండేదాన్ని"

నిర్మల పదేపదే రెట్టించటంతో క్యాంపులో తనపై జరగబోయిన బలాత్కారం గురించి చెప్పేసింది సీమ. నిర్మల ముఖంలో చిరునవ్వు లాస్యంచేయడం గమనించింది సీమ. కోపంతో పళ్ళు బిగుసుకున్నాయి. తన నవ్వు సీమకి కోపం తెప్పించిందని గ్రహించింది నిర్మల. "అక్కా! ఈ కథ నీ ఒక్కదానికే పరిమితం కాదు సుమా! మనిషికి అధికారం చేతిలో ఉంటే దాన్ని దురుపయోగం చేసే అవకాశాలు మెండుగా ఉంటాయి. ఏ రంగంలోనైనా అంతే" అంది.

"నీ మాటలు నాకు అర్థంకావటంలేదు. నీ సంకేతం ఎవరైనా ప్రముఖ వ్యక్తిని సూచిస్తోందా? "

"నా సంకేతం ఎవరివైపూ లేదు. కేవలం నా కథ వైపే ఉంది. నిన్ను ఓ హిందువు బలాత్కరించబోయాడన్నావు! మా క్యాంపు బయట ఉన్న సెక్యూరిటీగార్డులపై అధికారిగా ఓ ముస్లిం ఠానేదారు ఉన్నాడు. ఓ సాయంత్రం అతని సిపాయి వచ్చి నన్ను కలవాలని ఎవరో వచ్చారని చెప్పాడు. నేను క్యాంపులో ఆరోజు వంటరిగా ఉన్నానని ఎలా తెలిసిందో మరి? నన్ను బలాత్కారం చేశాడు"

"ఖురాన్ శరీఫ్‌లోని ఒక సూత్రం ప్రకారం ఇలాంటి దుష్కార్యానికి పాల్పడిన ముస్లిం అపరాధికి ఏ సడలింపూ లేకుండా కఠినంగా నూరు కొరడా దెబ్బలను కొట్టాలని ఉంది. కాని ప్రస్తుత వాతావరణంలో హిందువు హిందువుగా లేడు. ముస్లిం ముస్లింలా లేడు. హిందుస్తాన్, పాకిస్తాన్‌లకు ఇక ఈశ్వరుడే దిక్కు!" అంది సీమ.

"ఇలాంటి సంఘటనలు సహజంగానే కష్టంకలిగిస్తాయి. ఈ కారణంగా మనసులో హీన భావాలకు తావివ్వడం బుద్ధిమంతుల లక్షణం కాదు. నీవు నాకంటే పెద్దదానివి. నీతో ఎక్కువగా వాదించను. కానీ సమాజంలోని దూషితవాతావరణంలో బలాత్కరించబడిన స్త్రీని అపరాధిగా భావించటం సమంజసమా? "

తన మనసు తేలికపడినట్లనిపించింది సీమకు. "ఇప్పుడు నీ ప్రయాణం ఎక్కడికి" అనడిగింది.

"మా సీమ అక్కయ్య ఎక్కడికి వెళ్తే నేనూ అక్కడికే? నా కెవరున్నారు? " అంది నిర్మల, సీమ సంతోషించింది! తనకు మాత్రం ఎవరున్నారు. ఇక ఒకరికొకరు తోడుగా ఉండవచ్చు

జాహిద్ ఇచ్చిన నగదు చాలా ఉంది. సీమ, కామిని, నిర్మల రైలు దిగి సుష్టుగా భోంచేశారు. వందలాది మంది యాత్రికులు భోంచేయాలి, నీళ్ళు తాగాలి, టీలు తాగాలి కనుక రైలు రెండు గంటలపాటు ఆగింది. భోజనం ముగించిన తరువాత హిందు

స్తాన్, పాకిస్థాన్ సరిహద్దు రేఖను చూద్దా మంది నిర్మల. రైలు కదలడానికి ఇంకా సమయం ఉంది. వాఘా స్టేషన్‌నుండి బార్డర్‌వరకు అనేక సైకిల్ రిక్షాలు తిరుగుతున్నాయి. ఈ రెండు దేశాలమధ్యగల సరిహద్దు రేఖని చూడాలన్న కుతూహలం చాలా మందిలో ఉంది. ఓ రిక్షాలో నిర్మల, సీమ, కామిని కలిసి చూడడానికి వెళ్ళారు. ఒకవైపు భారతీయ పోలీసులున్నారు. వారికి నాలుగు వందలగజాల దూరంలోపే పాకిస్తానీ పోలీసులు తిరుగాడుతున్నారు. ఇరువర్గాలకీ మధ్య కాస్త ఖాళీ స్థలం ఉందంతే! దూరం తక్కువైనందున ఇరువైపుల ఉద్యోగులూ అప్పుడప్పుడూ గట్టిగా ఉచ్ఛస్వరంతో మాట్లాడుకుంటున్నారు కూడా!

సీమ, నిర్మల సరిహద్దువద్ద నిల్చుని చూస్తున్నారు. ఓ పాతికేళ్ళ యువకుడు అరవై సంవత్సరాల వ్యక్తిని తన భుజాలపైకి ఎత్తుకుని భారతీయ సీమవైపుకు వస్తున్నాడు. దార్లోనే ఆ యువకుడు వృద్ధుణ్ణి నేలపై పడుకోబెట్టాడు. బహుశా ఆ పెద్దాయన ప్రాణం అనంతవాయువులో కలిసిపోయింది కాబోలు. భారతీయ సరిహద్దు లోపలికి వచ్చి "ఈయన మా నాన్నగారు. మేం పాకిస్థాన్‌లోని సర్‌గోధి నగరంలో వడ్డీ వ్యాపారం చేస్తుంటాం. నగలు కుదువపెట్టి నగదు తీసుకుపోతుంటారు కావాల్సినవారు. దేశ విభజన జరిగాక మావద్ద రుణాలు తీసుకున్నవారంతా ఓ ప్రకటన చేశారు. వాళ్ళు మావద్ద ఉంచిన నగలు తీసుకుని మమ్మల్ని చంపుతామని చెప్పారు. అందుకే సర్‌గోధినుండి బయల్దేరే బస్సులు, రైళ్ళలో మమ్మల్ని వెదికేవారు. రైల్వే స్టేషన్‌లో, బస్టాండుల్లో ఎందరో పహరాకాసే వారు. మా ప్రాణాలు కాపాడుకోడానికి మేం ఓ ఉపాయం ఆలోచించాం. ఓ రోజు ఉదయం పొద్దుపొడవకముందే నేను, మా నాన్నగారు మట్టి కూజాలని పట్టుకుని కాలినడకన బయల్దేరాం. దార్లో మమ్మల్ని ఎవరూ సందేహించలేదు. ఎందుకంటే కూజాల్ని కేవలం ముస్లింలే వాడతారిక్కడ. చూసినవారు ఎవరో ముస్లిం సోదరులు నీళ్ళకోసం వెళ్తున్నారు కాబోలనుకున్నారు. సర్‌గోధినుండి నడిచి సుదీర్ఘ ప్రయాణంచేసి ఈ సరిహద్దులవరకు వచ్చేశాం. దురదృష్టవశాత్తు ఇక్కడికి చేరాక మానాన్నగారు స్పృహ కోల్పోయి పడిపోయారు. పాకిస్థానీ పోలీసులు సాయం అందించలేదు. మేం భారతదేశంవైపుకు రావటం చూసి హిందువులమని వాళ్ళకి తెలిసిపోయింది. ఇదిగాక మేమిద్దరం కూజాల్ని పాకిస్థాన్ సీమల్లోనే వదిలేశాం. భారత సైనికులకు సహాయపడమని, రమ్మని దూరంనుండే సైగచేశాను. కానీ వాళ్ళా పట్టించుకోలేదు. మేం పాకిస్థాన్ బార్డర్‌లో ఉన్నందున ముస్లింల మనుకున్నారో ఏమో? వారిని మోసగించాలని పిలుస్తున్నామనుకున్నారు కాబోలు! ఇరువైపులవారూ మమ్మల్ని సాటి మనుషులుగా భావించలేదు. ఈ హిందూ, ముస్లిం విభేదాలు మా నాన్నను బలిగొన్నాయి" అంటూ ఆ యువకుడు వెక్కివెక్కి ఏడవసాగాడు. ఏడవటం తప్ప ఇక అతనేం చేయగలడు? ఇంకా ఏం మిగిలింది?

సీమ, నిర్మల అసలే బాధగా ఉన్నారు. ఈ దృశ్యం చూడలేక రిక్షా ఎక్కి వాఘా స్టేషన్‌వైపు వెళ్ళిపోయారు.

★ ★ ★

రెండు గంటల తరువాత రైలుకూత విన్పించింది. బండి బయల్దేరడానికి సిద్ధం కావటంతో యాత్రికులందరూ రైలెక్కారు. రైలు వాఘా స్టేషన్‌నుండి ముందుకు సాగిపోయింది. "అందరినీ ఢిల్లీకి పంపిస్తున్నామని' వాఘా స్టేషన్‌లో అధికారులు వెల్లడించారు. దార్లో నీళ్ళు, బొగ్గుకోసం రైలు చాలా స్టేషన్లలో ఆగింది.

రైల్లో ప్రసవవేదన పడుతున్న భార్యను

దింపి, తనూ దిగాడు ఒక యువకుడు. అంతలో రైలు కదిలింది. రైల్లో ఉన్న అతని కుటుంబసభ్యుల్ని, అతను మళ్ళీ ఏనాటికైనా కలిసేదీ లేందీ చెప్పలేం! రాత్రి పూట వంతెన కిందుగా రైలు వెళ్తుంటే రైలు పైన కూర్చున్న వారెందరో వంతెన తగిలి కిందపడిపోయారు. కొందరు మరణించారు. కొందరు గాయపడ్డారు.

మర్నాడు రైలు ఢిల్లీ చేరేసరికి సంధ్యా సమయం అయింది. ఆకాశంలో అస్తమిస్తున్న సూర్యుని ఎరుపుదనం చూస్తుంటే భూమిపై ప్రవహించిన హిందూ ముస్లింల రక్తం ఆకాశాన్ని చేరినట్లనిపించింది సీమ, నిర్మలలకు. అందులో ముస్లింల రక్తవర్ణం ఏదో, హిందువుల రక్తవర్ణం ఏవైపుకు ఉందో ఎవరైనా చెప్పగలరా?

రైలు ఆగింది. కొందరు శరణార్థుల బంధుమిత్రులు స్టేషన్‌కి వచ్చారు. వాళ్ళతో కలసి కొందరు ఇళ్ళకి వెళ్ళసాగారు. రైల్వే స్టేషన్ ఓ శిబిరంలా కన్పించింది. కొందరు బస్సులకోసం ప్రతీక్షించసాగారు.

"అంతా చిందరవందర అయ్యారు" అంది నిర్మల. "ఈ దేశ విభజన గాథ రక్తాక్షరాలతో చరిత్ర పుటలలో రాయడం జరుగుతుంది. ప్రభుత్వ గణనం ప్రకారం కోటీ నలభై లక్షలమంది ఇళ్ళు వదులుకున్నారు. దెబ్బతిన్న వారు ఎక్కువగా పాకిస్థాన్‌లో నివసించే హిందువులే! ఇరువైపుల వాళ్ళు లక్షమంది వరకు చనిపోయి ఉండవచ్చునంటున్నారు. లక్షమంది యువతుల్ని అపహరించి వేశ్యలుగా మార్చడం జరిగింది. ప్రభుత్వ లెక్కల్ని మించి మరెన్నో రెట్లు అధికసంఖ్యలో బాధితులు ఉండవచ్చునని నా అంచనా" అంది సీమ.

"దిల్' అనే రాజు పేరుతో నిర్మింపబడిన 'దిల్లీ' (ఢిల్లీ) నగరం ఎన్నో వైభవాలనీ, అరాజకాలనీ చవిచూసింది... చాలాసార్లు నగరాన్ని నిర్మించడమూ, కొన్నాళ్ళకది ధ్వంసమవడమూ జరిగింది. శత్రువుల దురాక్రమణకు ఢిల్లీ నగరం అల్లకల్లోలమయింది" చెప్పింది నిర్మల.

ఢిల్లీ ఒక్కటే కాదు! దేశమంతా అతలాకుతలంగానే ఉంది" అంది సీమ.

అంతలో శరణార్థుల్ని శిబిరాలకు తీసుకువెళ్ళడానికి కొన్ని బస్సులూ, ట్రక్కులూ వచ్చాయి. రైలు దిగిన శరణార్థులందర్నీ క్యాంపులకు తరలించారు.

కొన్నాళ్ళు అక్కడ విశ్రాంతి తీసుకున్నాక సీమ, నిర్మల కలిసి ఓ ధర్మశాలకు వెళ్ళారు. కొద్దిపాటి అద్దె చెల్లిస్తే గది ఇవ్వగలమని నిర్వాహకులు చెపితే, అందుకు అంగీకరించి గది అద్దెకు తీసుకున్నారు. శిబిరంలో ప్రభుత్వాశ్రితులుగా ఉండటం ఎంతకాలం? తమ కాళ్ళపై తాము నిలబడాలి. తమ రొట్టె తామే సంపాదించుకోవాలి. అని స్థిరంగా నిశ్చయించుకుని చిన్న చిన్న పనులు చేసి రోజులు వెళ్ళబుచ్చసాగారు. వీరిని చూసి వీళ్ళు 'శరణార్థులు కారు, పురుషార్థులు' అంటూ అభినందించసాగారంతా!

ఢిల్లీ చరిత్రను లోగడ సీమ, నిర్మల పుస్తకాల్లో చదువుకున్నారు. ఇప్పుడు ఈ చారిత్రాత్మక నగరాన్ని ప్రత్యక్షంగా చూసి అధ్యయనం చేయనిశ్చయించుకున్నారు. ఓ రోజు చారిత్రాత్మక కీర్తిస్థంభాన్ని చూడాలని బయల్దేరారు. ముందుగా చాంద్‌నీచౌక్‌కి వెళ్లారు. షాహజహాన్ పాలనలోగల రెండు రాజమార్గాల్లో ఒకటి చాంద్‌నీచౌక్ మీదుగానే ఉంది. యమునానది ప్రవాహం దీనికి సమీపంలోనే ఉంది. నదికి రెండువైపులా అందమైన చెట్లుఉన్నాయి. ఆంగ్లేయుల శాసనకాలంలో ఈ వృక్షాలన్నీ నరికేశారు. నదిలో మట్టి నింపారు. అలా చేయకుండా ఉంటే ఈనాడు ఢిల్లీనగరం ఇటలీలోని వెనిస్ నగరంలా నదీ జలాలపై ఉన్నట్లే కనిపించేది. ఇక్కడ పువ్వులు, వెండిబంగారు దుకాణాలు, ముత్యాలు, వజ్రవైడ్యూర్యాలమ్మే దుకాణాలు చాలా కన్పిస్తాయి.

అందుకే ఈ స్థలానికి చాంద్‌నీచౌక్ అనే పేరు ఏర్పడింది. ఇక్కడే వటవృక్షం కింద ఔరంగజేబు ఆదేశానుసారం గురుతేగ్‌బహాదూర్ తల నరకబడింది 1675లో.

ఏమిటాయన చేసిన నేరం?

ముస్లిం మతంలోకి మారనన్నాడు. అంతే!

దండన విధించాడు ఔరంగజేబు! ఇలాంటి ఉదంతాలెన్నో స్థానికులు చెబుతారు. చాంద్‌నీచౌక్ సమీపంలో బంగారు మసీదు ఉంది. ఇక్కడే నిల్చుని 1739 మార్చి 22న నాదిర్షా తన కత్తిని ఒరలో నుండి తీశాడు. తన సేనకో సంకేతమిచ్చాడు.

1857లో భారత స్వతంత్ర సంగ్రామం విఫలమయ్యాక ఆంగ్లేయులు ఈ చాంద్‌నీ చౌక్‌వద్దే దేశభక్తులైన స్వాతంత్ర్యోద్యమకారులకి మరణ దండన విధించారు.

ఇవన్నీ నిర్మలకి చెబుతూ, "ఢిల్లీ చరిత్రలో రక్తసిక్తమైన అధ్యాయం, మఖ్దూంపూర్‌లోని రక్తసిక్త అధ్యాయంకంటే అనేకరెట్లు భయంకరమైంది" అంది సీమ.

బహుశా ప్రపంచంలోనే అద్వితీయమనదగిన మరొక ప్రదేశాన్ని వాళ్లిక్కడే చూశారు. అదే పక్షుల ఆసుపత్రి. ఈ చికిత్సాలయంలో పక్షులలో విభిన్న జాతులకు, రకాలకు వేరువేరుగా వార్డులున్నాయి. ఇక్కడ రోగాలతో బాధపడుతున్న పక్షులకు ఆశ్రయమిచ్చి, వ్యాధి తగ్గేమందులు వాడతారు. ఉపశమనం కలిగేక వాటిని ఆకాశంలోకి వదిలి స్వేచ్ఛాజీవితం ప్రసాదిస్తారు. అయితే కళ్లులేని వాటికి, ఎగరలేని పక్షులకు, చికిత్సాలయంలోనే ఒక విభాగంలో ఆశ్రయం కల్పిస్తారు.

ఇక్కడే సుప్రసిద్ధ 'ఎర్రకోట'ను వారు సందర్శించారు. 1945లో 'ఇండియన్ నేషనల్ ఆర్మీ'లోని సైనికులకు వ్యతిరేకంగా ఇక్కడే తీర్పు ఇచ్చారు. 15 ఆగస్టు 1947న స్వాతంత్ర్యం పొందాక జాతీయపతాకాన్ని ఆవిష్కరించిన స్థలాన్ని కూడా చూశారు. మువ్వన్నెల బావుటా ఇక్కడ రెపరెపలాడేక ఈ కోట స్వాతంత్ర్యానికి ప్రతీకగా నిలిచిపోయింది. కోటలోపలి దివాన్-ఎ-ఆమ్ వద్దనే పాదుషా ప్రజల ఫిర్యాదులు వినేవాడు.

అక్కడినుండి వాళ్లు దివాన్-ఎ-ఖాస్‌కి వెళ్లారు. ఈ స్థలంలోనే మొగలు పాదుషా తన దర్బారులోని ముఖ్యులైన వారితో, ఆంతరంగికులతో చర్చలు జరిపేవాడు. ముఖ్య నిర్ణయాలు ఇక్కడే జరిగేవి. ఈ భవనపు పైకప్పుపై ఫార్సీభాషలో, 'ఈ ధరణిపై స్వర్గమేదైనా ఉందంటే అది ఇదే! కేవలం ఇదే!!' అనే పంక్తులు చెక్కారు.

ఆ తరువాత 'నక్కార్‌ఖానా'... ఇక్కడ ప్రతిరోజూ ఐదుసార్లు బ్యాండ్ మోగించేవారు. ఆదివారం రోజునా, పాదుషా పుట్టినరోజునా ఈ బ్యాండ్ రోజంతా మోగేది.

రంగమహల్ భవనాన్ని చూసి వాళ్లు దాని విశేషాలు తెలుసుకున్నారు. ఇది పాదుషాల అంతఃపురం. దీని పైకప్పు వెండితో రూపొందించారు. తదనంతర కాలంలో డబ్బు అవసరమై ఫర్‌ఖియార్ ఖాన్ పాలనలో వెండి పైకప్పును వలిచి రాగితో పైకప్పు నిర్మించారు. ఆ తరువాత 11వ అక్బర్ పాదుషా కాలంలో రాగి నిర్మాణాన్ని తొలగించి చెక్కతో పైకప్పును కట్టించారు.

ఆ భవన సౌందర్యాన్ని ఆసక్తిగా గమనిస్తున్న వీరికి అక్కడే ఉన్న ఓ వ్యక్తి చెప్పసాగాడు, "క్రీ.శ. 1648లో ఈ మహలు నిర్మాణ ప్రారంభం జరిగినప్పుడు దీవాన్-ఎ-ఆమ్‌లోని స్థంభాల్ని టర్కీ నుండి తెప్పించిన వెల్వెట్, చైనా నుండి తెచ్చిన సిల్కు బట్టలతో అలంకరించారు. ఈ గుడ్డలపై జరీతో అల్లికలు, కుట్లు ఉన్నాయి. పాదుషా గొడుగుకున్న కర్ర వెండితో తయారుచేయించారు. 200 గజాల పొడుగు, 125 గజాల వెడల్పుతో మరో గొడుగు కర్ర వెండితో

తయారుచేశారు. ఈ మహలు వైభవం ఇది" అని ఆగాడాయన.

"భారతీయ రాజనీతిజ్ఞులు ధనాన్ని ఈ రకంగా ఖర్చుచేసే బదులు జనకళ్యాణానికి, జన హితానికి, ప్రజోపయోగాలకోసం ఖర్చు పెడితే ఎంతో బాగుండేదిగదా" అంది సీమ.

నిర్మల, సీమ బాగా అలసిపోయారు. తమ నివాసానికి వచ్చి చాంద్‌నీచౌక్‌లో కొన్న తినుబండారాలతో ఆ పూట భోజనం ముగించారు.

ఓ రోజు ఢిల్లీలోని సుప్రసిద్ధ లక్ష్మీనారాయణ మందిరం దర్శించడానికి వెళ్లారు. ఈ మందిరాన్ని నిర్మింపచేసిన బిర్లా పేరును జోడించి దీనిని బిర్లామందిరం అని వ్యవహరిస్తారు. ఇందులో లక్ష్మి, నారాయణ, శ్రీకృష్ణభగవానుడు, ఆంజనేయస్వామి, శివుడు, గౌతమబుద్ధుడు మొదలైనవారి విగ్రహాలున్నాయి. విష్ణువు ఎత్తిన అవతారాలలో బుద్ధునిది 9వ అవతారంగా భావిస్తారు. మందిరం వెనుక భాగాన పార్కు, పుష్కలంగా నీళ్లు, వ్యాయామశాల, కొత్తగా కట్టిన గుహలు మొదలైనవి ఉన్నాయి. మందిర నిర్మాణపద్ధతి సామాజిక, ధార్మిక ఉద్దేశ్యాలను ఎదుట నిల్పినట్లనిపించింది స్నేహితురాళ్లిద్దరికీ!

మందిరం గోడలపై దేవతల చిత్రాల్ని చూసి, "అక్కా! భగవంతుని అనేక శక్తులు దేవతల రూపంలో అభివ్యక్తం అవుతున్నాయని నాకు తెలుసు. కానీ దేవతల లెక్కల విషయంలోనే పలు రకాలుగా చెప్పగా విన్నాను. దేవతల సంఖ్య 33 అని కొందరు, 33 లక్షలని మరికొందరు, 33 కోట్లని ఇంకొందరు చెబుతుంటారు. మనదేశంలో ఎందరో విద్వాంసులున్నారు. శంకరాచార్యులు అవతరించారు. ఈ చిన్న అనుమానాన్ని తీర్చేవారేలేరా? దీనికి జవాబు దొరకదా? " అంది నిర్మల.

"నేనూ ఈ విషయంగురించే ఆలోచిస్తూ ఉంటాను. ఋగ్వేదంలో ఒకచోట దేవతల సంఖ్య మూడువేల మూడు వందల ముప్పయితొమ్మిది అని ఉంది. శాస్త్రాధారాలపై జ్యోతిష్య శాస్త్ర సమీక్షకులు దేవతల సంఖ్య ఇంకోరకంగా చెబుతారు. పద! మందిరంలో ఉన్న ప్రధానాచార్యుల వారినే అడిగి సంశయం తొలగించమని ప్రార్థిద్దాం..."

మందిరమంతా చూసిన తరువాత అక్కడి ముఖ్యాచార్యుడు చతుర్వేది దగ్గరికి వచ్చారిద్దరూ.

వారు తమ సంశయాల్నిలా వెలిబుచ్చారు.

"దేవతల సంఖ్య ముప్ఫైమూడు లక్షలు, లేదా ముప్ఫైమూడు కోట్లు అని చెప్పడం ఓ గుర్తు కోసమేననుకుంటాన్నేను. బ్రహ్మ దివ్య శక్తులు అగణిత రూపాల్లో మన ఎదుట ప్రకటిస్తాయని, కన్పిస్తాయని దీని అర్థం. ఈ దివ్యశక్తుల పేరే దేవతలు.

"ఒక జ్యోతిష్యుడు దేవతల గణన ఇలా చేశాడు. వైదిక కాలంలో ప్రజలు చంద్రమానాన్నీ, సూర్యమానాన్నీ రెండింటినీ పాటించేవారు. చంద్రుని పరిభ్రమణాన్నిబట్టి కాలాన్ని లెక్కించేవారు. సూర్య పరిభ్రమణాన్నిబట్టి ఋతువులను విభజించేవారు. ఇది వ్యవసాయపు పనులకు ఉపయోగపడేది. చాంద్రమానం ప్రకారం ఏడాదికి సుమారు 354 రోజులుకాగా, సూర్యమానం ప్రకారం 365 రోజులవుతున్నాయి. రెండు రకాల సంవత్సరాల కాలమానాలకి 11 రోజుల అంతరం ఉంది. 33 సంవత్సరాలు గడిచాక చాంద్రమానం, సూర్యమానాల మధ్య అంతరం సుమారు 371 రోజులు ఉంటుంది. ఇంకా చెప్పాలంటే 33 సంవత్సరాల తరువాత చంద్రవత్సరం సూర్యవత్సరం కంటే ఒక సంవత్సం 6 రోజులు వెనుకబడి ఉంటుంది. కాని సూర్యవత్సరం, చంద్రవత్సరం ప్రారంభమవడంలో 6 రోజుల అంతరమే ఉంటుంది. 303 సంవ

త్సరాల్లో ఈ అంతరం తగ్గి కేవలం 0.242 రోజులు మిగిలివుంటుంది. 3003 సంవత్స రాల్లో ఈ అంతరం కొంత తగ్గవచ్చు దేవ తల 33, 303, 3003 మొదలైన సంఖ్యలు ఖగోళపు ఈ సత్యాన్నే సంకేతంగా చూపు తున్నాయని జ్యోతిష్యశాస్త్రజ్ఞులు అంగీకరిం చారు. ఈ అంశాన్నే వేదాల్లో శాస్త్రకారులు దేవతల సంఖ్య మూడు రూపాలలో పద కొండు అంకె వచ్చేలా అనగా 11, 101, 1001 సంఖ్యతో ఉండేదని సూత్రప్రాయంగా తెలిపారు.

నా అంచనా ప్రకారం దేవత పదం ఖగో ళపరంగానూ ఈశ్వరీయ శక్తులకూ వాడబ డుతుంది"

"ఆచారిగారూ! శక్తి నిరాకారమైంది. మరి దేవతలను సాకార రూపంలో చూపడం ఎంతవరకు సముచితం?" అడిగింది నిర్మల.

"మూర్తిత్వంలేని వస్తువును బోధపర చటం తేలికకాదు. అందుకే జనుల హృద యాల్లో ఒక ఆకృతిని పొందుపరిచేటందుకు దానిని విగ్రహరూపంలో మలచటం అవస రమవుతుంది" వివరించాడు చతుర్వేది.

ఆయనకు ధన్యవాదాలు తెలిపి అక్కడి నుంచి బయల్దేరారు సీమ, నిర్మలలు. అక్క డినుండి వారు జయపూర్ మహారాజు రెండవ మాన్‌సింగ్ నిర్మింపచేసిన జంతర్ మంతర్ చూడడానికి వెళ్లారు. ఇలాంటి నక్ష త్రాల్ని పరిశోధించే ప్రయోగశాలల్ని జ్యోతిష గణన కోసం ఢిల్లీలోనేగాక జయ పూర్, వారణాసి, ఉజ్జైన్, మధురల్లో కూడా నిర్మింపచేశాడాయన.

జంతర్‌మంతర్‌నుండి కుతుబ్‌మీనార్‌కి వెళ్లారు. అంతవరకూ మౌనంగా తల్లివెంటే నడుస్తున్న కామిని కుతుబ్‌మీనార్ ఎత్తును చూసి చకితురాలై "అమ్మా! ఇదెంత పొడుగో చూడు!" అంది ఆశ్చర్యంగా

"నీ అంత పొడుగు పిల్లల్ని 70 మందిని ఒకరిపై మరొకరిని ఎక్కించి నిలబెట్టినా ఈ మీనార్ ఇంకా పొడుగే ఉంటుంది" అంది సీమ.

"దీనిని ఎవరు కట్టించారు? ఎందుకు ఇంత ఎత్తుగా కట్టారు?" అడిగింది కామిని.

"మీ అమ్మాయి ఇప్పటినుండే చరిత్ర అధ్యయనం చేస్తున్నట్లుందే!" అంది నిర్మల.

సీమ నవ్వింది. కామిని వైపు చూస్తూ, "రాయపిథోరా అనే రాజు ఉండేవాడు. నువ్వు నాకెలాగో ఆయనకీ ఓ కూతురుంది. ఆమె నీకంటే పెద్దది. ప్రతి రోజూ భోజనా నికి ముందు యమునానదిని దర్శించుకోవా లనుకుంది. ఇక్కడికి యమున చాలా దూరం. దూరాన ఉన్న వస్తువు కన్పించా లంటే ఎత్తైన ప్రదేశంలో నిల్చోవాలి. అందుకే రాయపిథోరా రాజు తన కూతురికి యమున కన్పించేలా ఎత్తైన మీనార్‌ని నిర్మింపచేశాడు. కుతుబుద్దీన్ ఐబక్ నిర్మిం చాడు గనుక దీనికి కుతుబ్‌మీనార్ అనే పేరు వచ్చిందని మరికొందరంటారు"

అక్కడే వాళ్లు భారీ ధాతువులతో నిర్మిం చిన ఓ మీనార్‌చూశారు. ఋతువుల ధాటిని ఎదుర్కొంటూ ఏళ్ల తరబడి తుప్పుపట్ట కుండా ఉన్న ఆ నిర్మాణాన్ని చూసి ప్రాచీన భారతీయ శిల్పి దక్షతను సీమ, నిర్మల పదే పదే కొనియాడారు. "శతాబ్దాలు గడిచిపో తున్నా ప్రపంచంలో ఎవరూ ఇలాంటి స్తంభనిర్మాణాన్ని చేపట్టలేకపోయారు..." అంది సీమ.

సమయం చాలా గడిచిపోయింది. ముగ్గురికీ అలసటగానే ఉంది. ధర్మశాలకు వెనుదిరిగారు. ఆ రెండు రోజుల్లోనే చాలా దర్శనీయ స్థలాల్ని చూశామని మిత్రురాళ్లిద్ద రికీ సంతృప్తిగానే ఉంది.

★ ★ ★

**ఆరోజు** శనివారం. కామిని పేచీపెడితే సీమ దగ్గర్లోనే ఉన్న ఓ పార్కుకు తీసుకు

వెళ్లి ఆడించసాగింది. అంతలో ఎవరో తనని పిలిచినట్లయి వెనక్కి చూసింది. ఒకప్పుడు తనతో కలిసి చదువుకున్న రాధ తనవైపు వస్తోంది. పక్కనే ఆమె భర్త సోమనాథ్!

రాధ, సీమ ఒకర్నొకరు హత్తుకున్నారు. పోగొట్టుకున్న వస్తువేదో దొరికినంత ఆనందం కలిగింది ఇద్దరికీనూ! రాధ, సోమ నాథ్‌లు లక్నోలో ఉంటారు. అంతా ఓ చోట కూర్చుని కబుర్లలో పడ్డారు. మఖ్దూంపూర్‌లో జరిగిన దారుణ ఉదంతం చెప్పింది సీమ. అపహరింపబడిన కారణంగా తన కుటుంబ సభ్యుల చిరునామాలు, యోగక్షేమాలు తనకేవీ తెలియవం దామె!

జాహిద్ తనకు రక్షణ కల్పించి, కాపాడిన ఉదంతం చెప్పటం మరవలేదు సీమ.

ఆ విషయాల్ని మౌనంగా వింటున్న సోమనాథ్, "మఖ్దూంపూర్‌నుండి వచ్చిన మీ కుటుంబ సభ్యులు లక్నోలో నివసిస్తున్నారని మాటల సందర్భంలో ఇటీవలే నా స్నేహితుడు చెప్పాడు. మేం లక్నోకి వెళ్లగానే కనుక్కుంటానమ్మా! వాళ్ల విశేషాలు తెలుసుకుని, వాళ్ల చిరునామా నీకు తెలుపుతాను" అన్నాడు.

"మీకసలు మాట్లాడ్డం తెలియదు. సీమ మనతో వస్తే బావుంటుందికదా! సీమ అత్తమామలు కూడా వీళ్లకోసం బెంగపెట్టుకునే ఉంటారు. లక్నో వెళ్లి వాళ్ల చిరునామా కనుక్కున్న తరువాత మీరు ఈమెకు ఉత్తరం రాస్తే అప్పుడు రమ్మంటున్నారు మీరు. ఒకవేళ తపాలా వాళ్ల పుణ్యమా అని మీ ఉత్తరమే అందకపోతే? "

"చాలు తల్లీ చాలు! ఎప్పటిలాగే నీదే పైచేయి సరేనా? సీమ మనతోనే వస్తుంది. ఆమెని వప్పించడం ఇక నీ పని'

రాధా, సోమనాథ్‌లను వెంటబెట్టుకుని ధర్మసత్రానికి వచ్చేసింది సీమ. అక్కడ నిర్మలను పరిచయం చేసింది. సీమ తల్లి దండ్రులెంతటి శ్రీమంతులో రాధకు తెలుసు. సీమ ప్రస్తుత పరిస్థితులు చూసి అందుకే ఎంతగానో ఖేదపడింది. సోమనాథ్ తనవారి గురించి చెప్పిన విషయాల్ని నిర్మలకు వివరించింది సీమ. తనను రాధ వాళ్లతో రమ్మంటోందనీ, అందుకే నిర్మలని కూడా తమతోపాటు రమ్మంది సీమ. "పని వదిలి అక్కడికి ఎలా రాగలను? జీవనం గడవడానికి డబ్బు సంపాదించుకోవటం అవసరంకదా! నీవిక్కడ మీ అత్తమామల్ని కలిశాక లక్నోలో నాకేదైనా పనివెదికి పెట్టు. అక్కడికి వచ్చేస్తాను" అంది నిర్మల.

"వారం రోజుల్లో ఇక్కడికి మళ్ళీ వచ్చేస్తాను. రాధనూ వెంటబెట్టుకొస్తాను. మేమిద్దరం కలిసి నిన్ను తీసుకువెళ్తాం. సోమనాథ్ అన్నయ్యగారికి అక్కడ బాగా పలుకుబడి ఉంది. నీకు పని వెదకడం ఆయనకేం సమస్యకాదు" అంది సీమ.

లక్నోకి బయల్దేరే రోజు రానే వచ్చింది. సీమ వెళ్ళబోయేముందు నిర్మల దగ్గర వీడ్కోలు తీసుకునేటప్పుడు ఇద్దరి నయనాలూ అశ్రువులతో నిండాయి. స్నేహం, బాంధవ్యం ఎలాంటిదైనా ఎన్నాళ్ళదైనా మనసులోని ప్రేమభావన, ఆత్మీయతలు ప్రగాఢమై ఉంటే ఆ ఎడబాటు నిజంగా కలచివేస్తుంది. తనకు ఓ తోడు, ఆసరా దొరికిందనుకున్న నిర్మలకి సీమ వెళ్ళిపోతుంటే ఎంతో బాధ కలిగింది. జీవితంలో అనేక కష్టాల్ని ఎదుర్కొన్న నిర్మలకు కష్టాలిప్పుడు కష్టాల్లా అన్పించటంలేదు. గుండెని రాయిచేసుకుని సీమకు వీడ్కోలు పలికి ముఖంపై చిరునవ్వు తెచ్చుకుని శుభాకాంక్షలు చెప్పింది.

తను మళ్ళీ ఓ వారం రోజుల్లో తిరిగి వచ్చేస్తాననీ, లక్నోలో ఒక ఉద్యోగం వెదికి మరీ వస్తానని పదేపదే చెప్పింది సీమ. ఒకవేళ తన అత్తమామలు తనని త్వరగా రానీయకుంటే నిర్మలని రాధా సోమనాథ్‌ల

సహాయంతో రప్పించుకుంటుంది. ఇదంతా వారం రోజుల్లో సాధ్యపడకుంటే పది రోజుల్లో అవశ్యం పూర్తవుతుంది అంది మళ్ళీ

ఢిల్లీనుండి లక్నోవరకు ప్రయాణం పగలే!. రైల్లో అందరూ కబుర్లుచెప్పుకోసాగారు. ఆ రోజుల్లో రైళ్ళల్లో పాకిస్థాన్ నుండి వచ్చే శరణార్థులే అధిక సంఖ్యలో ఉండేవారు. తన మిత్రుడు రెండు జతల బట్టలకంటే ఎక్కువ ఏమీ తెచ్చుకోలేకపోయాడని ఒక ప్రయాణీకుడు పక్కనున్న వ్యక్తితో చెబుతు న్నాడు. ఒక మూలన కూర్చున్న యువకుడు, "పాకిస్థాన్ తన శవంపైనే ఏర్పడుతుంది అన్న మహాత్మాగాంధీ ఏడీ? ఎక్కడికి వెళ్ళాడు" అని అరుస్తున్నాడు పిచ్చివాడిలా.

"ఒరే బాబూ! ఆయన్ని నేరస్థుడని ఎందుకంటావు? తన మాటలప్పుడెవరూ శ్రద్ధగా వినటంలేదని ఆయన ఎన్నో సార్లు వాపోయాడు. ఆ వృద్ధుడు ఇంకెన్నాళ్లో బతుకుతాడని నేననుకోవటంలేదు. ఈ బాధతోనో లేదా ఏ ఉపవాసమో చేస్తూచేస్తూనో ఆయన స్వర్గానికి వెళ్ళిపోతాడు"..

ఈ మాటలన్నీ అందరూ వింటూనే ఉన్నారు. సీమ మౌనంగా ఉంది. పాకిస్థాన్ సంఘటనలలో తనది కూడా ఓ పాత్ర. కాస్సేపయ్యాక రాధా, సోమనాథ్‌లను ఉద్దేశించి. "భారతీయ నాయకులు కొద్దిగానైనా రాజకీయంగా చొరవతీసుకుని ఏర్పాట్లు చేస్తే ఇంత జననష్టం కలిగేది కాదు. రక్తం ప్రవహించేది కాదు" అంది.

"ఎలా? " అడిగింది రాధ.

"పాకిస్థాన్ పునాది రెండు రాష్ట్రాలపై ఆధారపడి ఉండేది. పాకిస్థాన్ కావాలనే వారు గట్టిపట్టుదలతో ఉన్నారు. వారి మనసుల్లో నిర్మించబోయే కొత్త దేశం పాక్ అనగా పవిత్రమైన, శుభ్రమైన భూమి అనే అభిప్రాయం బలంగా పాతుకుని పోయింది. అది కేవలం ఇస్లాం రాజ్యం గానే ఉంటుంది. ముస్లిములు కాని వారికి ఇక్కడ స్థానం లేదు. అందుకే భారతవిభజన గురించి చర్చ జరిగినప్పుడు హిందూ ముస్లిములు, వారివారి సంపదలు ఎవరివి వారికి విడిగా పంచి ఇచ్చే అంశం నిర్ణయించటం అవసరమైంది. అన్ని వర్గాల వారి సమస్యలని దృష్టిలో ఉంచుకుని తీసుకునే రాజకీయ నిర్ణయమే మేలైనది. అన్ని వనరులున్నా రాజనీతిజ్ఞత, వివేకం లోపించిన కారణంగా లక్షలాది మంది ప్రజలను మృత్యువాత పడవేసి, వారి ఆస్తిపాస్తుల్ని దోపిడీదారులకో, అగ్నికో ఆహుతిచేసే ప్రభుత్వం ఎందుకు? " చెప్పింది సీమ.

సీమ ఈ అంశాన్ని గురించి తీవ్రంగా స్పందిస్తోందని గమనించారు రాధ, సోమనాథ్‌లు. విషయాన్ని మరోవైపు మళ్ళించాలనుకున్నా అది ఎలానో తోచలేదు. అంతలో రైలు వేగం క్రమంగా తగ్గుతూ చివరికి ఓచోట ఆగిపోయింది. ఆగిన కారణం విచారిస్తే కొన్ని గేదెలు, ఆవులు పట్టాలపై నడుస్తుండటంతో డ్రైవరు బండి ఆపాడని తెలిసింది. లేకుంటే పశువులైనా ప్రాణాలు కోల్పోయేవి, లేదా రైలు పట్టాలు తప్పేది.

పగటి సమయంలో ఎక్కడ రైలు ఆగినా కిందికి దిగటం, ప్లాట్‌ఫారంపై పచార్లు చేయడం ప్రజలకి బాగా అలవాటైంది. ప్లాట్‌ఫారమనే కాదు అడవిలోనైనా సరే తప్పక దిగుతారు కొందరు. జనానికి ఇదొక ఆచారంగా, అలవాటుగా మారింది. సీమ కూర్చున్న బోగీలోంచి ఒక ప్రయాణీకుడు రైలు దిగుతూ కాలు జారి కింద పడ్డాడు. కాలి ఎముక స్థానభ్రంశం చెందింది. రైల్వే కాంపౌండ్‌వాల్ దగ్గర కొందరు చెట్టుకింద కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు. ఇతను కింద పడటం చూసి పరుగుపరుగున వచ్చారు. లేవనెత్తి ఓ సిమెంట్ బెంచీపై పడుకోబెట్టారు. బాధకు తట్టుకో

లేక యాత్రికుడు పెద్దగా మూలుగుతున్నాడు. అది చూడలేక ఒకతను ఊళ్ళోకి వెళ్ళి వైద్యుని పిలుచుకొచ్చాడు. అతను వస్తూనే నేలపై దుప్పటి పరిపించి రోగిని కిందపడుకోబెట్టించాడు. నెమ్మదిగా ప్రయాణీకుని కాలు మర్దనా చేయసాగాడు. తరువాత కాలుని అటూ ఇటూ కదిపి అకస్మాత్తుగా లాగటంతో స్థానభ్రంశం చెందిన ఎముక యథాస్థానానికి వచ్చింది. గాయపడిన వ్యక్తి కాస్సేపు నొప్పితో విలవిలలాడాడు. చెట్టు చల్లని గాలివీస్తోంది, నీడనిస్తోంది. అది చూస్తున్న సీమ, "చెట్ల విలువ తెలిసేది ఇక్కడే! నగరాల్లో కరెంటు స్థంభాలకింద కూర్చునేవారికి చెట్ల విలువేం తెలుస్తుంది? " అంది.

రైలు ఇంకా కదలకపోవటంతో గ్రామస్థులు గాయపడిన వ్యక్తిని రైల్లో పడుకోబెట్టారు. ఓ గ్లాసులో పాలు తెచ్చి తాగించారు. అతను వైద్యునికీ, పాలు తెచ్చిన వ్యక్తికీ డబ్బులివ్వాలని ప్రయత్నిస్తే తీసుకోవడానికి ఇద్దరూ నిరాకరించారు. "బాబుగారూ! ఈయన ఊళ్లో ఎవరికి అవసరమైనా వెళ్ళి మాలీష్ చేస్తాడు. ఎముకలు అతికించే ప్రయత్నాలు చేస్తాడు. పట్టీ కడతాడు. ఎవరిదగ్గరా ఏమీ పుచ్చుకోడు. ఇప్పుడు మీదగ్గరెలా తీసుకుంటాడు. ఇక పాలు! అవి! మా ఇంట్లోవి గేదెపాలే! డబ్బెందుకు? " అన్నాడు తెచ్చిన వ్యక్తి.

"మన భాగతీయ సంస్కృతి విశేషం ఇదే! ఈ సంస్కృతి గ్రామాల్లో ఇంకా జీవించి ఉండటం చెప్పుకోదగింది" అంది సీమ.

రైలు కదిలింది.

"భారతీయుల్లో సామాజిక మర్యాద, విధేయత ఎప్పుడు వస్తుందో తెలీదు..." అంది మళ్ళీ తనే!

"మీ అభిప్రాయం సరైనది కాదు! ఈ ప్రజలు సీదాసాదా వ్యక్తులు నిజమే! కాని వాళ్ళలో వినయ విధేయతలకి, మర్యాదలకి లోటేమీ లేదు" అన్నాడు సోమనాథ్.

"సీమ వ్యక్తిగత మర్యాద గురించి చెప్పటంలేదు. సామాజిక మర్యాద గురించి మాట్లాడుతోంది. మీరప్పుడే మరిచిపోయారా? రెండు వారాలకి కిందట రోడ్డుపై తిరుగుతున్న ఒక ఆవు కారణంగా డ్రైవరు చనిపోలేదా? మాటలు మనం కూడా చెబుతాం. ఆచరించటమే కష్టం. మనలో అహంభావం, స్వార్థం ఎక్కువ. సీమ ఉన్న మాటే అంటోంది"

మాటల్లోనే లక్నోకి చేరింది రైలు. ప్రయాణంలో కామిని నిద్రపోతూనే ఉంది. మెలుకువ రాగానే, 'నిర్మల పిన్ని ఏది? " అంది.

"వస్తుందిలే" అంది సీమ.

"ఎప్పుడొస్తుంది. ఆ పిన్ని నాకెంతో ఇష్టం"

"ఇక్కడికి వస్తుందని చెప్పాను కదా! కొన్నాళ్ళయ్యాక వస్తుంది"

"ఆమెను తొందరగా తీసుకురావాలి. నేనంటే తనకి ఇష్టం..." అంది, కామిని.



మర్నాడు ఆదివారం. మార్కెట్టు ఉండదు. గనుక సోమనాథ్ సీమ అత్తమామలను గురించి చెప్పిన వ్యక్తిని కలుసుకోడానికి వీలుపడలేదు. అతని ఇల్లెక్కడో సోమనాథ్‌కి తెలియదు. లక్నో చేరాక కూడా తనవాళ్ళని చూడలేకుండా ఉండటంతో సీమకి ఏమీ తోచటంలేదు. ఆమె మనసును మరోవైపు మళ్ళించడానికి పిక్నిక్

ఏర్పాటుచేశాడు సోమనాథ్.

"ఆనంద సరోవరం" వాళ్ళింటినుండి సుమారు ఎనిమిది మైళ్ళదూరంలో ఉంది. దానిని నిర్మించిన ఇంజినీరు పేరు పరమానంద కావటం వలన ఈ సరోవరాన్ని ఆనంద సరోవరంగా వ్యవహరించటం అలవాటైంది. నిజమే అక్కడికి చేరాక ఎవరికైనా ఆనందానుభూతి కలగక మానదు.

ఆనంద సరోవరం విశాలంగా చిక్కని నీడనిచ్చే వృక్షాలతో ఆవరించి ఉంది. వాతావరణం శుభ్రంగా, ఆహ్లాదజనకంగా ఉంది. ఇక్కడ పక్షుల్ని వేటాడటం నిషిద్ధం. రంగు రంగుల పక్షులు నిర్భయంగా నేలపై కూడా తిరుగుతున్నాయి. కొన్ని చెట్లెక్కి కలకలారావాలు చేస్తున్నాయి. ఆ ప్రకృతి సౌందర్యానికి ముగ్ధురాలైన రాధ ఆ వాతావరణాన్ని మెచ్చుకుంది.

జలాశయంనుండి ఓ చేపపిల్ల పైకెగిరి మళ్ళీ నీళ్ళలోకి వెళ్ళిపోయింది. ఇది చూసి "ఈ చెరువులో చేపల్ని పట్టడం కూడా నిషిద్ధమే" అన్నాడు సోమనాథ్.

"నిషేధాన్ని ఎత్తివేయాలేగానీ నాలుగు రోజుల్లో చెరువులోని చేపలన్నిటినీ పట్టుకుని వండేసుకుంటారు" అంది రాధ.

మనిషి ఆలోచన విస్తృతంగా సర్వాంగీణమై ఉండకపోవటం బాధాకరం. అతని దృష్టి ఆర్థిక వికాసంవైపు, అభివృద్ధివైపుకే పరిమితమై ఉంది. విదేశీమారకం ప్రలోభంతో ఎగుమతి చేయడానికి రాత్రింబగళ్ళు సముద్ర నౌకల్లో వెళ్ళి వలలేసి చేపల్ని కుప్పలు తెప్పలుగా పట్టుకుంటున్నారు. 21వ శతాబ్దం ప్రారంభం నాటికి సముద్రాల్లోని చేపలు మనిషి అవసరాలకు రెండున్నర కోట్ల టన్నుల మేరకు తగ్గిపోతాయని పరిశీలకుల అనుమానం. అప్పుడేమవుతుంది? చేపల్ని భోంచేసేవారు అప్పుడు చేపలనుగాక తినడానికి ఇతర జీవుల్ని వెదుక్కోవాలి. షార్క్, వేల్‌లాంటి పెద్ద చేపలు చిన్న చేపల్ని తిని జీవిస్తాయి. అవి భోజనం దొరకక చనిపోతాయి. జలాశయాలలో ఉండే హానికారక తత్వాల్ని చేపలు మింగుతాయి. దానివలన నీరు స్వచ్ఛమవుతుంది. ఉపకారం చేపలవలన కలుగుతోందని ఎంతమందికి తెలుసు? " అంది సీమ.

"పశుపక్ష్యాదుల గురించి సంపూర్ణజ్ఞానం చాలామందిలో కొరవడి ఉంటుంది. ప్రథమ ద్వితీయ మహా ప్రపంచయుద్ధాలలో కూడా పావురాల ద్వారా సందేశాలు, వార్తలు పంపుకునేవారు"

"ప్రకృతిలోని జలపాతాలు సెలయేళ్ళ హోరును వినే పశుపక్ష్యాదుల ధ్వనుల ఆధారంగా సంగీతంలోని సప్తస్వరాల్ని మానవుడు రూపొందించాడని విన్నాను" అంది రాధ.

"ప్రాచీన మానవ సభ్యతావికాసం సముద్రతీరం, నదీతీరాలపైనే జరిగింది. ఇదిగాక కుక్కుటాసనం, సింహాసనం, పక్షిఆసనం, బకాసనం, సర్పాసనం, మత్స్యాసనం, ఉష్ట్రాసనం వంటి అనేక ఆరోగ్యప్రదాయకాలైన యోగాసనాల వికాసం పశుపక్ష్యాదుల భంగిమలను చూసి ఏర్పరిచినవే"

"గత సంవత్సరంకంటే ఈ యేడు చెట్ల సంఖ్య పెరిగిందన్పిస్తోంది" అంది రాధ.

"నాకూ అలాగే అన్పిస్తోంది. కాని నగర మున్సిపాలిటివారు నిరుడు మొక్కలేవీ నాటలేదే? " అన్నాడు సోమనాథ్.

"చెరువుల్లోని నీరు భూమిలోపల చాలా దూరంవరకు, సుమారు 2, 3 మైళ్ళదూరం వరకు వ్యాపించి నేలను తేమగా ఉంచుతాయంటారు. ఈ పరిధిలో గాలివల్లగాని, పక్షులవలనగానీ ఏవైనా విత్తనాలు పడితే సమయానుకూలంగా అవి నాటుకుని మొక్కలవుతాయి. అడవులన్నీ ఇలాగే ఏర్పడతాయి. కనుక మీ ఊహ నిజమే! వచ్చే సంవత్సరం ఈ చెట్లూ, మొక్కలూ మరిన్ని పెరగవచ్చు" అంది సీమ.

సూర్యాస్తమయ వేళకి పిక్నిక్ నుండి

ఇంటికి బయల్దేరారు. రోజంతా తిరగటంవలన అలసిపోయారు. ఇల్లుచేరాక రాధా, సోమనాథ్‌లు త్వరగానే నిద్రించినా, మరో గదిలో పడుకున్న సీమకు ఎంతకీ నిద్రపట్టలేదు.

కాస్సేపు కామిని ముంగురులు సవరించింది. నిద్ర మానసికస్థితిపై కూడా ఆధారపడివుంటుంది. శారీరక, మానసిక ఆరోగ్యాలు సంతృప్తికరంగా ఉంటేనే నిద్రపడుతుంది. సీమ మనసు పలువైపుల విహరిస్తోంది. ఆలోచనలు చుట్టుముట్టి ఆమె దరిదాపులకి నిద్రని రానీయడంలేదు. చాలా సమయం గడిచాక సీమకి కునుకు పట్టింది.

ఆ తరువాత వెలుగురేకలు విచ్చుకొనకముందే మెలకువ వచ్చేసింది సీమకు. రాధా, సోమనాథ్‌లు ఇంకా నిద్ర లేవలేదు. సీమ లేచి కాలకృత్యాలు తీర్చుకుని, అభ్యంగన స్నానం చేసి ఇంటికి ఎదురుగా ఉన్న శ్రీ వేంకటేశ్వరాలయానికి వెళ్ళి దేవుడికి పువ్వులు సమర్పించింది. సాష్టాంగ ప్రణామంచేసి తన లక్ష్యాన్ని సఫలం చేయమని ప్రార్థించింది. ఆలయంలో ఉన్న ఇతర విగ్రహాల్ని కూడా దర్శించి తనకు జయం కలిగించమని వేడుకుంది.

మందిర ప్రాంగణంలో కాస్సేపు గడిపి బయటికి వస్తుంటే ఓ జ్యోతిష్యుడు కన్పించాడు. జ్యోతిషం కూడా గణితంలాగే ఓ విద్య అని సీమ విశ్వాసం. కానీ చెట్లకిందా, రోడ్లమీదా కూర్చుండే జ్యోతిష్యులపట్ల ఆమెకి సదభిప్రాయం లేదు. అయినా ఇవాళెందుకో అప్రయత్నంగానే అటువైపు నడిచి జ్యోతిష్యునికి తన చెయ్యి చూపించింది.

జ్యోతిష్యుడు కాస్సేపు ఆమె చేతిరేఖల్ని పరిశీలించి, "నువ్వు బుద్ధిమంతురాలివి. నీ మనసు పరిశుద్ధంగా ఉంటుంది. ప్రతివాళ్ళతోనూ నిష్కపటంగా, సత్యసంధతతో వ్యవహరిస్తావు. కానీ నీ జీవితంలో ఎదురైనవారు చాలావరకు స్వార్థపరులే! తమ పబ్బం గడుపుకోదలచేవారే! ప్రస్తుతం నీ గ్రహస్థితి బాగా లేదు. నీవు సరేనంటే ప్రత్యేక పూజలు, అర్చనలు జరిపి గ్రహశాంతి చేస్తాను" అన్నాడు.

పూజార్థం అతను అడిగినంత డబ్బిచ్చి ఇల్లు చేరుకుంది సీమ. లక్ష్యసిద్ధివాంఛ మనిషిచేత ఏమైనా చేయిస్తుంది మరి!

సీమ వచ్చేసరికి రాధా, సోమనాథులు నిద్రలేచి, స్నానాలు ముగించారు. సీమ మనఃస్థితి వారిద్దరికీ బాగా తెలుసు. అందుకనే సీమ కుటుంబీకులను గురించి ఆరా తీయడానికి సోమనాథ్ రోజూకంటే త్వరగా వెళ్లాడు. ఎప్పుడెప్పుడు సోమనాథ్ వచ్చేస్తాడా, సీమ అత్తవారి విశేషాలు చెబుతాడా అని సీమ, రాధ ఎంతో ఆసక్తిగా ఎదురు చూడసాగారు.

కాని రోజూకంటే ఆలస్యంగా వచ్చాడు సోమనాథ్. సీమ అత్తవారి విశేషాలు చెప్పిన వ్యక్తి ఉదయం కలవకపోవటంతో సాయంత్రం అతని వద్దకి మళ్ళీ వెళ్ళాడు సోమనాథ్. అతని వెంట వెళ్ళి ఆ ఇల్లు చూశాడు. సీమ అత్తగారి కుటుంబం నగర శివార్లలో ఉంటోంది. దారి బాగోలేదు గనుక మర్నాడు ఉదయమే బయల్దేరితే గంటసేపట్లో వాళ్ళింటికి చేరుకోవచ్చు అని చెప్పాడు సోమనాథ్.

సీమ, రాధలకు కలిగిన ఆనందానికి అవధుల్లేవు. సీమ మామగారు ఏదో వ్యాపారం చేస్తున్నాడని కూడా చెప్పాడు సోమనాథ్. సీమ ముఖం మరింత కళకళలాడింది. వాళ్ళని కలవడానికి ఇంకా ఒకరోజు ఆగాలంటేనే కష్టమన్పించసాగిందామెకు. సీమ ముఖకవళికల్ని గమనించిన రాధ, "వాళ్ళిక్కడే ఉన్నారని తెలిశాక వెళ్లకుండా పన్నెండుగంటలు గడపటం సులభం అనుకుంటున్నారా? త్వరగా భోజనాలు ముగించి ఇప్పుడే వెళ్దాం" అంది రాధ. తన ఆదర్శాలకు, సిద్ధాంతాలకూ వ్యతిరేకం కాకుంటే ఎదుటివారి ఇతర నిర్ణయాలతో ఏకీభవించ

టమే జీవన సాఫల్యానికి చక్కని ఉపాయం అని నమ్మే వ్యక్తి సోమనాథ్. అందుకే ఏ అడ్డూ చెప్పకుండా రాధ ప్రతిపాదనని అంగీకరించాడు. సీమ ముఖం మళ్ళీ వికసించింది.

"భోజనాలు అక్కడే కానిద్దాం. చీకట్లో మీరిద్దరూ మళ్ళీ ఏం వస్తారుగానీ రాత్రికి అక్కడే ఉండండి. మా అత్తగారు వాళ్ళెంత మంచివారో మీరే చూస్తారుగా!" అందామె.

అందరూ బయటికి వచ్చి ఓ జట్కాబండిని కుదుర్చుకున్నారు. సీమ అత్తగారి కుటుంబం ఖాళీగా ఉన్న ఓ ముస్లిం కుటుంబీకుల ఇంట్లో కాపురముంటున్నారు. దార్లో కొన్నిచోట్ల వెలుతురున్నా కొన్నిచోట్ల చీకటిగానే ఉంది. బండి నెమ్మదిగా వెళ్తుంటే, "రహమత్ అలీభాయ్! కాస్త వేగంగా నడుపు! ఈ వేగంతో వెళ్తే మనం చేరేసరికి తెల్లవారుతుంది" అన్నాడు సోమనాథ్ బండివాడితో.

"ఈ సమయంలో మీరు అంతదూరం వెళ్తున్నారంటే ఏదో ముఖ్యమైన పని ఉంటేనే వెళ్తారు. ఈ రోడ్డులో అక్కడక్కడ గోతులున్నాయి. పొరపాటున గుర్రం కాలు ఏ గుంటలోనో పడితే త్వరగా చేరే మాటేమిటోగాని మరింత ఆలస్యం జరుగుతుంది" అన్నాడతను.

"మున్సిపాలిటీవారు రోడ్లను ఎందుకు బాగుచేయించరో" అంది రాధ.

"గత మూడు మాసాలుగా సిబ్బందికివ్వాల్సిన నెలజీతాల కోసమే బ్యాంకు నుండి రుణం తీసుకుంది మున్సిపల్ కమిటి. ఇక రోడ్లేం వేస్తారు? "

"మనం పన్నులు కట్టేది నగర శుభ్రత కోసమా? ఉద్యోగుల వేతనాల కోసమా? " ఆశ్చర్యంగా అడిగింది రాధ.

"ఏమైనా అనుకో"

కాస్సేపయ్యాక "రహమత్‌భాయ్! ఇక్కడ వెలుతురు బాగానే ఉందికదా! గుర్రంపై కొరడా ఝుళిపించు" అన్నాడు సోమనాథ్.

"స్వామీ! ఈ గుర్రంవల్లే నేను ముప్పూటలా భోంచేస్తున్నాను. దీనిపై నేను కొరడా ప్రయోగించను. పాపం! రోజంతా పనిచేసి అలసిపోయి ఉంది. ఇంతకంటే వేగంగా ఏం నడుస్తుంది చెప్పండి. కావాలనుకున్నంత స్పీడు పెంచడానికి ఇదేమైనా యంత్రమా? మనలాగే మాంసం, ఎముకలున్న జీవే! అసలు ఇది దాని విశ్రాంతి సమయం. ఈ సమయంలో ఈ మార్గంలో రావడానికి ఏ జట్కావాడూ ఒప్పుకోడని నేను వస్తున్నాను. మీరు చింతించకండి! సగానికి పైగా వచ్చేశాం. కాస్సేపట్లో చేరుకుంటాం" అన్నాడు రహమత్‌ఆలీ.

"ఇతర జట్కావాళ్లు ఈ దారిలో రావడానికి భయపడతారంటున్నావు. నీకు లేదా భయం" అడిగింది రాధ.

"నా భార్య జన్మించిన గ్రామం కాశీ. ఆమె ఆ నగరంలో అవధి భాషలో విన్న ఒక దోహా చెబుతుంటుంది. అదెవరు రాశారో నాకు తెలియదుగానీ, 'జీవన్మరణాలు, దారిద్ర్యం, ధనికత్వం, మంచి పేరు, చెడు పేరు అన్నీ పైవాడి చేతిలో ఉంటాయి' అని ఆ పంక్తులకు అర్థం" అన్నాడు రహమత్ ఆలీ.

"ఇది సంత్ తులసీదాస్ దోహా! ఇదే నా నీ భార్య ఉటంకించేది" అడిగింది రాధ.

"అవునమ్మా!" అంటూ కొన్నేళ్ళక్రితం ఓ హిందువుల సమూహం సృజించిన రక్తపాతమైనాన్ని వివరించి "అహింసామంత్రం జపించే హిందువులు ఇంత క్రూరంగా వ్యవహరించటం నేను ఆరోజే మొదటిసారిగా చూశాను. నిజం చెప్పాలంటే హిందువైనా, ముస్లిమైనా, సిక్కు అయినా, క్రైస్తవుడైనా కఠోరత్వపు ముసుగు ఓసారి ధరించాడంటే ఇక అంతే! అతను ప్రతి వస్తువునూ ఆ ముసుగులోనుండే చూడటం ప్రారంభిస్తాడు. ఇక ఏ అంశాన్నీ మానవత్వం దృష్టితో చూడలేడు!

ఇప్పటిదాకా సీమ మౌనంగానే ఉంది. తనను చూసి తన అత్తామామలు ఎంతగా సంతోషిస్తారో ఊహించుకుంటోంది. కామినిని ఎంతగా ముద్దులాడతారో? అసలు తమని చూడగానే నమ్మలేనంతగా ఆశ్చర్యపోతారుగావును! ఇలా ఊహలలో విహరిస్తున్న ఆమెను రహమత్ చివరి మాటలు ఈ లోకంలోకి తెచ్చిపడేశాయి.

"రహమత్‌భాయ్! నీవు గొప్పవాడివి సుమా" అంది.

"చెల్లీ! మృదుహృదయుడూ, నిజాయితీప రుడూ అయిన నా మిత్రుని దయవల్లనే నేనివాళ ప్రాణాలతో ఉన్నాను" అన్నాడు రహమత్‌భాయ్.

ఈ సమాధానం వింటుంటే జాహిద్ స్మృతులు మదిలో మెదిలాయి. అంతలో సీమ అత్తగారు నివసించే ఇంటికి చేరుకుంది బండి.

సీమ తలుపు తట్టింది. సీమ అత్తగారే స్వయంగా వచ్చి తలుపు తెరిచింది. సీమ ఆనందానికి అవధులు లేకపోయాయి. "అత్తయ్యా!" అంటూ పాదాభివందనం చేయబోయింది.

ఏ పామో, తేలో కాటేయబోతున్నట్లు చప్పున కాళ్ళని వెనక్కి లాక్కుంది సీమ అత్తగారు. సీమ నిస్తబ్ధురాలై నిలిచిపోయింది. ముఖం పాలిపోగా, "అత్తగారూ! నేను సీమను! మిమ్మల్ని అంటిపెట్టుకునే తిరిగే కామిని ఇదిగో...!" అంది.

"ఆc ఆc! కన్పిస్తూనే ఉంది. దేవుని దయవల్ల నా మెదడు సరిగ్గానే పనిచేస్తోంది! కళ్ళూ స్పష్టంగానే కన్పిస్తున్నాయి. ఇన్నాళ్ళూ ముసల్మానులవద్ద వుండి ఇంకా ఏ మొహం పెట్టుకుని వచ్చావిక్కడికి? ఊళ్ళోనుండి అపహరింపబడిన ఇతర మహిళలందరూ అప్పుడే పోలీసుల రక్షణతో తిరిగి ఇళ్ళకు వచ్చేస్తే నువ్వేం చేస్తున్నావు అక్కడ? ఎందుకు రాలేదు? పాపం! మన్‌మోహన్ నిన్నూ, నీ కూతుర్ని విడిపించడం కోసం పరుగెత్తుకొచ్చాడు. నేటివరకూ అతనేమయ్యాడో, ఎక్కడున్నాడో తెలియదు. నీ కోసం నా కొడుకు తన ప్రాణాన్ని పణంగా పెట్టాడు. దానికి ప్రతిఫలంగా నువ్వేం చేశావు? నా కొడుకును బాధించినవారితో సరసాలు, సరదాలు తీర్చుకున్నావు"

ఇదంతా విని సీమ మనసు తీవ్రంగా గాయపడగా నిశ్శబ్దంగా ఉండిపోయింది. కాస్సేపటికి గొంతు పెగుల్చుకుని, "అత్తగారూ! మీరేం అంటున్నారు? నేనింకా మీ కోడలినే! మీ ఇంటి గౌరవాన్నే" అంది.

ఈసారి సీమ అత్తగారు, మరింత క్రూరంగా అరిచింది. "దేశదేశాలు తిరిగొచ్చావు

నీకు వంశగౌరవం, మర్యాద గుర్తొచ్చాయా? ఎలా వచ్చావో అలా వెళ్ళిపో లేకుంటే నా అంత చెడ్డమనిషి మరొకరు ఉండరు"

ఈ గొడవ విన్న ఇరుగు పొరుగు వాళ్ళు తమ ఇళ్ళనుండి బయటికి వచ్చి వింతగా చూడసాగారు. కానీ ఎవరూ సీమను సమర్థిస్తూ మాట్లాడలేదు. సీమ మామగారు కూడా 'మౌనప్రేక్షకుడే అయ్యాడు. రాధ సీమ అత్తగారికి నచ్చచెప్పడానికి ప్రయత్నించగా, "ఇది నీకేం అవుతుంది? నీతులు చెప్పడానికి వచ్చావు" అని ఎదురుదాడి చేయసాగింది.

ఏ అపేక్షలతో ఏ ఆకాంక్షలతో అత్తమామలను చేరుకోవాలని ప్రయాసపడి ఇంత దూరం వచ్చిందో వాటిపై ఆవిధంగా నీళ్లు చిలకరించారు వాళ్లు. నిరాశగా సీమ, రాధా సోమనాథ్‌ల వెంటవారి ఇంటికి తిరిగి వచ్చేసింది. ముగ్గురూ ఎనలేని బాధ అనుభవించసాగారు.

సీమ అత్తమామల్ని కోర్టుకీడుద్దామంది రాధ. "భారతదేశపు కోర్టుల సంగతి అందరికీ తెలిసిందే! కోర్టు ద్వారా న్యాయంకోసం పోరాడితే ఏళ్ళూ పూళ్ళూ పడతాయి. నా

కూతుర్ని తీసుకుని ఆ అవినీతి కోర్టుల మెట్లెక్కి దిగానో దీనివల్ల వంశంపరువు పూర్తిగా మట్టిలో కలిసిపోతుంది..." అంది సీమ.

ఇల్లు చేరాక ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు. సీమ సిగ్గుతో చితికిపోతోంది. ఇలాంటి స్థితిలో చాలావరకు ఆత్మహత్యకు పాల్పడదామనే ఆలోచిస్తుంటారు స్త్రీలు. కానీ సీమ ఈ కోవకి చెందే మహిళ కాదు. అంతేగాక కామిని పోషణభారం, చదివించడం వంటి బాధ్యతలు ఆమెకు ఉన్నాయి.

అందరి ఎదుటా తిరస్కారానికి గురవటంతో లోలోపల, "ఇలా అవమానింపబడి బతకడం కన్న మరణిస్తేనే మేలు" అనుకుంది. కానీ అంతలోనే సుప్రసిద్ధ ఉర్దూ కవి మహమ్మద్ ఇక్బాల్ పంక్తులు గుర్తొచ్చాయి. 'ఈ కవికోసం మృత్యువూ భగవంతుడూ మరి కొంతకాలం ఎదురుచూడాల్సిందేననీ, ఇప్పుడప్పుడే తను రాబోననీ, చేయాల్సిన పనులు ఇంకా చాలా ఉన్నాయ'నీ అంటాడు, ఇక్బాల్.

తన వారికంటే పరాయివారే తనపై వాత్సల్యం, అభిమానం వ్యక్తపరుస్తుంటే సీమ కళ్ళు పదేపదే చెమ్మగిలసాగాయి. రాత్రంతా తన భవిష్యత్తు గురించీ, ఏం చేస్తే బాగుంటుందనీ ఆలోచిస్తూనే గడిపింది. మర్నాడు తనను ఢిల్లీకి పంపించమని రాధ-సోమనాథ్‌లను అడగ్గా వారందుకు అంగీకరించలేదు.

★ ★ ★

తన జీవితం సుడిగాలిలోని దీపంలా అన్పించసాగింది సీమకి. ఎన్నెన్నో ఆశలతో తన గూడుగా భావించి తిరిగి వచ్చింది ఆ ఇంటికి. అక్కడి సర్పం తనను కాటేయడానికి సంసిద్ధమవుతుందని ఆమెకేం తెలుసు. కొన్నేళ్ళక్రితం ఎవరో నావికుని సాయంతో ఆమె తన నౌకను జీవనసాగరంలోకి నెట్టింది. కాని అతను పాకిస్థాన్‌లోనే ఉండిపోయాడు. ఈ సాగర సుడిగుండాలను తుపాన్లను తను ఒంటరిగా ఎదుర్కొనగలదా అన్పించసాగింది.

ఐదారు రోజులు గడిచాక తను ఢిల్లీ వెళ్తాననీ, అనుమతించమనీ రాధని మళ్ళీ అడిగింది సీమ. "పదిరోజుల తర్వాత వస్తానని గదా నిర్మలకి చెప్పావు? అందుకే మరో నాలుగురోజులు ఆగితే నష్టమేముంది? " అంది రాధ.

తనని ఆదరించి, ఈ ఊరికి తీసుకువచ్చి తనకోసం కష్టపడి, ఆలోచిస్తున్న ఆ దంపతుల మాటల్ని తిరస్కరించలేకపోయింది సీమ.

సీమ అత్తగారింటినుండి అవమానం పొంది వచ్చేసినరోజే ఈ విషయంలో రాధా సోమనాథ్‌ల మధ్య సంభాషణ జరిగింది.

"ఇలాంటి స్థితిలోనే సీమ జాగ్రత్తగా ఉండాలి,

ధనలోపంవల్లనో, కుటుంబసభ్యుల దుర్వ్యవహారాలవల్లనో లేక పరిస్థితులకారణంగానో యువతులు వేశ్యావృత్తిని స్వీకరిస్తారు. పరిస్థితుల వత్తిడివల్ల సీమకి ఆ దుస్థితి కలగరాదు" అన్నాడు సోమనాథ్.

"మనదేశంలో ప్రజలు సగానికిపైగా దారిద్ర్యరేఖకు దిగువగానే ఉన్నారు. కుటుంబీకులవల్ల బాధల్ని పడుతున్న మహిళల సంఖ్య కూడా తక్కువేమీలేదు. అయితే వీళ్ళంతా వేశ్యావాటికల్లోకి వెళ్తున్నారా? వేశ్యవృత్తిలోనే జన్మించిన వారో లేక కాసుల లాలూచీకి లోబడిన తల్లిదండ్రులు అమ్మేయడంవల్లనో కొందరు వెళ్తుంటారు అంతే" అంది రాధ.

"నేనంటున్నదీ అదే" ఓ స్త్రీ వేశ్యగా మారిందంటే ఎన్నో కారణాలుంటాయి. సీమ ఎంతో అందమైనది, వయసు పాతికేళ్ళలోపు. ఏ దుష్టుని దృష్టి అయినా ఆమెపై

పడితే ఆమె సౌందర్యమే ఆమెకి అభిశాపమై ...

"ఏ బలాత్కారానికో గురైతే..."

"అయితే ఏం చేద్దాం"

"సీమను ఢిల్లీకి పంపటం సమస్యల్ని కొని తెచ్చుకోవడమే అవుతుంది. మన మేడపైన గది ఖాళీగానే ఉంది. ఆమె నిర్మలని కూడా పిలిపించుకోవచ్చు"

"సర్లెండి! చూద్దాం" అంటూ అప్పటికా సంభాషణ ముగించింది రాధ.

ఆ రాత్రి నిద్రకు ఉపక్రమించాక చాలా సేపటివరకు ఆలోచనల్లోనే గడిపింది రాధ. సోమనాథ్ మాటలు చెవుల్లో ప్రతిధ్వనించసాగాయి.

"సీమ సౌందర్యం, ఆమెకే కాదు తనకు కూడా శాపమే అవుతుందేమో? సోమనాథ్‌ది నిష్కళంకచరిత్రే అయినా ఎప్పుడు ఎవరు ఎలా ఎందుకు మారతారో ఎవరికి తెలుసు? అగ్నికి సమీపంలో ఉన్న ఘృతం కరగటం ఎంతసేపు! అది ప్రకృతి ధర్మం! తన స్నేహితురాల్ని వీధిలోకీ పంపలేకపోతోంది! తన ఇంట్లోనూ ఉంచుకోలేక పోతోంది తను.

ఆ మానసిక సంఘర్షణ తరువాత ఏదో ఉపాయం తోచటంతో నిశ్చింతగా నిద్రించింది రాధ.

తెల్లవారి లేస్తూనే, "సమాజ కళ్యాణ్ అధికారి దుర్లభసింహ మీకు మంచి మిత్రుడే కదా! లోగడ మనం వెళ్ళినప్పుడు ఒక వ్యక్తి అవసరం అని చెప్పాడు గుర్తుందా? సీమకి అతని సంస్థలో ఉద్యోగం ఇప్పిస్తే బావుంటుందేమో? ఆ సంస్థలో పని చేసే ఉద్యోగులకి నివాసవసతి కూడా వాళ్ళే అక్కడే సమకూరుస్తారనుకుంటాను. సీమకి సమస్యలన్నీ పరిష్కారమవుతాయి. ఢిల్లీనుండి నిర్మలని కూడా పిలిపించుకుని తనవద్దే ఉండనివ్వచ్చు..." అంది రాధ.

సోమనాథ్ రాధ ప్రతిపాదనతో ఏకీభవించాడు. ఇద్దరూ సీమను వెంటపెట్టుకుని దుర్లభ్‌సింహ్ కార్యాలయానికి వెళ్ళారు. అయితే అంతకు ముందురోజు అతను ఫ్రాన్సుకు వెళ్ళాడనీ, మూడువారాలవరకు తిరిగి రాడనీ తెలిసింది. సీమ అప్పటికే లక్నో వచ్చి వారం దాటింది. ఆమెకు పదే పదే నిర్మల గుర్తుకొస్తోంది. రాధకి భారంగా మరో మూడు వారాలు ఉండటం సీమకి నచ్చలేదు. నిర్మల ఒంటరిగా ఉంది గనుక తను వెళ్తానంది సీమ.

"దుర్లభ్‌సింహ్‌కు ట్రంకాల్ చేస్తాను. అతని జవాబు విన్నాక నిర్ణయిద్దాం" అన్నాడు సోమనాథ్. వెంటనే ట్రంకాల్ చేయగా దుర్లభ్‌సింహ్ లైన్లోకి వచ్చాడు. సీమ వివరాలు చెప్పి తాము వచ్చిన పని చెప్పాడు సోమనాథ్.

"నా సంస్థలో ఒక ఉద్యోగం ఖాళీగా ఉంది. నీవు చెబుతున్న లక్షణాలుగల మహిళ ఈ పదవికి అన్నివిధాలా న్యాయం చేయగలుగుతుందని నా అభిప్రాయం. ఆమెని కొంతకాలంపాటు ఆపి ఉంచండి. నేను అనుకున్న దానికంటే ముందే వస్తున్నాను" అన్నాడు.

సీమ సందిగ్ధంలో పడి ఏమీ మాట్లాడలేకపోయింది. సీమ అక్కడి నుంచి వెళ్ళిపోయాక, "ఈశ్వరుని లీలలు ఎంత చిత్రం? కొందరిని అందలం ఎక్కిస్తాడు మరి కొందరిని అణగదొక్కేస్తాడు. కొందరికి బహుమానాలు, మరికొందరికి ఛీత్కారాలు, అవమానాలు! కొందరికి జీవితాంతం సుఖశాంతులు, సిరిసంపదలు ఏమీ ఉండవు. మరి కొందరికి జీవితం వడ్డించిన విస్తరి. అయినా ఏదో ఒక సమస్య వారినీ పీడిస్తుంది. సమస్యలు కష్టాలు లేని వారుండరు. అవతార పురుషుడు శ్రీరాముడు, యేసుప్రభువు, హజరత్ మహమ్మద్‌లు కూడా విధివిధానాన్ని అతిక్రమించలేకపోయారు. ఒకతను భగవంతుని అవతారం అన్పించుకుంటే, మరొకరు అతని పుత్రు

డుగా చలామణయ్యాడు. ఇంకొకరు భగవంతుని దూతగా గణుతికెక్కాడు. కానీ ఎన్ని కష్టాలనుభవించవలసి వచ్చింది? రాముడు 14 సంవత్సరాలు వనవాసం చేశాడు, జీసస్ శిలువనెక్కాడు, హజరత్ మహమ్మద్ జన్మభూమిని వదలాల్సి వచ్చింది" అంది రాధ.

"నిజమే! మనిషి ఎదురు దెబ్బలు తిననంతవరకు ఆపదల అగ్నిపరీక్షలకు గురవనంతవరకు అసలు "మనిషి" కాలేడు. మనిషి కావడానికే ఇవన్నీ అవసరమైతే ఇక భగవంతుడుగా మారడానికి లేదా భగవంతునితో మమేకం చెందడానికి మరెన్ని అనరోధాలను ఎదుర్కోవాలి? ఎంతెంత కష్టపడాలి? " అన్నాడు సోమనాథ్.

దుర్లభ్‌సింహ్ రాకకై నిరీక్షిస్తూ రోజులు గడపటం విసుగ్గా ఉంటుందని అప్పుడప్పుడు రాధ, సోమనాథ్‌లు సీమ, కామినులను బయటకి తీసుకువెళ్ళేవారు. లక్నోలో చూడదగిన ప్రదేశాలన్నీ ఒక్కటొక్కటిగా చూపించారు. వీటిలో బారా ఇమాంబాడా సీమకి ఎంతగానో నచ్చింది. సందర్శకుల భవన విశేషాల్ని వివరించే గైడు ఈ భవనాన్ని 1784లో ఆసఫ్-ఉద్-దౌలా నిర్మింపచేశాడని చెప్పాడు. ఇక్కడి ఆర్చీలుగల, ధనుషాకారంలో ఉన్న పైకప్పు చూసి సీమ ఆశ్చర్యచకితురాలైంది? ఎంతటి నైపుణ్యం? వీటిపైన ఉన్న మూడు వ్యూహామార్గాలు భూల్‌భూలియాల్ని చూసి మరింత ఆశ్చర్యపడింది. ఇక్కడ కామిని మూడు, నాలుగు సార్లు అక్కడా ఇక్కడా దాక్కుని గైడుని కంగారుపెట్టింది. తన సహాయంలేకుండా ఈ వ్యూహాత్మక మార్గాల (భూల్‌భూలియా) నుండి తిరిగి కిందికి వెళ్ళగలరా? అని గైడు సరదాగా సవాలు విసిరాడు. లోగడ రెండుసార్లు ఇందుకు ప్రయత్నించి విఫలమైనందున రాధా, సోమనాథ్‌లు శ్రమ దండగనుకున్నారు. సీమ ఈ సవాలును స్వీకరించి బయల్దేరింది. ఎవరి సహాయమూ లేకుండానే కిందిదాకా చేరి విజయహాసం చేసింది.

ఒకరోజు లక్నోలోని రెసిడెన్సీ చూడటానికి వెళ్ళారు. దాని ప్రాముఖ్యతను వివరిస్తూ, ఒకప్పుడు ఇక్కడ బ్రిటిష్‌వారి ఏజెంట్ ఉండేవాడు. 1857లో అంటే భారత ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం సందర్భంగా ఆంగ్లేయ కుటుంబాలు ఈ ప్రదేశంలోనే దాగున్నాయి. ఇక్కడినుండే 87 రోజులపాటు స్వతంత్ర్య సంగ్రామ వీరులతో పోరాటం జరిపారు. దేశానికి స్వాతంత్ర్యం లభించాక 15వ ఆగష్టు 1947న ఈ భవనంపై భారతీయులు ఎంతో ఉత్సాహంగా, గర్వంగా త్రివర్ణ పతాకను ఎగురవేశారు" చెప్పాడు సోమనాథ్.

"ఈ భవనానికి ఇంత చరిత్ర ఉందన్న మాట!" అంది సీమ.



సీమ లక్నో వెళ్ళాక నిర్మల వంటరిదైంది. మూడు రోజులు బిక్కుబిక్కుమంటూనే గడిపింది. నాలుగవ రోజు ఓ నవయువతితో పరిచయమేర్పడింది. ఆ యువతి చొరవగా నిర్మలతో మాట కలిపి తన పేరు 'షకీలా' అని చెప్పింది.

"నా దగ్గరికి ఎందుకు వచ్చారు? " సంశయంగా అడిగింది నిర్మల.

"నేను హైద్రాబాద్‌లో ఓ పెద్దహోటల్లో ఉద్యోగం చేస్తున్నాను. హోటల్ పనులపై

అప్పుడప్పుడు ఢిల్లీకి వస్తుంటాను. ఢిల్లీకి వచ్చినప్పుడల్లా ఈ సత్రానికి రావటం నా అలవాటు, ఇలా వస్తే కొత్త స్నేహాలు, పరిచయాలు ఏర్పడుతుంటాయి. అందుకే ఇలా వచ్చాను" చెప్పింది షకీలా.

"హైద్రాబాద్‌లో రజాకార్ల, గొడవ జోరుగా ఉందని విన్నాను" అంది నిర్మల.

"ఔను! అది ఒకప్పుడు ఉన్న మాట నిజమే! కాని ప్రస్తుతం జోరు తగ్గింది.

లెఫ్టిస్టులు నిజాంకు వ్యతిరేకంగానూ, రజాకార్లు హైద్రాబాద్‌ను భారతదేశంలో కలిపినందుకు వ్యతిరేకంగానూ పోరాటం సలిపారు. మీ పేరేమిటో" అంది షకీలా.

తన పేరు చెప్పింది నిర్మల.

ఢిల్లీకి ఎందుకు వచ్చావంటూ రెండవ ప్రశ్న వేసింది షకీలా.

"కొన్నాళ్ళక్రితం తూర్పు పాకిస్థాన్‌నుండి వచ్చిన శరణార్థులతో కలిసి ఇక్కడికి వచ్చాను. నా మిత్రురాలు సీమ. మేమిద్దరం ఓ శరణార్థి శిబిరంలోకి ముందుగా వెళ్ళాం. అక్కడినుండి ఈ సత్రానికి వచ్చాం'

"సీమ ఏది? "

"నాలుగు రోజులక్రితమే లక్నోలో ఉండే ఆమె స్నేహితురాలు కన్పించి సీమని తీసుకువెళ్ళింది. తన అత్తమామలు అక్కడున్నారని తెలిసి సీమ వెళ్ళింది. ఓ వారం పది రోజుల తరువాత వస్తానంది"

"ఆమె కుటుంబసభ్యులు కలిస్తే తనని ఇక్కడికెందుకు రానిస్తారు? వాళ్ళు నీభారం ఎందుకు మోస్తారు? "

"నా స్నేహితురాలు తప్పకుండా వస్తుందని నా నమ్మకం. అక్కడే నాకేదైనా పని చూస్తానంది"

"పని ఇప్పించేందుకైతే నేనూ... ఇప్పించగలను"

"ఏం పని ఇప్పిస్తావు" అడిగింది నిర్మల.

"ఏం చదువుకున్నావు నీ వివరాలేమిటి? '



"దేశవిభజన ఫలితంగా వంటరిదాన్నయ్యాను. అలంకరణ కళలో నిష్ణాతురాలినని అనుకుంటున్నాను"

"మా హోటల్‌లోనే నీకు ఉద్యోగం ఇప్పిస్తాను. నేనింకా పదిరోజులు ఇక్కడే ఉంటాను. నీవు నిదానంగా ఆలోచించుకో. ఇంతలో నీ స్నేహితురాలి విషయం కూడా తెలుస్తుంది. ప్రస్తుతం బయల్దేరు! భోజన సమయం అయింది. ఎక్కడైనా తినివద్దాం" అంది షకీలా.

షకీలా ఆతిథ్యాన్ని స్వీకరించడానికి సంకోచించింది నిర్మల. కానీ ఆమె మళ్ళీ మళ్ళీ పిలవటంతో మొహమాటంగానే బయల్దేరింది. ఓ టాంగాని మాట్లాడుకుని చాంద్‌నీచౌక్‌కి వెళ్లారు. పంజాబీ ధాబాలోకి వెళ్ళి, భోజనం ముగించి బయటకి వచ్చారు. వందలాది శరణార్థులు వీధుల్లో వివిధ రకాల వస్తువులు గొంతెత్తి అరుస్తూ, అమ్ముతున్నారు.

"పాపం! వీరికిది జీవన్మరణ సమస్య. వస్తువులు అమ్ముడవకుంటే రాత్రికి భోజనం కష్టం. అందుకే అలా అరుస్తున్నారు..." అంది నిర్మల.

"స్థానిక దుకాణాల యజమానులకు వీరిలా అమ్మటం నచ్చదు" చెప్పింది షకీల.

"నిజానికి వీరిపట్ల ఎవరైనా సానుభూతి చూపించాలి. పాకిస్తాన్‌లో అన్నీ వదులుకుని వచ్చేశారు. దేశ స్వతంత్ర సంగ్రామ చరిత్రలో ఒక అధ్యాయం వీరి నెత్తురుతోనే రాయటం జరుగుతుంది" ఆశ్చర్యంగా అంది నిర్మల.

"వ్యాపారంలో అన్నాతమ్ముడు, బంధువు, మిత్రులు వంటి సంబంధాలకు తావులేదు. ఇక్కడ డబ్బే సర్వస్వం. శరణార్థుల రాకవలన తమ గిరాకీ తగ్గుతుందని దుకాణాలవారికి తెలుసు. అందుకే వాళ్లు వీళ్లని ఇష్టపడరు" అంటూ పక్షుల ఆస్పత్రివైపు దారితీసింది షకీల.

లోగడ ఒకసారి తను పక్షుల ఆస్పత్రి చూసినా షకీల వెంట మళ్లీ వచ్చింది

నిర్మల. చికిత్సాలయ పరిసరాలలో పక్షులు తమ కలరవాలు పంచిపెడుతున్నాయి. కొన్ని పక్షుల మెడలు పొడవు, కొన్నిటి కాళ్ల పొడవు. కొన్నిటి రెక్కలు అందంగా ఉంటే మరి కొన్నిటి కళ్లు అద్భుతంగా ఉన్నాయి.

కాసేపు అక్కడ గడిపి చాంద్‌నీచౌక్ పశ్చిమ మూలవైపు ఉన్న ఫతేహపురీ మసీదు చూడడానికి వెళ్లారు. దీనిని 1650లో షాహజహాన్ భార్య ఫతేహపురీ బేగం కట్టించారు.

చాంద్‌నీచౌక్ దక్షిణ భాగాన ఉన్న ప్రముఖ జామా మసీదును చూశారు. ఈ మసీదుకు 4వ అక్టోబర్, 1650లో పునాది రాయి వేశారు. దీని నిర్మాణానికి ప్రతిరోజూ 5 వేలమంది కూలీలు పనిచేసేవారు. అలా ఈ మసీదు పూర్తిగా కట్టడానికి ఆరు సంవత్సరాల కాలం పట్టింది. కొందరు మొగల్ పాదుషాలు నమాజ్ చదువుకోడానికి ఇక్కడికే వచ్చేవారు. షకీల నిర్మలని కొత్త ఢిల్లీకి కూడా తీసుకువెళ్లింది. అక్కడ ఎడ్విన్ ల్యూటిన్, హర్‌వర్ట్ బెకర్‌ద్వారా నిర్మింపబడిన రాష్ట్రపతి భవన్, కేంద్రీయ సచివాలయం, పార్లమెంట్ హౌస్, ఇండియా గేట్ మెమోరియల్ వంటివి సందర్శించారు.

సాయంకాలం కావచ్చింది. షకీలా, నిర్మల అలసిపోయి టాంగాలో సత్రానికి వచ్చేశారు. నిర్మలని సత్రం దగ్గర దిగబెట్టి షకీలా తన నివాసానికి వెళ్తూ రేపు వస్తానని చెప్పింది.

సీమ లక్నో వెళ్లాక మొదటిసారిగా మానసికోల్లాసం కలిగింది నిర్మలకి. దిగులు కొంచెం తగ్గినట్లనిపించింది. అక్కడే ఉండే మహిళల్లో ఒకామె దేశాన్ని ముక్కలుచేశారంటూ కాంగ్రెస్‌ని తిడుతోంది. మరొకావిడ ముస్లింలీగును తప్పుపడుతోంది. నిర్మల నిట్టూర్చింది. కాలమే మంచి చెడులను నిర్ణయిస్తుంది. కాని ఒకటి నిశ్చయంగా చెప్పవచ్చు ఈ దేశ విభజన కారణంగా ఆరు లక్షల మందికిపైగా ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. వాళ్లని ఇప్పుడు ఎవరూ బతికించజాలరు. అలాగే అపహరింపబడిన లక్షమంది యువతుల మానాన్నీ సతీత్వాన్నీ ఎవరూ తిరిగి ఇవ్వలేరు. భారతదేశంనుండి పాకిస్తానుకు పాకిస్తానునుండి భారతదేశానికి పయనమైన కోటిన్నర మందికి పైగా ఉన్న కాందిశీకుల హృదయాల్లో కలిగిన వైమనస్యాల్ని ఎవరూ దూరంచేయలేరు.

మర్నాడు షకీలా నిర్మల దగ్గరికి వచ్చేసరికి నిన్నటి అలంకరణలు ఇవాళలేవు. ఈరోజు అలంకరణ మరోరకంగా, మరింత నూతనంగా ఉంది. కేశాలంకరణ అద్భుతంగా ఉంది. వెంట్రుకలు విరబోసుకున్నా అందులో ప్రత్యేకత ఉంది. నిన్న చీరకట్టింది. ఇవాళ షల్వార్, కమీజ్, దుపట్టా ధరించింది. ఓ మోడల్‌నో, సినీతారనో తలపించేలా ఆకర్షణీయంగా ఉందామె. పెదవులపై చిరునవ్వు లాస్యం చేస్తోంది. పదుగురిని పరిచయం చేసుకోవడంలోనే కాదు ఫ్యాషన్‌గా అలంకరించుకోవడంలోనూ ఈమె చతురురాలే అనుకుంది నిర్మల. నిర్మలకంటే షకీల వయసులో పెద్దదే అయినా ఇద్దరూ ఒకేతరానికిచెందినవారు కావటంతో స్నేహం కుదిరింది, పెరిగింది. "షకీల పనిచేస్తున్న హోటల్‌వారు సిబ్బందికి జీతభత్యాలు పుష్కలంగా ఇస్తారు కాబోలు అందుకే అలంకరణ కోసం ఈమె ఇంత డబ్బు వెచ్చించగలుగుతోంది. ఈ లెక్కన ఆ హోటల్లో ఉద్యోగం దొరకడం అదృష్టమే..." అనుకుంది నిర్మల.

ఇద్దరిమధ్యా కబుర్లు మొదలయ్యాయి. తను హైద్రాబాద్‌కి వెళ్లే విషయంలో ఓ నిర్ణయానికి రావడానికి ముందు అక్కడి రజాకార్ల కార్యకలాపాల గురించి అకస్మాత్తుగా దాడిచేసే గెరిల్లా విప్లవకారుల గురించి మరిన్ని విషయాల్ని తెలుసుకోవాలనుకుంది నిర్మల.

"సామ్యవాదుల ప్రధాన లక్ష్యం సమాజంలో ఆర్థిక సమానత్వం తీసుకు రావడం. హైద్రాబాద్‌లోని సామ్యవాదుల లక్ష్యం నిజాం పెత్తనాన్ని కూకటివేళ్లతో పెళ్లగించటమే! ఈ లక్ష్యాన్ని చేరుకోవడం కోసం సామ్యవాదులు తమ సభ్యులతో సమాజాల్ని స్థాపించి సంగంగా గుర్తింపుపొందారు. ఈ సంగం సభ్యులు పార్టీ సాధించబోయే సత్ఫలితాలకోసం చంపడానికీ, చావడానికీ సిద్ధంగా ఉంటారు. ఇలాంటి దళాలు 1939లోనే ప్రారంభమైనా 1946లో ఆందోళన ఉధృతం అధికమైంది"

"1946లోనే ఆందోళన తీవ్రతరమవడానికి కారణం ఏమిటి? " అడిగింది నిర్మల.

"1946లో నిజాం ప్రభుత్వం రజాకార్ల సహాయంతో హైద్రాబాద్ సంస్థానాన్ని భారతదేశంలో విలీనంచేయకుండా పాకిస్తాన్‌లో కలపాలని ఆలోచించింది. ఈ ఆలోచనతో స్థానిక జనులు ఏకీభవించలేదు. రాజ్యంలో పరిస్థితులు అస్తవ్యస్తంగా తయారయ్యాయి. పర్యవసానంగా సామ్యవాదులు తమ ఆందోళనను ఉధృతం చేశారు" చెప్పింది షకీల.

"మరి రజాకార్లు? "

"నువ్వు హైద్రాబాద్ రావాలని నిర్ణయించుకుంటావుగదా! తరువాత చెబుతానులే! పద ఆకలి మండిపోతోంది" అంటూ బయల్దేరదీసి షకీల తన వాక్చాతుర్యంతో ఆ చర్చను వాయిదావేసింది. భోజనం తరువాత నిర్మల ఈ చర్చను మళ్లీ ప్రారంభిస్తే ఇక ఆమె హైద్రాబాద్ రావడానికి అంగీకరించినట్లే అనుకుంది షకీల. భోజనానంతరం నేరుగా సత్రానికి వచ్చేశారిద్దరూ!

రాగానే రజాకార్ల గురించి ఆరా తీసింది నిర్మల.

"రజాకార్ల ఉద్యమం పేరు ఇత్తెహద్-ఉల్-ముసల్‌మీన్" రజాకార్ ఆందోళన 1927లో ప్రారంభమైంది. హైద్రాబాద్ సంస్థానాన్ని స్వతంత్ర రాజ్యంగా, తన ఏలుబడిలోనే ఉండేలా చేయడమే నిజాం ఆశయం"

"రజాకార్ల నాయకుడు ఖాసీం రజ్వీ ఢిల్లీ ఎర్రకోటపై తన జండా ఎగరేయాలని కలలుగన్నాడంటారు నిజమేనా? "

"రజాకార్ల గురించి నీకు అంతగా తెలిసినప్పుడు ఇక నన్నెందుకు అడుగుతున్నావు? నన్ను పరీక్షించటంలేదుకదా? "

"కొన్నేళ్లకు పూర్వం పంజాబ్‌నుండి హైద్రాబాద్‌కి సత్యాగ్రహం కోసం వచ్చిన వారివల్ల కొంత నాకు తెలిసింది. అప్పట్లో నిజాం హిందువుల ధార్మిక కార్యకలాపాలపై నిషేధం విధించాడట" అంది చిరునవ్వుతో నిర్మల. మళ్లీ తనే "రజాకార్లు సామ, దాన, భేద, దండోపాయాల ద్వారా హిందువులను మతం మార్చుకునేలా చేస్తారా? ఇది హిందూ ముస్లింల వైమనస్యాల్ని పెంచుతుందికదా!"

"కొందరు హిందువులు నిజాం ఆదరణ, ఆశ్రయం పొందడానికి ఇస్లాం మతం స్వీకరించారు. వింతేమిటంటే వారి కుటుంబ సభ్యులు మతం మార్పిడికి అంగీకరించలేదు. పైగా ఇతను అదే ఇంట్లో ఉంటాడు కానీ పరివారాన్ని తాకడు. కుటుంబ సభ్యులూ ఇతన్ని ముట్టుకోరు. ఇతని భార్య భర్త కంచంలో భోజనం వడ్డించేటప్పుడు పళ్లెం తన చేతికి తాకకుండా పైనుండి వడ్డిస్తుంది. పిల్లలూ అంతే! వాళ్లూ తండ్రిని తాకరు. నిజాం పాలన అంతంకాగానే వాళ్లందరూ మళ్లీ ఏకమవుతారని నా అనుమానం"

"విప్లవకారులు, రజాకార్లు ఇద్దరూ హింసనే ఆశ్రయించారు. ఇద్దరి దగ్గరా ఆయుధాలున్నాయి. వీళ్లిద్దరూ తలపడటం లేదెందుకు? "

"ఎందుకంటే రెండు వర్గాలవాళ్లూ అధికార పక్షాన్ని చిక్కుల్లో పెట్టాలనుకుంటున్నారు గనుక. సామ్యవాదులు నిజాం

ప్రభువుని శాంతిగా ఉండనీయదలచుకోరు. హైద్రాబాద్‌ని భారతదేశంలో భాగంగా మిగల్చడం అసంభవం అన్న అంశాన్ని భారత ప్రభుత్వానికి స్పష్టం చేయాలనుకుంటున్నారు రజాకార్లు. ఇక చర్చను ముగిద్దాం. నువ్వు సామ్యవాదివి కాబోవటం లేదు, నేను రజాకార్లలో చేరటంలేదు" అంది షకీల.

★ ★ ★

షకీల కోసం ఎదురు చూడడం అలవాటైంది నిర్మలకి. ఈరోజు షకీల సింధీల దుస్తులు తొడుక్కుని వచ్చింది. ఆ డ్రెస్సులో ఆమె అందం ద్విగుణీకృతమైంది. ఆమెని చూడగానే, "నీవు ప్రతి డ్రస్సులోనూ అందంగానే కనిపిస్తావుసుమా! పేరునిబట్టే గుణం ఉంటుందంటారు. నీ అందమైన ముఖాన్ని చూసే మీ తల్లిదండ్రులు షకీల అనే పేరు పెట్టి ఉంటారు" అంది నిర్మల.

"నన్ను మునగచెట్టు ఎక్కించాలని ప్రయత్నించకు! నీ సౌందర్యం ముందు నేనెంత? సరేగానీ ఈ పరస్పర పొగడ్తలని వదిలి ఏమైనా పనికొచ్చే మాటలు చెప్పుకుందాం. మీ వాళ్ల గురించి చెప్పవూ! ఎవరూ లేరని కొట్టిపారేశావు ఓసారి! ఇప్పుడు నీకథంతా విన్పించాల్సిందే! నీ తల్లిదండ్రులు, అత్తమామలు, భర్త వీరందరితో ఎలా విడిపోయావు? నీ అంతరంగ మిత్రురాలిననే భావించి అడుగుతున్నాను సుమా!" అంది షకీల.

"నా జీవన వృత్తాంతం ఓ బాధామయ గాధ. దుఃఖభరితమైన ఈ కథ విని ఏం చేస్తావు? "

"కష్టాలు, సమస్యలు నీ ఒక్కదానికే కాదు. అందరికీ ఉంటాయి. కొందరికి సంతానం ఉంటే పేదరికం పీడిస్తుంటుంది. ప్రతిభ ఉన్నవారికి దానిని అభివ్యక్తంచేసే అవకాశం రాకపోవచ్చు ఉన్నతపదవులు ఉన్నవారికి సరైన ఆరోగ్యం ఉండకపోవచ్చు లక్షలూ, కోట్లూ మూలిగేవారు అన్నం మెతుకులకి నోచుకోరు. లేదా ఆత్మీయుల్ని కోల్పోతారు. ఏదో రకంగా వేదన ప్రతి ఒక్కరినీ పీడిస్తూనే ఉంటుంది. నూటికి నూరుపాళ్లు ఆనందంగా ఎవరూలేరీలోకంలో. అందుకే ఆ విషయాన్ని పక్కనపెట్టి నీ గురించి చెప్పు" అంది షకీల.

"నేను పాకిస్తాన్‌లోని రావల్పిండిలో పుట్టాను. నా తండ్రి పేరెన్నికగన్న వ్యాపారవేత్త. మా మామగారు కూడా పెద్ద వ్యాపారే! నా పెళ్లయిన కొన్నాళ్లకే మహమ్మారి వ్యాపించింది. దురదృష్టవశాత్తు నా తల్లిదండ్రులు ఇద్దరూ దానికి ఆహుతి అయ్యారు. ఇక అత్తవారింటి విషయం మా అత్తమామలు నా భర్తని అదుపులో పెట్టలేదు. నా తల్లిదండ్రుల మరణం తరువాత ఆయన మరింత విశృంఖలంగా ప్రవర్తించేవారు. అధముల్లో అధముడు కూడా ప్రవర్తించని రీతిలో ఆయన నాతో ప్రవర్తించారు"

"నాకు అర్థం కాలేదు"

"నువ్వు సహృదయురాలివి. ఎదుటివారి కష్టసుఖాల్ని అర్థం చేసుకోగల గొప్ప మనసునీకుంది. నీ దగ్గర దాచటం ఎందుకు? మావారి మిత్రుడొకడు ఈయనతో మనం పరస్పరం ఒకరిభార్యల్ని మరొకరం కొన్ని రాత్రుళ్లు మార్చుకుందాం అన్నాడట. ఈయన దానికి వెంటనే ఒప్పేసుకుని అదే రాత్రి నాతో ఆ విషయం చెప్పారు. వింటూనే కంపరం పుట్టింది. ఇందుకు నేను అంగీకరించేది లేదని స్పష్టంగా చెప్పాను. దాంతో ఆయన వాగ్యుద్ధం మొదలుపెట్టారు. చివరికి కోపంతో నన్ను చావగొట్టి ఇంట్లోనుంచి తరిమేశారు. ఆ తరువాత నాకు ఆయన విషయం తెలీదు. ఆయనకి నా సంగతి తెలియదు" చెప్పింది నిర్మల.

"ఛఛ! ఎంత ఘోరం! ఎంత అన్యాయం! ఒంటరి పోరాటం సలుపుతూ పాకిస్తాన్

నుండి ఇక్కడికి వచ్చేశావన్నమాట! ఇక ఈ విషయం తలచుకొని బాధపడటం అనవసరం. పద! యమునా తీరానికి వెళ్లివద్దాం'' అంది షకీల.

ఇద్దరూ బయల్దేరారు.

యమునాజలాల్ని చూస్తున్న నిర్మల "ఈ యమునానది నీటిని కాళిందుడనే ఓ సర్పం విషమయం చేశాడనీ, అప్పటినుండే నీరు నలుపుగా కన్పిస్తున్నదనీ పురాణాల ద్వారా తెలుస్తోంది. ఆ విషం సంగతి ఎలా ఉన్నా ప్రస్తుతం పెరిగిన పరిశ్రమలు కక్కే పొగలు, వాయువులు పరిసరాల్ని, నీటిని కలుషితం చేస్తున్నాయి. నా అదృష్టం కూడా ఈ నదిలాగే ఉంది. అప్పుడూ కష్టాలే- ఇప్పుడూ కష్టాలే!" అంది.

"ఇలా నిరాశపడకూడదు. నువ్వు చదువుకున్నదానివి. నీకు ఉపాధి ఇప్పిస్తాను. హైదరాబాద్ వాతావరణం బాగుంటుంది. రాబోయే సంవత్సరాల్లో గొప్ప కేంద్రంగా విలసిల్లవచ్చని నాకన్పిస్తుంటుంది. అక్కడ చేసేవారుండాలేగాని పని పుష్కలంగా లభిస్తుంది" అంది షకీల.

షకీలతో ఇలా కాలక్షేపం జరుగుతున్నా సీమ కోసం ఎదురుచూస్తూనే ఉంది నిర్మల. సీమ వెళ్లి దాదాపు ఇరవైరోజులు గడిచాయి. ఆమె రాలేదు. కనీసం తనను అక్కడికి పిల్చుకుని వెళ్తామన్న రాధ- సోమనాథ్‌లూ రాలేదు. గత మూడురోజులుగా షకీల కూడా తన గదికి రాలేదు. నిర్మల ఆలోచనల్లోనే ఉండగా ఆరోజు షకీల వచ్చింది. తను తను పనిచేసే హోటల్ యజమానితో మాట్లాడాననీ ఓ వారంరోజులలోగా నిర్మలని హైదరాబాద్‌కి తీసుకురమ్మనీ, తప్పకుండా ఉద్యోగం ఇస్తానని ఆయన హామీ ఇచ్చాడనీ చెప్పింది.

"ఉద్యోగ వివరాలు చెప్పవూ? నేనేం చేయాల్సి ఉంటుంది" అడిగింది నిర్మల.

"అక్కడికి వెళ్ళాకే తెలుస్తుంది. ఫోన్లో నేనాయన్ని వివరాలేమీ అడగలేదు"

నిర్మల సందిగ్ధావస్థకు లోనైంది. తను హైదరాబాద్ వెళ్ళిపోతే ఇక సీమను కలుసుకునే అవకాశం ఉండదు. సీమ కోసం ఇక్కడే ఉంటే షకీల ఇప్పించబోయే మంచి ఉద్యోగాన్ని, సదవకాశాన్ని చేజేతులా జారవిడుచుకున్నట్టవుతుందేమో? ఏమిటి చేయడం? కాస్సేపు ఆలోచించి కాగితం, కలం తీసుకుంది.

"ప్రియమైన సీమా!

స్వజనులతో, మిత్రులతో విడిపోయే యోగం నా జాతకంలోనే ఉన్నట్లుంది. తల్లిదండ్రుల అండ పోయింది. కట్టుకున్నవాడికి దూరం అయ్యాను. నిన్ను కలిశాక జీవితంలో ఓ మంచి మిత్రురాలు దొరికిందన్న సంతృప్తి, సంతోషం కలిగాయి. కానీ నాకీ అదృష్టమూ నిలిచేలా కన్పించడంలేదు. ఇరవైరోజులనుండీ నీ కోసం ఎంతగానో నిరీక్షించాను. ఈరోజే హైదరాబాద్‌కి వెళ్తున్నాను. ఇటీవల పరిచయమైన ఓ మిత్రురాలు అక్కడి హోటల్లో నాకు ఉద్యోగం ఇప్పిస్తానంది. ఆమె ఆ హోటల్లోనే అధికారిగా పని చేస్తోంది. నిన్ను సదా తలచుకుంటూ ఉన్నాను. మనం మళ్ళీ కలుసుకునేలా భగవంతుడు పరిస్థితులు కల్పిస్తే బావుండునన్పిస్తోంది. కామినికి నా ఆశీస్సులు.

నీ స్నేహితురాలు

నిర్మల "

ఆ ఉత్తరాన్ని కవర్లో పెట్టి అంటించి, సత్రంలో ఉండే గుమాస్తాకిచ్చింది. సీమ వచ్చినప్పుడు ఆమెకి అందించమంది. ఆ తరువాత షకీలతో కలిసి తన అదృష్టాన్ని పరీక్షించుకోడానికా అన్నట్లు హైదరాబాద్ ప్రయాణమైంది. ఢిల్లీనుండి 36 గంటల ప్రయాణం తరువాత హైదరాబాద్ చేరగానే షకీల నిర్మలని తను పనిచేసే ఐదు నక్షత్రాల హోటల్‌కి తీసుకువెళ్ళింది. మేనేజరుకు పరిచయం చేసినప్పుడు అతను ఆమెకు ఉత్సాహంగా స్వాగతం చెప్పాడు.

రోజూ ఆమె హోటల్లోనే ఉండాల్సివస్తుందన్నాడు. ఈ వ్యవధిలో ఆమె నివసించేందుకు ఇల్లు ఏర్పాటు చేస్తానన్నాడు. ఈ రెండు రోజులూ గడిచిన తరువాత ఆమెకి పనులు అప్పగిస్తానన్నాడు.

"షకీలను ఇక్కడినుండి బదిలీ చేశాం. నువ్వేం చింతించకు" అంటూ తారాబాయిని పిలిచి "ఈమె తారాబాయి- తారా అని పిలుస్తా! ఈమె కూడా ఇక్కడ పౌరసంబంధాల అధికారే! ఈమె నీకు అన్నివిధాలుగా సహాయపడుతుంది" అన్నాడు ఆ మేనేజర్.

షకీల వెళ్ళిపోతోందంటే నిర్మలకి ఎంతగానో బాధనిపించింది. కానీ ఏం చేయగలదు? రాత్రికి నిర్మల, షకీల, తార హోటల్లో భోజనం చేశారు. ఆ తరువాత షకీల వెళ్ళిపోయింది.

రెండు రోజుల తరువాత తనకు ఏర్పాటు చేసిన ఇంట్లోకి వచ్చేసింది నిర్మల. అది రెండంతస్థుల మేడ. సకల సదుపాయాలూ ఉన్నాయి. హోటల్ మేనేజర్ ఇప్పటివరకూ తను చేయవలసిన విధుల గురించిగానీ, ఇవ్వబోయే జీతాన్ని గురించిగానీ ఏమీ చెప్పనేలేదు. తనకు రాబోయే జీతంలో నుండి ఇంత పెద్ద ఇంటికి అద్దె, తదితర ఖర్చులకు వెచ్చించగలదా? లేక తనేదైనా వలలో బంధించబడుతోందా? అని కూడా అనుమానించిందామె.



మూడువారాల తరువాత రాధ, సోమనాథ్లు సీమను వెంటపెట్టుకుని దుర్లభ్‌సింహను కలుసుకున్నారు. ఫ్రాన్స్ విశేషాలెన్నో చెప్పాడాయన. ఫ్రాన్స్ కాకుండా రష్యా, అమెరికా వంటి ఇతర దేశాల సంస్కృతులు, చరిత్ర, నాగరికత, భౌగోళికత, సాహిత్యం, భాష వంటి అనేకానేక అంశాల్ని ముగ్గురూ చర్చించసాగారు. చివరగా సీమ కూడా తనకు తెలిసిన విషయాల్ని, రైతాంగ సమస్యల్ని, బిక్షాటన, ఆంగ్లేయుల ప్రవర్తన వంటి అంశాల్ని వాళ్ళతో కలిసి నిస్సంకోచంగా చర్చించింది. ఆమె వాగ్ధాటికి, వివిధ విషయాల పట్ల ఆమెకున్న అవగాహనకు. సమగ్రమైన, పదునైన ఆలోచనా సంవిధానానికీ దుర్లభ్‌సింహ సైతం విస్తుపోయాడు.

ఆమె పరిజ్ఞానం ఆయన్ని అమితంగా ప్రభావితం చేసింది. వెంటనే ఆరోజునుండే ఆమెను "కళ్యాణ కేంద్ర నిర్వాహకురాలు"గా నియమించాడు. కేంద్రంలోనే నిర్వాహకులకు ఉచిత నివాస వసతి ఉందని చెప్పాడు.

తను ఈ బాధ్యతల్ని స్వీకరించేముందు చేయవలసిన ముఖ్యమైన పని ఒకటుందనీ, కొద్ది వ్యవధి కావాలనీ దానికి అనుమతించమనీ కోరింది సీమ.

"ఏమిటది? " అన్నాడు దుర్లభ్‌సింహ.

తన స్నేహితురాలు వంటరిగా ఢిల్లీలో ఉంటున్నదనీ, లక్నోకి తీసుకువస్తాననీ చెప్పింది సీమ.

ప్రస్తుతం పనిలో చేరమనీ, ఓ వారం రోజుల తర్వాత ఢిల్లీకి వెళ్ళవచ్చుననీ చెప్పాడు సింహ.

సీమ మౌనం వహించింది. వచ్చిన ఉద్యోగాన్ని చిన్న కారణంగా వదులుకోగలదా?

మర్నాడే "కళ్యాణ కేంద్ర నిర్వాహక" బాధ్యతలు స్వీకరించి అక్కడ తనకోసం కేటాయించిన ఇంట్లో చేరింది సీమ. తన ఆలస్యానికి క్షమించమనీ, తన కొత్త ఉద్యోగ

వివరాలు రాసి ఓ వారం తరువాత వస్తా నని ముందుగా నిర్మలకి ఉత్తరం రాసింది సీమ.

★ ★ ★

తార ఊరు చూద్దాం పదమని నిర్మలని బయల్దేరదీసింది.

ఎక్కడ చూసినా మసీదులే అధికంగా ఉండటం చూసి, "ఇక్కడ మసీదులు ఎక్కువగా ఉన్నట్లున్నాయి. వాటి వాస్తుకళ అత్యంత సుందరంగా ఉంది" అంది నిర్మల.

"ఇక్కడివాళ్లు ఎంత ధార్మికులో నగరంలోని మసీదుల సంఖ్య చూసే అంచనా వేసుకోవచ్చు" అంది తార.

"ఊళ్లోని మసీదుల సంఖ్యా, దేవాలయాల సంఖ్యా చూసి ఆయా మతస్థులవారే అక్కడ అధికంగా ఉంటున్నారని ఖచ్చితంగా చెప్పలేం. ఎంత అధిక సంఖ్యలో అవి ఉంటే జనం అంతటి ధార్మికులని కూడా చెప్పలేం. ఓ వ్యక్తి సద్గ్రంథాల్ని కొని తన ఇంట్లో ఉంచాడు. వాటివైపు అసలే చూడడు. చదవడు. అనుకుందాం. గ్రంథాల్లోని అంశాల్ని చదవక పుస్తకాలు అలంకరణకు తెచ్చుకున్నంత మాత్రాన అతను పండితుడవుతాడా? మందిరాలు, మసీదులు, గురుద్వారాలు, చర్చిలు ఉన్నంత మాత్రాన ఊళ్ళోవాళ్లు ధార్మికులవుతారా?" అంది నిర్మల.

"మనిషి ధర్మానుయాయి అని ఎప్పుడనిపించుకుంటాడు?" ప్రశ్నించింది తార.

"ధృతిః క్షమా దమో అస్తేయం శౌచమింద్రియ నిగ్రహః

ధీర్విద్యా సత్యమక్రోధో దశకం ధర్మలక్షణామ్॥

అనగా స్త్రీలోగాని, పురుషునిలోగాని ధైర్యం, క్షమ, ఇంద్రియ నిగ్రహం, వాటిని సంయమనంలో ఉంచగలిగే శక్తి ఉండాలి. మోసం, కపటం, దొంగతనాల్ని విడిచిపెట్టాలి. మనసు, శరీరం పవిత్రంగా ఉండాలి. దుస్సాంగత్యం, మాదకద్రవ్యాల సేవనం త్యజించాలి. త్యాగం, విద్య, సత్యం, శాంతం, అహింసవంటి గుణాల్ని కలిగివుండాలి. ఇటువంటివారే సత్యమైన ధర్మపరులు, ధర్మానుయాయులు అనవచ్చు. ఇతరులు చూసి పొగడాలనో, అనాదిగా ఉన్న సంప్రదాయమనో ఆచరించేవారిని పైకోవలోకి చేర్చలేం" చెప్పింది నిర్మల.

ఇలా చర్చిస్తూ వాళ్ళు పాతనగరంలోని 'చార్‌మినార్'కి వెళ్ళారు. "క్రీ.శ. 1591లో కులీకుతుబ్‌షా అనే రాజు గోల్కొండని పాలించేవాడు. ప్రస్తుతం 'చార్‌మీనార్' ఉన్న ప్రాంతం ఆ రోజుల్లో ఒక చిన్న గ్రామం. చుట్టూతా నలువైపులా అడవి ఉండేది. సుల్తాను అప్పుడప్పుడూ ఇక్కడికి వేటకి వచ్చేవాడు. అలా ఓసారి వచ్చినప్పుడు భాగమతి అనే అందమైన నర్తకిని చూశాడు. ఆమెను చూసి పాదుషా ముగ్ధుడయ్యాడు. ఆ తరువాత ఆమె కోసమే అక్కడికి రాసాగాడు. తండ్రిని ఎదిరించి మరీ ఆమెను పరిణయమాడాడు. ఆమె పేరునే నగరానికి పెట్టి 'భాగ్యనగరం'గా మార్చాడు.

ఆ తరువాత నాలుగు స్థంభాలతో, నాలుగు అంతస్థులతో 'చార్‌మీనార్' సౌధ నిర్మాణం కావించి, దాని నలువైపులా దుకాణాలూ, ఇళ్లూ కట్టించాడని చరిత్ర చెబుతోంది" చెప్పింది తార.

అక్కడినుండి వాళ్లిద్దరూ 'కింగ్‌కోఠి'కి వెళ్ళారు. అక్కడున్న కొన్ని ఇళ్లను చూపిస్తూ నిజాంనవాబు సంతానం అక్కడే నివసిస్తున్నట్లు చెప్పింది తార.

"అదేమిటి? ఆయన అవివాహితుడని విన్నానే" అంది నిర్మల ఆశ్చర్యంగా.

"నిజాం అవివాహితుడు కాదు. ఒకవేళ అలా అయితే మాత్రం వ్యక్తిలో కోరికలుండవా? విషయవాసనలను బలవంతంగా అణచిపెడితే అనేక భారీగ్రంథులు ఏర్పడి అతని సాధారణ వికాసమార్గంలో అడ్డువస్తాయి..." అంది తార.

"అలాంటి మనిషి పెళ్ళి చేసుకోవాలి"

"అనేక పూవులపై వాలే తుమ్మెదలాంటిది పురుషుని స్వభావం. అనేకరకాల మధు వును ఏకత్రితం చేస్తే అది రుచికరంగా ఉంటుందనీ, ఒకే బీడులో మేసే ఆవు ఇచ్చే పాలకంటే అనేక బీడుల్లో పచ్చిక మేసిన ఆవుపాలు ఆరోగ్యకరమైనవనీ పురుషుల అభిప్రాయం"

"పలు పుష్పాల మధువుకంటే ఒక్క పుష్పంనుండి సంగ్రహించిన తేనె ఉత్తమమై నది. అనేక పచ్చిక బీళ్ళలో మేసిన ఆవు పాలు తాగితే అపాయాలూ వచ్చే అవకాశం ఉంది... పైగా మనుషుల విషయానికి వస్తే నైతిక బాధ్యతలూ, సమాజ సంప్రదా యాలు, ఆచారాలు ఎన్నో ఉన్నాయి. సంఘం కట్టుబాట్లను అతిక్రమించి జీవిం చడం కష్టతరం అవుతుంది" అంది నిర్మల.

రోజులు గడుస్తున్నాయి. ఓ రోజు తార వచ్చి, వచ్చే శనివారంనుండి హోటల్‌వాళ్లు ప్రస్తుతం ఇస్తున్న ఖర్చులు ఆపేస్తారనీ, ఇంటి అద్దె, ఇల్లు గడవడానికి అయ్యే ఖర్చులు నిర్మలే భరించాలనీ చెప్పింది.

"నాకు ఉద్యోగం ఇస్తామన్నారు. ఇంతవ రకూ పనులు అప్పగించలేదు. ఈ విషయం గుర్తుచేస్తాను" అంది నిర్మల.

"నీవు చేయాల్సిన పని శనివారంనుండి అప్పగిస్తున్నట్లు చెప్పమన్నారు. ఆ పని చేయడానికి గది దాటి వెళ్ళనవసరంలేదు"

"ఇంటి గడప దాటకుండా చేయవలసిన పనా? ఏం పని" అంది ఆశ్చర్యంగా నిర్మల.

తార నవ్వింది. ఆ నవ్వులో ఎన్నో అర్థాలు స్ఫురించాయి. "పెద్ద పనేమీ కాదులే! రోజుకి ఒకరిద్దరు అతిథులు వస్తుం టారు. వాళ్ళతో మాట్లాడాలి. వాళ్లు ప్రసన్న చిత్తులై వెళ్ళేలా చూడాలి. అంతే" అంది.

ఇది విని నిర్మల కొయ్యబారిపోయింది. కత్తివేటుకి నెత్తురు చుక్కలేనంతగా ముఖం పాలిపోయింది. మనసులో ఏ మూలో ఉన్న అనుమానం కాస్తా నిజమే అయింది. క్రోధంతో, భయంతో కంపించసాగిందామె. తను వీరి వలలో ఎంత అమాయకంగా చిక్కుకుందో బోధపడసాగింది. తన కోపాన్ని నిగ్రహించుకుంటూ, "నువ్వు నాకు తల్లితో, పెద్దక్కయ్యతో సమానం. నేను నీ కాళ్ళు పట్టుకుంటాను. ఈ మురికి కూపంలో నేను పడకుండా రక్షించు. నేను జీవితాంతం నీకు ఋణపడి ఉంటాను" అంది.

"వ్యాపారంలో దయాదాక్షిణ్యాలుం టాయా? ఇక్కడ తల్లీదండ్రీ, అక్కా, అన్నా, తమ్ముడు, చెల్లి బంధాలేవీ ఉండవు. ఇక్కడ డబ్బే సమస్తం. నన్ను అక్కా అన్నావు. ఈ సంబంధంతో నేను నీకోసలహా ఇస్తాను. నిన్ను ఏ పని చెయ్యమంటున్నారో దాన్ని సమర్థవంతంగా నిర్వహించు సుఖపడ తావు. నిన్ను హోటల్ వాళ్ళు నియమిం చింది నిన్ను విడుదల చెయ్యడానికి కాదు. నీవిక్కడినుండి పారిపోకుండా చూడటమే నా డ్యూటీ..."

నిర్మల నిశ్శబ్దాన్ని ఆశ్రయించింది. ఎరక్క పోయి షకీలతో స్నేహం చేశానని రోదించ సాగిందామె హృదయం. తను ఆచితూచి అడుగేస్తే ఈ విపత్తు ఎదురయ్యేది కాదు. ఇక తారను బతిమాలి లాభంలేదు. మర్నాడు మేనేజర్‌తో మాట్లాడాలనుకుంది నిర్మల.

రెండోరోజు హోటల్ మేనేజర్‌వద్దకి వెళ్ళి, "మీరంతా మోసకారులు. ఐదు నక్ష త్రాల హోటల్ ముసుగులో వేశ్యాగృహం నడుపుతున్నారు. పోలీసులకి రిపోర్టిస్తాను, నీ గుట్టురట్టుచేస్తాను" అంది ఆవేశంగా.

అతను అమాయక చక్రవర్తిలా ముఖకవ ళికల్ని దీనంగా మార్చి వ్యంగ్యంగా "నిర్మల గారూ కూర్చోండి! నా మాటలు కూడా వినండి. పోలీసుల ఋణం మేమేనాడూ

ఉంచుకోలేదు. వాళ్ళ మామూళ్ళు వాళ్ళకి సరిగ్గా అందినంతకాలం మమ్మల్నేమీ చెయ్యలేరని బాగా తెలుసు నాకు! ప్రస్తుతం తమరు నా కార్యాలయంలోనే ఉన్నారు. ఓ కాల్‌గర్ల్‌గా అవకాశం ఇప్పించమని నా హోటల్‌కి వచ్చి నన్ను అల్లరిచేస్తున్నావని నేనే నీపై అభియోగం మోపుతాను. ఈ హోటల్ సిబ్బంది నా వైపే సాక్ష్యం చెబుతారు. ఫలితంగా జైలుపాలవుతావు. అక్కడ జైల్లోని స్టాఫ్ కామానికి ఆహారమై పోతావు జాగ్రత్త!" అన్నాడు మళ్ళీ ఏకవచనంలోకి దిగుతూ బెదిరిస్తూ.

చట్టం దృష్టిలో తన బలహీనత అవగతమై ఏంచేయాలో తోచని అయోమయ పరిస్థితిలో పడింది నిర్మల. ఆమె మౌనంగా ఉన్నప్పుడే మరికాస్త చెప్పదలచుకున్న మేనేజర్, "ప్రకృతి మీకు సౌందర్యాన్నిచ్చింది. మెదడుతోనో శారీరక బలంతోనో కష్టపడి తిండి సంపాదించుకున్నట్లే సౌందర్యం ఉపయోగించి తిండి సంపాదించుకోవడంలో పాపమేముంది. దాహార్తులకు నీరిస్తే పుణ్యమంటారు. కామార్తులకు సంతృప్తి కలిగించటం కూడా పుణ్యకార్యమేనంటాన్నేను. కాస్త ఆలోచించి మీ అందమైన భవిష్యత్తుకు బాట వేసుకోండి" అన్నాడు.

నిర్మల ఎన్ని రకాలుగా తర్కించినా అన్నిటికీ మేనేజర్ సమాధానాలు చెబుతూనే ఉన్నాడు. ఇక వాదిస్తే లాభంలేదని తనను ఓ సోదరిలా భావించి ఈ పాప కూపం నుండి విముక్తి కలిగించమని వేడుకుంది. వసుదేవుడు గాడిద కాళ్ళు పట్టుకున్న పురాణ కథ జ్ఞాపకం వచ్చిందామెకు లోలోపల. అయినా చేసేదేం లేదు. ఇక్కడి నుండి బయటపడటం ముఖ్యం.

"మేమిక్కడ నాలుగు రాళ్ళు సంపాదించుకునేందుకు ప్రయత్నిస్తున్నాం. పోగొట్టుకోడానికి కాదు. నీపైన బోల్డంత ఖర్చుచేశాం. అది రాబట్టుకోవద్దా? మాతో సహకరించకుంటే వేశ్యాగృహానికి అమ్మేస్తాం. అక్కడ నీకు మరింత నీచమైన, క్రూరమైన జీవితమే ఎదురవుతుంది. నీ ఇష్టం. ఇక వెళ్ళొచ్చు" అన్నాడు కటువుగా.

తార వెంటరాగా తన వసతికి వెళ్ళింది నిర్మల.

★ ★ ★

నిర్మలకోసం ఢిల్లీకి వచ్చిన సీమ సత్రంలోని గుమాస్తా అందించిన ఉత్తరం చదువుకుని నిస్తబ్దంగా ఉండిపోయింది. తన ప్రాణస్నేహితురాల్ని దూరం చేసుకున్నందుకు విలవిలలాడిందామె మనసు. ఇక జీవితంలో ఆమె కన్పిస్తుందో లేదో కూడా తెలియదు. నిర్మల తనెక్కడికి వెళ్తుందో ఆ చిరునామా రాయనేలేదు. తను ఆలస్యంగా వచ్చిన మాట నిజమే! కాని మరికొన్ని రోజులు ఎదురు చూడాల్సింది. ప్చ్! చాలాసేపు ఆలోచించి ఉత్తరం రాయడం ప్రారంభించింది.

"ప్రియమైన నిర్మలా!

విధి మనతో ఆటలాడుకుంటోంది. నేను మాటప్రకారం రాలేకపోయాను. ఎందుకు ఆలస్యమైందో మనం కలుసుకున్న తరువాత చెబుతాను. నా తప్పుకి క్షమాపణ వేడుకుంటాను. హైద్రాబాద్‌లో నువ్వు నిశ్చింతగా సుఖంగా ఉండాలని భగవంతుని ప్రార్థిస్తాను. నా చిరునామా రాస్తున్నాను. నీవు ఇక్కడికి వచ్చినప్పుడు నా దగ్గరికి రావడానికి వీలవుతుంది.

శుభాకాంక్షలతో
నీ సీమ

కార్యనిర్వాహకురాలు
కల్యాణకేంద్రం
నయీకాలనీ
రోడ్ నెంబరు-9
లక్నో."

ఆ ఉత్తరాన్ని అంటించి సత్రంలోని గుమాస్తాకి అందించింది సీమ. అదే రోజు

లక్నోకి ప్రయాణమైంది. లక్నోకి చేరాక రాధకి నిర్మల రాసిన ఉత్తరం చూపించింది సీమ. "ఇకనేం! ఐదు నక్షత్రాల హోటల్లో ఉద్యోగం అంటే మాటలా? మీ నిష్కల్మషత్వం, సత్యమైన స్నేహం మిమ్మల్ని ఏనాటికైనా కలుపుతుందిలే" అంది రాధ.

సీమ కల్యాణకేంద్ర సంచాలక విధులన్నీ సమర్థవంతంగా నిర్వహించటం ప్రారంభించింది. తన పనులకు సంబంధించి ఒక పూటంతా ఫీల్డ్‌లో తిరిగేది. మిగతా సగం పూట కేంద్రంలోని పనుల్ని చూసుకునేది. భిక్షగాళ్ళని వెతికి కేంద్రానికి చేర్చాలంటే ఫీల్డ్ వర్క్‌కోసం తిరగక తప్పదు ఆమెకి!

ఒకరోజు ఉదయం సీమ ఫీల్డ్‌వర్క్‌కోసం బయల్దేరింది. వాతావరణం చలిగా ఉంది. గాలి విస్తృతంగా వీస్తోంది. పదిహేనేళ్ళ కుర్రాడు దార్లో నిల్చుని వార్తాపత్రికలు అమ్ముతున్నాడు. కల్యాణకేంద్రానికి అన్ని రకాల పేపర్లు వస్తాయి. కనుక సీమ అటు వైపు చూడలేదు.

ఆ కుర్రాడు ఆమె వెంటే నడుస్తూ, "అమ్మగారూ! అమ్మగారూ! ఒక్క పేపరైనా తీసుకోండి! హిందీ, ఉర్దూ, ఇంగ్లీష్ అన్ని న్యూస్ పేపర్లూ ఉన్నాయి. ఏదో ఒకటి తీసుకోండి. నిన్నటినుండీ ఆకలితో ఉన్నాను" అన్నాడు.

సీమ ఆ కుర్రాడివైపు పరిశీలనగా చూసింది. చిరిగిన దుస్తులు తొడుక్కున్న అతని కాళ్ళకి చెప్పులు కూడా లేవు. ఎండలకి ఎండి, చలికి వణికిన అతని శరీరం క్షీణించి, నలుపురంగులోకి మారింది. సీమ జాలిగా చూసి, రెండు పత్రికలు తీసుకుని డబ్బిచ్చింది. కుర్రాడు కృతజ్ఞతగా ఆమె పాదాలను తాకి మళ్ళీ తన స్థానంలోకి వెళ్ళి, "నేటి తాజావార్తలకోసం... దినపత్రిక కొనండి. సమాజసేవకోసం ప్రభుత్వ నిర్ణయాలు..." అంటూ అరవసాగాడు.

కొన్నాళ్ళతరువాత అదే కుర్రాడు రోడ్డుపై బిక్షమెత్తుకుంటూ కనిపించాడు. దగ్గరికి వెళ్ళి, " ఆరోజు పత్రికలమ్మావు, ఆ పని వదిలేసి బిక్షమెత్తుకుంటున్నావెందుకు? " అంది.

కుర్రాడు మౌనం వహించాడు. సీమ పదే పదే రెట్టించటంతో, "మేం ఎనిమిదిమంది అన్నదమ్ములం. మా తండ్రి రిక్షానడుపుతాడు. సంసారం గడవటం కష్టమై నన్ను అమ్మేశాడు. నన్ను కొనుక్కున్న వ్యక్తి ఓ గూండా దగ్గర దళారిగా ఉన్నాడు. కొన్నాళ్ళయ్యాక నన్ను ఆ గూండాకే అమ్మేశాడు ఈ దళారి. ఆ గూండా తను కొన్న పిల్లలతో బిక్షమెత్తిస్తాడు, పత్రికలమ్మిస్తాడు. చాలా పనులు చేయిస్తాడు. అంతేకాదు పిల్లల్ని అంగవిహీనుల్ని చేసి పారిపోకుండా చేస్తాడు. అతని నిర్దయకు సాక్ష్యంగా కాలు విరిగిన నన్నే చూడండి" అన్నాడు.

మరోరోజు ఏడెనిమిదేళ్ళ వయసు కుర్రాడు కనిపించి "అమ్మగారూ! నిన్నటినుండీ ఆకలితో ఉన్నాను. ఏమైనా ఇప్పించండి" అంటూ సీమ దగ్గరికి వచ్చాడు. సీమ ఆ కుర్రాడికి ఏమీ ఇవ్వకుండా నడవసాగింది. ఆమె వెనుకే కుర్రాడూ నడవసాగాడు. పక్కసందులోకి వెళ్ళాక తన పర్సు తెరిచింది సీమ. అందులోని టాఫీలు తీసి అతని గుప్పిట్లో పెట్టింది. కుర్రాడు అవి చూసి సంతోషించినా, "అమ్మగారూ! డబ్బులు కూడా ఇవ్వండి. లేకుంటే సాయంత్రం అతను నన్ను కొడతాడు" అన్నాడు.

ఆ కొట్టేది ఎవరో? తెలుసుకోవాలనుకుంది సీమ. ఆమె ఆ కుర్రాడికి మరికొన్ని టాఫీలిచ్చి కథలు చెబుతూ తన కేంద్రానికి తీసుకువచ్చింది. ముందుగా అతనికి మంచి భోజనం పెట్టించింది. శుభ్రమైన దుస్తులిచ్చి తొడుక్కోమంది.

ఓ పిల్లవాడిని సంతోషపెట్టడం ఎంత సేపు?

"అమ్మగారూ! నన్నిక్కడే ఉండనిస్తారా? మా అమ్మని పిల్చుకురానా? అక్కడ వాడు

మా అమ్మనీ, నన్నూ కొడతాడు" అన్నాడు కుర్రాడు.

"మీ అమ్మ ఎక్కడుంటుంది? " అనడిగింది సీమ.

తన తల్లిపేరు కనీజ్ అనీ, బడే ఇమాంబాడే పరిసరాల్లో బిచ్చమెత్తుకోవడానికి నిల్చుంటుందనీ చెప్పాడు వాడు. కాస్సేపటికి తూగటం ప్రారంభించటంతో నిద్రపొమ్మంది సీమ.

వాడు పడుకోగానే, సీమ 'బడే ఇమాంబాడే'కు బయల్దేరింది. అక్కడికి చేరగానే ఎండలో నేలపై కూర్చున్న ఓ స్త్రీ కనిపించింది. వచ్చీపోయే వాళ్ళను బిచ్చమడుగుతోంది. సీమ ఆమె దగ్గరికి వెళ్ళి కొన్ని డబ్బులు, రెండు రొట్టెలు ఇచ్చింది. సంతోషించిన కుర్రాడి తల్లి "భగవంతుడు నిన్ను చల్లగా చూడనీ, ఈ నేలపై ఇంకా మంచి వాళ్ళూ ఉన్నారు" అంది.

"కనీజ్! నీ ప్రసూతికి ఇంకా ఎక్కువరోజులు పట్టేలా లేదని నీ పొట్టచూస్తే అన్పిస్తోంది. నేను కళ్యాణ కేంద్రంలో ఉంటాను. నాతో అక్కడికి పద..." అంది.

తన పేరు ఈమెకిఎలా తెలిసిందా అని ఆశ్చర్యంగా చూడసాగింది కనీజ్. కాస్సేపటికి తేరుకుని, "అమ్మగారూ! నా ముగ్గురు పిల్లలూ రోడ్డుపైనే పుట్టారు. వారిలో ఒక్కడే మిగిలాడు. మిగతా ఇద్దరూ ఉన్నా భిక్షగాళ్ళే అయ్యేవారనుకోండి. అందుకే వాళ్ళు పోయినందుకు నాకేమీ బాధలేదు. ప్రసూతివేళకి భగవంతుడు ఎవరో ఓ బిచ్చగత్తెను నా దగ్గరికి పంపుతుంటాడు..." అంది.

"ఔను! ఈసారి భగవంతుడు నీ ప్రసూతికోసం నన్ను పంపించాడు. ప్రసవమయ్యాక కూడా నువ్వు అక్కడే ఉండవచ్చు అక్కడ నిన్ను కొట్టేవారుండరు. నీ కొడుకు అక్కడే దొరుకుతాడు. అతనే నీ గురించి చెప్పాడు" అంది సీమ.

ప్రతి తల్లీ కొడుకు వెంట పరుగెత్తాల్సిందే. పైగా సీమ ఆమెకు మూడు ప్రలోభాల్ని చూపింది. ప్రసవవేళలో సాయమందించటం, దెబ్బలు తిట్లనుండి విముక్తి కలిగించటం, కొడుకును చూపిస్తాననటం. కనీజ్ లేచి సీమతో కల్యాణకేంద్రానికి వచ్చింది.

కేంద్రానికి రాగానే ముందుగా కనీజ్‌ని స్నానానికి పంపింది సీమ. మంచి దుస్తులిచ్చింది. తరువాత భోజనం వడ్డించింది. ఇప్పుడు కనీజ్‌ని చూసిన వాళ్ళెవరూ ఆమె బిచ్చగత్తె అంటే నమ్మరు.

అంతలో మంచి బట్టలు వేసుకున్న కొడుకు కనిపించటంతో కనీజ్ ఎంతగానో సంతోషించింది. తల్లీకొడుకులిద్దరూ కేంద్రంలోని ఇతర సహచరులతో కలిసి నిద్రకు ఉపక్రమించారు.

అర్ధరాత్రి దాటి ఉంటుంది. అప్పుడే సీమ నిద్రలోకి జారుకుంటోంది. బయట ఏదో గందరగోళం జరుగుతున్న శబ్దం విన్పించటంతో సీమ బయటికి వచ్చింది. కనీజ్, ఆమె కొడుకుతోసహా పారిపోవడానికి ప్రయత్నిస్తుంటే వాచ్‌మన్ చూసి పట్టుకుని తిడుతున్నాడు. ఆ అల్లరికే సీమకు నిద్రాభంగమైంది. సీమ వాళ్ళ దగ్గరికి వెళ్ళి ఇద్దరినీ తన కార్యాలయంలోకి తీసుకువచ్చింది. పారిపోవడానికి కారణమేమిటని ప్రశ్నించగా, "అమ్మగారూ! నా తప్పేమీ లేదు. మా అమ్మే పారిపోదాం అంది..." అన్నాడు కుర్రాడు.

కనీజ్ ఇక తప్పదన్నట్లు, "కేంద్రంలో ఉండేవాళ్లని కొడతారనీ, తిండిపెట్టరనీ విన్నాను. అందుకే నేను వెళ్ళిపోదామనుకున్నాను. భిక్షమెత్తుకుని ఇప్పుడు బతుకుతున్నట్లే ఎలాగో గడుపుతాం. కొన్నాళ్ల తర్వాత ఇక్కడినుంచి నేను వెడితే రోజూ నేను బిచ్చమెత్తుకునే స్థలాన్ని ఎవరైనా ఆక్రమిస్తారు. రోజూ నేను కూర్చునే చోట ఉన్న చాపచింపును ఎవరైనా తీసుకు

వెళ్తారు. అదీగాక మా నాయకుడు చావబాదుతాడు. ఇవన్నీ గుర్తొచ్చి పారిపోవటమే నయమన్పించింది" అంది కనీజ్.

"నువ్వు విన్నది ఒకప్పటిమాట! అందులో కూడా పూర్తి నిజంలేదు. నీవు జీవితాంతం ఇక్కడే ఉండవచ్చు నువ్వు చేయడానికి పని నేర్పిస్తాం. దానిపై వచ్చే ఆదాయం నీదే! నువ్వూ, నీ పిల్లలు సుఖంగా జీవించవచ్చు..." అంది సీమ.

సీమ మళ్ళీ మళ్ళీ నచ్చచెప్పటంతో కనీజ్ కి నమ్మకం కుదిరింది. వాళ్ళ నాయకుడెవరో చెప్పమని అడగగానే నిస్సంకోచంగా చెప్పేసింది. "లక్నోలో బిచ్చగాళ్ళ సంస్థ ఉంది. ఇందులో 200 మందిదాకా సభ్యులున్నారు. వీరిలో హిందువులు, ముస్లింలు, క్రైస్తవులు ఇంకా ఇతర మతస్తులూ ఉన్నారు. ఈ సంస్థని 'బైరాగి సమాజం' అంటారు. ఈ సమాజసభ్యులంతా సంవత్సరానికొకసారి నగరానికి దూరంగా కలుసుకుంటారు. అక్కడ తన నాయకుడిని ఎన్నుకుంటారు. అతనితో నమ్మకంగా వ్యవహరిస్తామని ప్రతిజ్ఞ చేస్తారు. సభ్యుడుకాని బిచ్చగాడిని నగరంలో ఉండనీయడు నాయకుడు. ఎవరు ఏ స్థలంలో బిచ్చమెత్తుకోవాలో అతనే నిర్ణయిస్తాడు. నాయకుడు మాకు రక్షణ కల్పిస్తాడు. అందుకు ప్రత్యుపకారంగా మేం మా ఆదాయంనుండి కొంత భాగం అతనికి ఇవ్వాలి. ఏ బిచ్చగాడైనా నాయకునికి డబ్బివ్వకుంటే నాయకుడు బిచ్చగాడిని దండిస్తాడు"

"మీ నాయకుని పేరేమిటి? మీ సభ్యుల సంఖ్య హెచ్చటం-తగ్గటం జరుగుతుందా?"

"కొందరు లక్నో పాతబడగానే ఇతర గ్రామాలకి వెళ్తారు. వేరేచోట్లనుండి ఇక్కడికి మరికొందరు వస్తారు. కానీ చాలా తక్కువ. 'బైరాగి సమాజ' సదస్యుల సంఖ్యలో పెద్ద తేడాలేమీ రావు"

"ఇప్పుడు పోలీసులు, సామాజిక కార్యకర్తలు చాలా చురుగ్గా పనిచేస్తున్నారు. బయటినుండి భిక్షగాళ్ళని లక్నోకి రానీయరు. కొత్తవాళ్ళెలా వస్తుంటారు?"

"కొత్త సభ్యుల్ని సమాజంలో చేర్చటం కూడా నాయకుడి బాధ్యతే!"

"అతను కొత్త సభ్యుల్ని ఎక్కడినుండి తీసుకువస్తాడు?"

"చిన్న పిల్లల్ని అపహరిస్తారు. రోడ్లపై కూర్చునే జ్యోతిష్యులు కూడా "బైరాగి సమాజ" సభ్యులే. వాళ్లు మాకంటే కొంచెం ఉన్నతశ్రేణి సభ్యులనుకోవచ్చు చిన్నపిల్లల్ని నాయకుడి సముఖానికి తెచ్చినప్పుడు ఆయన వారి ఏ అవయవాన్ని తొలగించాలో చెబుతాడు. గుడ్డివాళ్లుగా, కుంటివాళ్లుగా చేస్తేనే వారికి భిక్ష బాగా దొరుకుతుంది మరి!"

అమాయకులైన పిల్లలకు జరిగే అన్యాయం విని సీమ ఎంతగానో బాధపడింది. ఆ నాయకుని పేరేమిటని ప్రశ్నించింది.

"అతని పేరు రాజు..." అంటూ అతనెక్కడ ఉండేదీ వివరంగా చెప్పింది కనీజ్.

అవసరమనుకున్న మరిన్ని వివరాలడిగి తల్లీకొడుకులను పడుకోవడానికి పంపేసి తనూ తన గదిలోకి నడిచింది సీమ. మర్నాడు ఉదయమే దుర్లభ్ సింహ కార్యాలయానికి వెళ్ళి కనీజ్ వృత్తాంతమంతా చెప్పింది.

★ ★ ★

రెండు రోజుల తరువాత రాజు దొరికాడు. నేరం చేస్తూనే పట్టుపడ్డాడు. అపహరించుకుని తెచ్చిన ఓ బాలిక శరీరంలో కుష్ఠురోగాన్ని ప్రవేశపెట్టాలని, ఓ కుష్ఠురోగి సొన అంటిన పట్టీలు తెప్పించి ఆ అమ్మాయికి చుట్టించసాగాడు. కాళ్ళకు కుష్టురోగ స్రావాన్ని మాలిష్ చేయించడానికి ఏర్పాట్లు చేస్తున్నాడు.

రాజును బంధించి పోలీస్‌స్టేషన్‌కి

తెచ్చారు పోలీసులు. ముగ్గురు ఉన్నతాధికారులు రాజును ఎన్ని రకాలుగా ప్రశ్నించినా 'బైరాగి సమాజ' రహస్యాల్ని మాత్రం రాబట్టుకోలేకపోయారు. విసిగిన ఆ అధికారులు చిత్రహింసల పాలుచేసి అయినాసరే అతని చేత నిజాన్ని కక్కించమని కానిస్టేబుళ్లకు ఆదేశించారు. చిత్రహింసలు మొదలవగానే రాజు నిజం చెప్పక తప్పలేదు. తను గత ఐదేళ్లుగా ఈ 'బైరాగి సమాజం' నడుపుతున్నానని చెప్పాడు. తన సంఘంలోని మరి కొందరి వివరాలు చెబుతూ, వీళ్లు విదేశ ప్రభుత్వాలనుండి జీతభత్యాలు పొందుతూ వారికి మన సమాచారాలు అందిస్తూ ఉంటారనీ, ఈ గూఢచారులు ఎప్పటికప్పుడు విదేశాలకి వార్తలందిస్తుంటారనీ అన్నాడు. ఈ సంఘంలోని మహిళలు నకిలీ గర్భాలతో నటించి ప్రజల సానుభూతితో డబ్బులు సంపాదిస్తుంటారనీ... అనేక విశేషాలు తెలియచేశాడు రాజు.

పోలీసులు రాజుని మర్నాడు కోర్టులో ప్రవేశపెట్టారు. స్థానిక వార్తాపత్రికల్లో ఈ వార్తలు ప్రచురింపబడేసరికి ప్రజలకు ఇదొక చర్చనీయాంశమైంది. 'బైరాగి సమాజం'లోని సభ్యుల ధైర్యం సడలిపోసాగింది. కొందరు లక్నోనుండి పారిపోగా మరికొందరు కల్యాణకేంద్రంలో చేరారు. కొందరు బయటే ఉండిపోగా పోలీసులు పట్టితెచ్చి చేర్చారు. వీళ్ళందరికీ వివిధ చేతివృత్తులు నేర్పించసాగారు. గతంలో అలా శిక్షణ పొందినవారు త్వరలోనే తమ నైపుణ్యాన్ని ప్రదర్శిస్తూ అందమైన బొమ్మలని, శిల్పాల్ని తయారుచేయసాగారు. 'కల్యాణ కేంద్రం'లో తయారైన వస్తువులకి ప్రజల్లో గిరాకీ పెరిగేలా చేశారు.

సన్యాసులు, సాధువులు, పకీర్ల రూపంలో తిరిగి తిరిపెమెత్తుకునేవారికి దానం చేస్తే పుణ్యం అని జనం విశ్వసిస్తారు. ఈ విషయంలో సీమ, దుర్లభ్‌సింహలు కొందరు ప్రజానాయకులతో ప్రత్యేక చర్చలు జరిపి ఒక సమావేశం ఏర్పాటు చేశారు. ఈ సమావేశానికి నగరంలోని ధనవంతులు, మందిరాల మఠాధీశులు, మసీదుల ఇమాములు, గురుద్వారాల జత్థేదారులు, చర్చిల ఫాదర్లు ఇతర సంస్థానాల ధర్మాధ్యక్షులు హాజరయ్యారు. ఆ సమావేశంలో చర్చించబోతున్న అంశాల్ని, వాటి ప్రయోజనాల్ని ముందుగా పరిచయం చేశాడు దుర్లభ్‌సింహ. రాజును బంధించటంతో ప్రారంభించి అతను వెల్లడించిన విశేషాల్ని తన ప్రసంగంలో వివరించింది సీమ. సాధువుల వేషాల్లో దేశద్రోహులు తిరుగుతున్నారని విని అంతా చకితులయ్యారు. ఇమాములు, ఫాదర్లు, కార్యనిర్వాహకులు, ఇతర సభ్యులు అందరూ తమతమ అభిప్రాయాల్ని వెల్లడించారు. వాదవివాదాల తదనంతరం కొన్ని ప్రత్యేక నిర్ణయాలు తీసుకున్నారు. 'వక్ఫ్ బోర్డ్' స్థాపించాలన్నది అందులోని ఒక నిర్ణయం. శ్రీమంతులు తమ ఆదాయంలోని కొంత భాగాన్ని సాధువులుగా తిరిగే వేషధారులకు ఇవ్వకుండా 'వక్ఫ్‌బోర్డు'కు పంపాలి. ఇలా అందిన విరాళాల్ని కమిటీ సభ్యులు అవసరమైన వ్యక్తులకు, సంస్థలకు అందించి సహాయపడతారు. ఆలయాల అధ్యక్షులు, కార్యనిర్వాహకులు, ధనవంతుల ప్రతినిధులు, సామాజిక కార్యకర్తలు బోర్డుకూ, కమిటీకీ సదస్యులుగా వ్యవహరిస్తారు. రాత్రి 8 గం. తరువాత వీధుల్లో ఏ సాధువూ, ఫకీరూ తిరగకుండా పోలీసుల సాయంతో నిర్ధారించుకుంటానని దుర్లభ్ సింహ ప్రకటించాడు. అలాంటివారు ఎనిమిది తర్వాత కల్యాణకేంద్రంకైనా రావాలి. లేదా ఏదైనా ధర్మ సంస్థానానికి వెళ్ళాలి. ఆయా సంస్థానాల నిర్వాహకులు క్షీరనీర న్యాయంగా దొంగ సాధువుల్ని ఏరివేయటంలో సామర్థ్యం చూపి సాయపడాలి. అసలు సాధువెవరు? నకిలీ దొంగసాధువు ఎవరు అనేది పసిగట్టి మోసగాళ్లని బంధిం

చాలి.

ఈ ఆలోచనని సక్రమంగా ఆచరించటం వలన కొద్దిరోజులలోనే నకిలీ సాధువులు పట్టుబడసాగారు. సాధువుల వేషాల్లో తిరిగే గూఢచారులు లక్నో వదిలి పారిపోయారు. ఫకీరుల వేషాలు వేసుకుని జనం కళ్ళలో ధూళి చల్లే బిచ్చగాళ్ల బండారం బయటపడగానే కల్యాణ కేంద్రంలో ప్రవేశాన్ని పొంది ఉత్పాదకరవృత్తులు నేర్చుకోవడం ప్రారంభించారు. ఇలా ఈ సమస్య క్రమంగా సద్దుమణిగింది.

సీమ చాకచక్యంవల్లనే ఈ పరిణామం సాధించటం జరిగిందని ఆమెను అభినందించి, అభిమానించసాగారు ప్రజలూ, ప్రభుత్వోద్యోగులూ! సమాజ కల్యాణకేంద్రం ముందునుండీ ఉన్నా దీనిని అభివృద్ధి పరిచి, అద్భుత ఫలితాల్ని సాధించిన ఘనత సీమదేననీ ఆమె పథకాలు, ప్రయత్నాలు, నిష్టలవల్లనే నగరంలోని యాచకుల సమస్య నిర్మూలించబడిందనీ అందరూ చెప్పుకోసాగారు.

సీమ ఆనందానికి అవధులు లేవు. తన విధి నిర్వహణలో అద్వితీయ సఫలత పొందినందుకుగాను ప్రభుత్వం ఆమెకు సన్మానం చేసింది. అన్ని భారతీయ పత్రికలలో వార్త మొదటిపేజీలో ప్రచురించారు. పాకిస్తాన్ తదితర అన్యదేశాల పత్రికలు కూడా ఈ వార్తకి విశేష ప్రాధాన్యమిచ్చి పొగుడుతూ రాశాయి. యాచకుల సమస్య ఉన్న దేశాలవారు సీమ ప్రణాళికల్ని సేకరించసాగారు. ఈ సంతోష సమయాన తనతో కలిసి ఆనందం పంచుకొనడానికి నిర్మల లేని లోటును మరింత అనుభవించసాగింది సీమ.

★ ★ ★

నిర్మల ప్రయత్నాలేవీ ఫలించలేదు. అదృష్ట రేఖా ఆమెకు సహకరించలేదు. హోటల్ మేనేజర్ డాక్టర్ని పిలిపించి ఆమెకేవ్యాధీ లేదని నిర్ధారణ చేసుకున్నాడు. నేటినుండి తన గతాన్ని మరిచిపోయినట్లే పేరుసూ మర్చిపోవాలని 'సంగీత'గా పేరు మార్చుకుంది నిర్మల.

'సంగీత'ను అద్భుతంగా అలంకరించడానికి కావాల్సిన సౌందర్య సామగ్రి తెచ్చుకుంది తార. 'సంగీత' గది వాతావరణం ఆహ్లాదభరితంగా మార్చడానికి అత్తరు, పన్నీరు తేవటం మర్చిపోలేదు ఆమె. గదిలో ఓ మూల రంగురంగుల పక్షుల్ని తెచ్చిపెట్టింది. పక్షుల సుందర కలరవం కాముకత్వాన్ని ఉత్తేజితం చేస్తుందంటారు. ఒకవైపు వాద్యబృందాన్ని, మధురగానాన్ని, నృత్యాన్ని ఏర్పాటుచేసి ఉంచింది. ఒక మూలన బ్రాందీ, విస్కీ వంటి మద్యాల్ని సిద్ధంచేసి పెట్టింది. రసికుల్ని ఉత్తేజితం చేసే ఉపాయాల్ని, తన అనుభవాల్ని సంగీతకు నిస్సంకోచంగా చెప్పింది. ఒకసారి ఆమె దగ్గరికి వచ్చిన విటుడు మళ్ళీ మళ్ళీ వచ్చేలా మోహింపచేయాలని చెప్పింది. ఇదంతా సంగీత మౌనంగా వింటోంది. గదిలో జరుగుతున్న మార్పుల్ని గమనిస్తోంది.

ఈరోజే తొలి రసికుడు రాబోతున్నాడని రెండురోజులక్రితమే హోటల్ మేనేజ్‌మెంట్ తారకి తెలపటంతో సంగీత అరచేతులకూ, కాళ్ళకు గోరింటాకును అందమైన డిజైన్లతో అలంకరించింది తార. ఆమె స్వరం మధురంగా వినిపించాలని కలకండ, తేనెతో తయారుచేసిన మాత్రలు, గురిగింజ వేరు, సబ్జాగింజలు నోట్లో ఉంచుకొమ్మని ఇచ్చింది కూడా!

నమాజువేళ దాటాక తొలి పరిచయస్తుని మేడపైకి తీసుకువచ్చి 'సంగీత' గదిలోకి పంపించింది తార. సిల్కుకుర్తా, ఖరీదైన లుంగీ ధరించి వచ్చిన ఆ రసికుని పొడవైన గడ్డం చూసి ఇతనో అరబ్బీవిద్వాంసుడని గుర్తించింది సంగీత. ఆమె మద్యం సీసాల

వద్దకి అతన్ని తీసుకువచ్చి కూర్చోమంది. మద్యం వంపబోగా.

"నేను తాగుడుకి బహుదూరం. మద్యం, జూదం రెండూ హానికారకాలని కురాన్‌లో రాసి ఉంది" అన్నాడాయన.

"ఇది విదేశీమద్యం. ఇలాంటి సరుకు స్వర్గంలో తప్ప దొరకదు. ఒక్కసారి రుచి చూడండి" అంది సంగీత. కాముకుడైన ఆ మౌలానా ఓ సౌందర్యవతి మాటనెలా త్రోసిపుచ్చగలడు? అతని బుద్ధి, మనసు పూర్తిగా సంగీతపైనే కేంద్రీకృతమై ఉన్నాయి. ఇక ఆలోచించేశక్తి లేదు. సంగీత చేతిలోని మధుపాత్ర అందుకుని నీళ్ళూ, సోడా ఏమీ కలపకుండా గటగటా తాగేశాడు. గ్లాసు ఖాళీ అవగానే సంగీత దాన్ని మళ్ళీ నింపింది. ఈసారీ అలాగే తాగాడు. అతని తల గిర్రున తిరగటం మొదలైంది. కళ్ళు మూతలు పడుతుంటే ఇంటికెలా చేరగలననే చింత మొదలైంది. వెంటనే జేబులోని డబ్బు మొత్తం తీసి సంగీత చేతిలో పెట్టి ఇంటిముఖం పట్టాడు. తొలి విటుడినుండి తేలిగ్గా తప్పించుకున్నం



దుకు ఆనందించింది సంగీత.

రెండవరోజు సంగీతకు పన్నీటి స్నానం చేయించింది తార. మరింత గొప్పగా అలంకరించింది. ఈరోజు ఒక పండితుడు వచ్చాడు. తను చేస్తున్నది అధర్మమైన కర్మ యేమీకాదని సంగీత అనుకోవాలని, మనసు మార్చుకోవాలని కాబోలు పూజార్లనీ, పండితులనీ, ముల్లాలని మొదట్లో ఏర్పాటుచేశాడు మేనేజరు. జరీ అంచుధోతి ధరించిన ఆ పండితుడి ఎదుట మద్యం, మాంసం ఉంచింది సంగీత. "నేను సద్బ్రాహ్మణ్ణి. మాంసం తినటం కాదుగదా నేను దాన్ని చూడనైనా చూడలేదేనాడూ! బీరు ఉంటే ఇవ్వు తాగుతాను" అన్నాడు.

'అతిథి' ఎదుట బీరు, స్నాక్స్ పెట్టింది సంగీత. సంగీతను తన పక్కనే కూర్చోమని బీరు తాగుతూ, ఆమెతో శృంగారచేష్టలు ప్రారంభించాడతను. నిన్నటి మౌలానా మాదిరిగా ఇతను తన పాచిక పారనిచ్చేలా లేడని గ్రహించింది సంగీత. బెంగుళూరు సిల్కుచీర ఆమెకిచ్చి సంతోషపెట్టాలనుకున్నాడు. అతనితో సహకరించక నిర్లిప్తంగా ఉన్న సంగీత వైఖరి చూసి మరెప్పుడైనా రావచ్చులెమ్మని కొంత డబ్బిచ్చి ఇంటిదోవ పట్టాడు బ్రాహ్మణ పండితుడు.

ఆగంతకులకు స్వాగతం పలకటం సంగీత దినచర్యలోని భాగమైంది. అన్ని వర్గాలవారూ వస్తున్నారు. మౌలానా, పండితులనుండి తప్పించుకున్నట్లు అందరితో తప్పించుకోలేకపోయింది సంగీత. తన జీవితం ఈ బురదలో కూరుకుపోవడానికి తన తొందరపాటేనని పశ్చాత్తాపపడేది. సీమకోసం మరికొన్ని రోజులు వేచిచూస్తే ఎలా ఉండేదో? ఇక్కడికి రాకుండా తప్పించుకునేది. ఇప్పుడు ఇక తను సీమకి ఉత్తరం రాయడం కాదుగదా ముఖం కూడా చూపించలేని స్థితిలో ఉంది మరి! తనపట్ల తనకే అసహ్యం పెరిగి మరణమే శరణ్యం అనుకుంది సంగీత. అన్యాయంగా ఆర్జిస్తున్న డబ్బు పాము, తేలువంటి విషప్పురుగుల్లా భయపెడుతోంది. వాటిని ఖర్చుచేసేయాలి. మద్యం తాగటం, సిగరెట్ పీల్చటం అలవాటు చేసుకుంటేనో... ఛఛ! ఇక్కడి నుండి ఎలా బయటపడటం? ఏమీ చెయ్యలేని నిస్సహాయస్థితిలో కొట్టుమిట్టాడుతూ ఆలోచనలో ఉన్న సంగీత ఏకాంతాన్ని భంగంచేస్తూ ఆ గదిలోకి వచ్చింది తార. చీకటిపడ్డాక ఇరవైరెండేళ్ళ రాజకుమారుని ఇంటికి వెళ్ళాల్సి ఉందనీ, అతను ఈ హోటల్‌కి మొదటిసారిగా వచ్చాడనీ, అతనే బండి పంపిస్తాడనీ, మళ్ళీ ఇంట్లో దిగబెడతారనీ చెప్పింది. చూడక ముందే ఎందుకో అతనిపట్ల సదభిప్రాయమేర్పడింది సంగీతకు. లేచి అద్దంలో ముఖం చూసుకుంది. తనూ, సీమ ఢిల్లీకి వచ్చాక ఒకేసారి జీవితం ప్రారంభించారు. సీమ మంచి దారుల్లో నడిస్తే తనీ రసాతలంలో పడిపోయింది. నేటి వార్తాపత్రికలో 'సీమ' గురించి ఎంత గొప్పగా రాశారు? ఎన్ని ప్రశంసలు గుప్పించారు?

కారు హారన్ మోగుతుంటే ఆలోచనల్లో నుండి బయటపడింది సంగీత. తారతో పాటు నడిచి కారెక్కింది. కారు చేరేసరికి రాజకుమారుడు హవేలీలాన్‌లో ఆమెకోసం ఎదురు చూస్తున్నాడు. సంగీతను కూర్చోమని చెప్పాడు. పరస్పర పరిచయాలు ముగిశాయి. తన పేరు 'నీరజ్' అని చెప్పాడు రాజకుమారుడు.

"మీరు క్రమంతప్పకుండా యోగాసనాలు చేస్తుంటారా? " అడిగాడు నీరజ్.

"నిజమే! మీరూ సంవత్సరాల తరబడి చేస్తున్నట్లు మీ శరీరాన్ని చూస్తుంటే అర్థమవుతోంది"

"సంవత్సరాల తరబడి చేస్తున్నట్లు మీకెలా తెలిసింది? "

"శ్రీమంతుల బిడ్డలు సాధారణంగా స్థూలంగా ఉంటారు. మీ శరీరంలో ఆ

గుర్తులేవీ లేవు... అందుకనే!"

నీరజ్ నవ్వాడు.

సంగీత తెలివితేటలకు మెచ్చుకోలుగా చూసి, కూల్‌డ్రింక్ అందించాడు. సంగీతకు తను ఇంట్లోని స్విమ్మింగ్‌పూల్ చూపించాడు. ఇల్లు చూడమని లోపలికి నడిపించాడు. తరువాత ఇద్దరూ హాల్లోకి వచ్చారు. అక్కడి అందమైన అలంకరణలు చూసి ముచ్చటపడింది సంగీత.

"ఇంట్లో ఎవరూ లేరా? " అంది.

సోఫాలో కూర్చుంటూ, తన తల్లిదండ్రులు న్యూయార్క్‌లో ఉంటారనీ, ఎగుమతి దిగుమతి చేసే వ్యాపారాన్ని నిర్వహిస్తుంటారనీ చెప్పాడు నీరజ్. సంగీతను గురించిన వివరాలడిగాడు. పాకిస్థాన్‌నుండి భారత్‌కు వచ్చినప్పటినుండి తను హైద్రాబాద్‌కి చేరుకున్న ఉదంతంవరకు వివరంగా చెప్పింది సంగీత. గతం గురించి చెబుతుంటే ఆమె గొంతుగద్గదంతో వణకసాగింది. కళ్ళు ధారాపాతంగా వర్షించసాగాయి. వింటున్న నీరజ్ మనసు బాధగా మూలిగింది. సంగీతపట్ల సానుభూతి, జాలి పెరిగాయి. జేబులోనుండి రుమాలు తీసి ఆమె కన్నీరు తుడిచాడు. ధైర్యవచనాలు పలికాడు. సహృదయంతో వినేవారు ఎదురయ్యేసరికి ఇన్నాళ్ళుగా దాచుకున్న బాధ వేదన ఒక్కసారిగా బయటపడ్డాయి. సంగీత అలా చాలా సేపటివరకు వెక్కివెక్కి ఏడ్చింది. ఆమెను మనస్ఫూర్తిగా ఏడవనిచ్చి తరువాత మరో గదిలోకి తీసుకువెళ్ళాడు నీరజ్. వాతావరణాన్ని ఆహ్లాదంగా మార్చాలని పాటల రికార్డులు పెట్టాడు. అక్కడే ఇద్దరూ భోజనాలు ముగించారు. తరువాత తన డ్రైవరును పిలిచి ఆమెను దిగబెట్టిరమ్మని చెప్పాడు నీరజ్. తరువాత ఆమె చెయ్యి నొక్కి వీడ్కోలు పలికాడు.

★ ★ ★

సంగీత వెళ్ళిపోయింది. నీరజ్ మనసు ఓ తుమ్మెదలా ఆమె చుట్టే పరిభ్రమించసాగింది. వేదనామయమైన ఆమె గతం అతనిలోని జాలిని ఎన్నో రెట్లు పెంచింది. తొలిచూపులోనే తనని అమితంగా కట్టిపడేసిన ఆమె సౌందర్యం, తనలోని కారుణ్యభావనను జాగృతం చేసిన ఆమె దీనగాధ పదే పదే గుర్తుకురాసాగాయి. హోటల్‌కి ఫోన్ చేసి హోటల్ వాళ్ళు అడిగినంత డబ్బిచ్చి మరో పదిరోజులవరకు ఆమె ఇక్కడికే వచ్చేలా ఏర్పాటు చేశాడు నీరజ్.

ఎవరిపట్లా స్పందించని 'సంగీత' హృదయం నీరజ్‌ని చూశాక పూర్తిగా మారిపోయింది. ఆమె మనసు అతని సాన్నిధ్యాన్ని కోరుతోంది. మళ్ళీ తనే తన ఆలోచనలకి నవ్వుకుంటుంది. "ఎక్కడి రాజకుమారుడు? ఎక్కడి తను? ఇద్దరి మధ్యా ఎంత అంతరం? " అనుకుంటూండగా తార వచ్చింది. మరో పదిరోజుల వరకు నీరజ్ సంగీతని బుక్‌చేసుకున్నాడని చెప్పింది. ఆశ్చర్యం, ఆనందం కలగాపులగం కాగా విస్మయంగా చూసింది సంగీత.

మర్నాడు కారు రాగానే బయల్దేరింది సంగీత. వెళ్ళగానే చిరునవ్వుతో స్వాగతం చెబుతూ ఎదురు వచ్చాడు నీరజ్. హాల్లో కూర్చోబెట్టి అతిధిమర్యాదలు చేశాడు. గోడలకు వేలాడే పెయింటింగ్స్‌ని శ్రద్ధగా పరిశీలించింది సంగీత. పశుపక్ష్యాదులతో ప్రకృతి చిత్రం ఒకటి, పర్వతాల పెయింటింగ్ ఒకటి, శ్రీకృష్ణుడు గోవర్ధనగిరిని చిటికెనవేలుతో ఎత్తుతున్న భంగిమ పెయింటింగ్ ఒకటి... ఆమెని ఎక్కువగా ఆకర్షించాయి. రెండు రోజుల వరకు వాటిని గురించి చర్చించారిద్దరూ. తనకు రాసలీలలో తన్మయమైన గోపకాంతలు, శ్రీకృష్ణుని పటం ఇష్టం అన్నాడు నీరజ్.

భాగవతం గురించి, ప్రకృతి గురించి చాలా సేపటివరకు చర్చ కొనసాగింది. అన్ని

అంశాలలోనూ ఆమెకిగల అవగాహన చూసి చకితుడైన నీరజ్ ఆమెని గుండెలకు హత్తుకున్నాడు. కొన్ని నిమిషాలు మౌనంగా గడిచాక నెమ్మదిగా తన పడకగదిలోకి నడిపించాడామెని. ఇన్నాళ్ళుగా తన వద్దకి వచ్చే విటులకి కేవలం శరీరాన్నే అందించే సంగీత నీరజ్‌కి తన మనసు కూడా అర్పించింది.

"సంగీతా! మనం పెళ్ళి చేసుకుందాం" అన్నాడు నీరజ్ హఠాత్తుగా.

ఉలిక్కిపడింది సంగీత. ఒక రాజకుమారుడు తనలాంటి బజారు స్త్రీని పెళ్ళాడతాడా? ఏదో ఆవేశంలో అంటున్నాడు అనుకున్న సంగీత బదులుపలకలేదు.

"నీ నిర్ణయం ఇప్పుడే చెప్పాలి" అన్నాడు నీరజ్.

ఏం చెప్పాలో తోచలేదామెకి.

నీరజ్ రెట్టించాడు.

"నా గతం అంతా గాయాలతో, మచ్చలతో నిండిఉంది. నేను మీకు యోగ్యురాలినికాను" అంటూ మళ్ళీ తన గతాన్ని వివరంగా చెప్పింది.

"తప్పులుచేయని వారీలోకంలో ఎవరున్నారు? కావాలని దోషమేమీ నీవు చేయలేదు. త్రికరణశుద్ధిగా ఉన్నామని గుండెల మీద చెయ్యివేసుకుని చెప్పే వారెవరైనా ఉన్నారంటావా? అందరూ ఏదో తప్పు తప్పక చేస్తారు. నా గతం మాత్రం నిష్కళంకమైందనే ఎలా అనుకుంటున్నావ్? నేనూ తప్పులుచేశాను. మనం సాధారణ మానవులం. నీవు తక్కువదాన్ననే భావాన్ని మనసులోనుండి తీసెయ్"

సంగీతకి దుఃఖం పొంగుకువచ్చింది. "నేను అటు నిర్మలగానూ, ఇటు సంగీతగానూ కూడా నా శీలాన్ని కాపాడుకోలేకపోయాను" అని కన్నీరు పెట్టుకుంది.

"నేటినుంచి నువ్వు సుభద్రవి. నేనికపై ఈ పేరుతోనే పిలుస్తాను. ఏం? నీ గతాన్నీ, ఆ పేర్లనీ ఇక మర్చిపో! నేటినుండి నువ్వు నా సహధర్మచారిణివి! నేనిక నీవాణ్ణి నీ నీరజ్‌ని! ఒప్పుకున్నట్లేనా?" అనునయిస్తున్న నీరజ్ పట్ల ప్రేమ వెల్లువైపొంగింది సంగీతలో. భావావేశంలో అతన్ని అల్లుకుపోయింది. ఇంతమంచి అవకాశాన్ని ఎలా జారవిడుచుకుంటుంది? తనకి మంచి రోజులు వస్తాయనీ ఇలా జీవితం ఒడ్డునపడుతుందనీ కనీసం ఊహించనైనాలేదు. ఈ ఉత్తముడి నీడలో ఈ జీవితం గడిచిపోతే చాలు! ఇంకా ఏం కావాలి? అనుకుంది.

హోటల్ మేనేజర్‌తో మాట్లాడి వాళ్ళు కోరినంత ధనం ముట్టచెప్పాడు నీరజ్. తరువాత ఇద్దరూ కోర్టుకు వెళ్ళి వివాహం చేసుకున్నారు.

నీరజ్ హవేలీ వాతావరణం క్రమంగా మారిపోయి ఓ ఆదర్శగృహసీమగా రూపుదిద్దుకుంది. అందుకేనేమో ఇంటి రూపురేఖల్ని మార్చే ఇల్లాలిని గృహలక్ష్మి, గృహస్వామిని అంటూ ఉంటారు...!



సీమను గురించి వస్తున్న వార్తలన్నీ సుభద్ర శ్రద్ధగా, ఆసక్తిగా చదువుతోంది. సీమ సాధించిన సత్ఫలితాల్ని దాదాపు అన్ని వార్తాపత్రికలూ ప్రచురించాయి. సంపాదకీయాల్లో ప్రశంసలు కురిశాయి. నీరజ్‌తో వివాహం జరగకముందు ఉత్తరం రాయాలంటే సంకోచం కలిగేది. ఇప్పుడు

లేదు. కాగితం, కలం అందుకుని సీమకి ఉత్తరం రాయసాగింది.

"ప్రియమైన సీమా!

పత్రికల్లో నీ గురించి చదువుతూనే ఉన్నాను. రాష్ట్రవ్యాప్తంగా ఖ్యాతినార్జించినందుకు, ఎంతో సాధించినందుకు హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

కొన్నాళ్ళకిందటే నీవు సాధించిన విజయాల గురించి, సత్ఫలితాల్ని గురించి చదివాను. కానీ నీకు ఉత్తరం రాయాలంటేనే సంకోచం కలిగి మానుకున్నాను. నీకు దూరమయ్యాక ఎలా గడిపానో అదంతా ఉత్తరంలో రాయాలంటే బాగోదని రాయలేదు. నా సుదీర్ఘగాథని మనం కలుసుకున్న తరువాతే చెబుతాను. పేపర్లో నీ ఫొటో కింద నీ పేరూ, చిరునామా చదివాను.

నీకొక శుభవార్త చెప్పాల్సివుంది. వివాహమనే సుందర బంధనంలో చిక్కుకున్నాను. మనం కలుసుకున్నప్పుడు నీరజ్‌ని పరిచయం చేస్తాను. కామిని బాగా ఎదిగిందనుకుంటాను. తనకు నా ముద్దులూ, ఆశీస్సులూ అందించు. నీ ఉత్తరం కోసం నిరీక్షిస్తూ ఉంటాను. కవరుపైన 'సుభద్ర కేరాఫ్ నీరజ్' అని రాయటం మరువకు.

శుభ కామనలతో
నీ స్నేహితురాలు
నిర్మల
(ఇప్పుడు సుభద్ర)"

ఆ ఉత్తరం అందుకున్న సీమ ఆనందానికి అవధులు లేవు. తను పోగొట్టుకున్న అమృతభాండం మళ్ళీ దొరికినంత సంబరం కలిగింది. మరునాడు సీమ సుభద్ర ఉత్తరానికి సమాధానం రాసింది.

"ప్రియమైన సుభద్రా!

కొత్త పేరు పెట్టుకున్నందుకు అభినందనలు. నీలాంటి జీవితభాగస్వామి దొరికినందుకు నీరజ్ ఎంతో అదృష్టవంతుడు సుమా! మీ ఇద్దరి భవిష్యత్తు మంగళమయం, శుభకరం కావాలని కోరుకుంటున్నాను. చాలా కుటుంబాల్లో అత్తింటివారు కోడలికి తమకు నచ్చిన పేరు పెట్టుకోవటం చూస్తుంటాం. అందుకే నిన్ను సుభద్రగా పిలుస్తున్నారనుకుంటాను.

నాకొకటి అర్థం కాలేదు. నాకు ఉత్తరం రాయడానికి నీవెందుకు సందేహించవలసివచ్చింది? నేను లక్నోకి వచ్చాక సత్రంలో నీకు సమస్యలెదురయ్యాయా? నీ కష్టాలకి నేనే కారణమైతే నన్ను క్షమించు. లక్నోలో చాలాకాలంపాటు ఉండిపోవలసివచ్చింది. నీకు చెప్పినదానికంటే పదిరోజులు ఆలస్యంగా ఢిల్లీకి వచ్చాను. నీవు ఢిల్లీకి వెళ్తే నేను రాసిన ఉత్తరం సత్రం గుమాస్తా నీకిచ్చేవాడు.

మనిషి అసలు గమ్యం, జీవనమూల్యం ఆధ్యాత్మికం కాగా మతం పేరుతో వైమనస్యాలు, పోట్లాటలు ప్రారంభిస్తారు మనుషులు. మతం పేరుతో ప్రజల్ని రెచ్చగొట్టి తమ పబ్బం గడుపుకుంటారు రాజనీతిజ్ఞులు, స్వార్థపరులైన మతాధిపతులు. కల్లోలాలని చెలరేపేది వీరే! ఈ విషయంలో ఆలోచించవలసింది చాలా ఉంది. మనం కలుసుకున్నప్పుడు విపులంగా మాట్లాడుకుందాం. మనం త్వరగా కలుసుకోవాలని భగవంతుని ప్రార్థిస్తున్నాను.

ప్రేమతో నీ సీమ"

★ ★ ★

సీమను ప్రశంసిస్తూ విదేశాలనుండి కూడా ఉత్తరాలు రాసాగాయి. ఇవి రోజురోజుకీ పెరుగుతున్నాయి. ఓరోజు ఉత్తరాలు చదువుతుండగా, ప్రత్యేకశైలిలో రాసిన ఒక ఉత్తరం సీమని ఆకర్షించింది. అది ఇలా సాగింది.

"దినపత్రికలో ఈరోజు నీ పేరు చదివాను. పాతజ్ఞాపకాలు పరిమళించాయి. కాస్సేపు ఆ స్మృతుల్లో జీవించాను. నీ విజయాలపై నాకెంత సంతోషం కలిగిందో రాతల్లో చెప్పలేను. లక్నో నగరంలోని

యాచకుల సమస్యను ఇంత తక్కువ సమయంలో, సమర్ధవంతంగా పరిష్కరించినందుకు మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను. హిందుస్తాన్, పాకిస్తాన్‌ల సామాజిక కార్యకర్తల ఎదుట ఒక సవాలు విసిరావు. దాన్ని స్వీకరించాలి. లేదా తమ ఓటమిని ఒప్పుకోవాలి. ఏది చేయాలో, చేయకూడదో వారి వారి సంస్కారాలే నిర్ణయిస్తాయి.

మా ఊళ్లో ఒక భిక్షగాడున్నాడు. ఉదయం, సాయంత్రం భిక్షకోసం ఇల్లిల్లా తిరుగుతుంటాడు. "దేవుని పేరుతో ఏమైనా ఇవ్వండి. ఇచ్చేవారికీ శుభం, ఇవ్వనివారికీ శుభం" అని పాట పాడుతుంటాడు. అతని కంఠం శ్రావ్యంగా ఉంటుంది. అందరూ సంతోషంగా తోచినంత ఇస్తుంటారు. అతనికి పది ఎకరాల పొలం ఉందనీ, తన ఆస్తి పెంచుకోవడానికి భిక్షమెత్తుతాడనీ నాకు ఇటీవలే తెలిసింది. ఇలాంటి వ్యక్తికి భిక్షమెత్తుకునే అర్హత ఉందా?

ఇక్కడి నగరాల్లోని వీధుల్లో అధిక సంఖ్యలో వృద్ధులు, యువకులు, పిల్లలూ భిక్షమడుగుతూ తిరుగుతుంటారు. ఏదో ఒకటి ఇచ్చేవరకు వెంబడిస్తారు. విదేశీయులపై ఇటువంటి దృశ్యాలు ఎలాంటి ప్రభావాన్ని చూపుతాయో భగవంతునికే తెలియాలి. వాళ్ళు వీరి ఫొటోలు తీసి తమ దేశాలకి పట్టుకుపోతారు. అక్కడ మిగతా వారికి చూపించి మన దేశీయుల్ని అపహాస్యం చేస్తుంటారు.

దినపత్రిక చదవగానే అనిపించింది నువ్వు పాకిస్తాన్‌లో ఉంటే బాగుండేదని! కానీ నీవు భారతదేశానికి వెళ్ళడం కూడా తప్పు కాదు. ఇక్కడి జమీందారు దగ్గర ఓ గుమాస్తా ఉండేవాడు. అతను భారతదేశానికి తిరిగి వెళ్ళిపోతానని వేడుకున్నా జమీందారు పంపించలేదు. తను అతనికి సంపూర్ణ రక్షణ కల్పిస్తానని అభయమిచ్చాడు. పదిరోజుల తరువాత గుంపులు గుంపులుగా విధ్వంసకారులు వచ్చి ఆ గుమాస్తాని బయటికి ఈడ్చారు. జమీందారు ఎంత నచ్చజెప్పినా వినకుండా గుమాస్తాని కాల్చిచంపేశారు. ఇక్కడ ప్రాణాలకు నమ్మకం లేదు. నువ్వు వెళ్ళటం మంచిదే అయింది.

ఈ ఆందోళన, అశాంతి ఇంకా ఎంత కాలం రెండు దేశాల మధ్య రాజుకుంటూ ఉంటుందో భోధపడటంలేదు. హిందువులంతా ఇక్కడినుండి వెళ్ళిపోయాక స్థానిక ముస్లింలంతా ఒకర్నొకరు పొడుచుకుంటారు కాబోలు! రక్తం రుచిమరిగినవాళ్లు హింస మానలేరుగదా!

పేరు రాయకుండా ఉత్తరం రాస్తున్న ఇతనెవరా? అని ఆలోచిస్తున్నావనుకుంటాను. నా చిరునామా రాస్తున్నాను. వీలైతే జవాబు రాయి. పాకిస్తాన్ విదేశ విభాగంలో పనిచేస్తుంటాను. ఇప్పుడు గుర్తించావనుకుంటాను.

ఉంటాను, ఖుదాఫీజ్

నీ

.....................

పోస్ట్‌బాక్స్ నెంబరు 55,
జి.పి.ఒ. రావల్పిండి,
(పాకిస్తాన్)"

చదవగానే ఉత్తరం రాసినవారెవరో సీమకి అర్ధమైపోయింది. అతన్ని ఎలా మర్చిపోగలదు? తనకి ప్రాణభిక్ష పెట్టిన ప్రాణదాత ఇతనే కాదూ! కామినిని దొంగలనుండి విడిపించుకుని తెచ్చి తనకు పుత్రికా భిక్ష పెట్టలేదూ! కాగితం, కలం తీసుకుని రాయటం ప్రారంభించింది.

"శ్రీయుతులు జాహిద్‌గారికి

నమస్కారములు

మీరు ఉత్తరం రాసినందుకు ధన్యవాదములు.

జీవితంలో ఇన్ని పరీక్షలకు గురయ్యాక కూడా ఇంకా ఎన్నింటిని ఎదుర్కోవాల్సివస్తుందో అర్థం కావటంలేదు. మీ పేరు

రాయకుండా మీరూ నాకొక పరీక్ష పెట్టబోయారు. కానీ ఈ పరీక్షలో నాదే గెలుపు. మీ వంటి సహృదయుడిని మరిచిపోగలనా? ప్రస్తుతం మీరు పాకిస్తాన్‌లోని విదేశీ సేవాసంస్థలో పనిచేస్తున్నందుకు ఎంతో సంతోషించాను. మీ ప్రభుత్వం మిమ్మల్ని భారతదేశంలోని పాక్-హై కమీషన్‌లోకి బదిలీ చేస్తే ఎంతో బావుండేది!

ఈ ఉత్తరం మీకు చేరితే మరొక ఉత్తరం వివరంగా, సుదీర్ఘంగా రాస్తాను. మీరు కూడా అక్కడి రాజనైతిక స్థితిని గురించి విపులంగా రాయగలరు.

మీకు దీర్ఘాయువును, ఆరోగ్యాన్నీ ఇమ్మని భగవంతుని ప్రార్థిస్తున్నాను.

కృతజ్ఞురాలు
సీమ "

సీమ హృదయంలో తనకు గల స్థానం పదిలంగా ఉందని ఆమె ఉత్తరం చదివిన జాహిద్‌కి తేటతెల్లమైంది. సీమకు తిరిగి సమాధానం రాస్తూ-

"నీ ఉత్తరం చదివాక నాకెంత ఆనందం కలిగిందో మాటల్లో చెప్పలేను. నాపైనగల నీ సదభిప్రాయానికి ధన్యవాదాలు. ఇక్కడి స్థితిగతుల గురించి అడిగావు. ప్రస్తుతం భారతదేశం, పాకిస్థాన్‌ల రాజనైతిక స్థితులలో తేడాలేం లేవు. ఉండవుకూడా! ఎందుకంటే రెండు దేశాలూ విదేశీయుల రాజనైతిక వ్యూహాలకు ఆహారమవుతున్నాయి. రెండు దేశాల్లోనూ ఆర్థిక సమస్యలు ముప్పిరిగొని ఉన్నాయి. నిరక్షరాస్యత ప్రబలి ఉంది. ఆలోచించే తీరు కూడా ఇంచుమించు ఒకేలా ఉంది. నేలపై గీత గీసి సరిహద్దుగా చెప్పుకున్నంత మాత్రాన పద్ధతులు, ఆలోచనలు వేరైపోతాయా? ఒకవిధంగా భారతీయులు అదృష్టవంతులనే చెప్పాలి. అక్కడ మహాత్మాగాంధీ, జవాహర్లాల్ నెహ్రూ, సర్దార్ పటేల్, మౌలానా ఆజాద్ వంటి నాయకులున్నారు. ప్రజలకు అండదండగా పనిచేస్తున్నారు. వారికి ప్రజల నాడి తెలుసు. వారికి సమానులైన ఒక్క నాయకుడైనా మా దగ్గరలేడు. ఈ దృష్టితో ఇంతో ఆలోచిస్తే భారతదేశం, పాకిస్థాను రాజనీతి యొక్క భవిష్యత్తు వేరువేరుగా అగుపిస్తుంది. హిందువుల్ని మట్టుపెట్టే ప్రక్రియ ఇంకా ఇక్కడ సజీవంగా ఉంది. ఇదిలాగే కొనసాగితే ఒక్క హిందువూ మిగలడు. మనిషిని హిందువు, ముసల్మాను అనే ఆకారాల్లో ఎందుకు చూస్తామో నాకు బోధపడదు. మనిషి ఒక్కడే! మనసు ఒక్కటే! రెండు ముఖాలు రెండు చిత్రాలు! రెండు ఆకృతులు! కేవలం 'మానవుడు'గా గుర్తించేందుకు? మందిరం, మసీదులని మతం దృష్టితోగాక పూజాగృహాలుగా ఎందుకు భావించరు? ఉపవాసం, రోజాల వలన, కాశీ, కాబాయాత్రలవలన లభించే ఫలితం ఒక్కటేనని ఎందుకు అర్థంచేసుకోరు? ఒక గడియారంలోని రెండు ముళ్ళ ఆశయమూ ఒక్కటేనని ఎందుకు గుర్తించరు? ఇక్కడ హిందూ స్త్రీలకు జరిగే అవమానాల్ని చూస్తుంటే నా హృదయం ఎంతగానో క్షోభిస్తుంది. మహిళ ఎవరైనా ఒకటే! హిందూవనితకి పరాభవాలు ముస్లిం వనితకి పారితోషికాలా? ఈ తేడాలెందుకు? ముస్లిం కాని స్త్రీ పట్ల దుర్వ్యవహారం చేయమని ఎక్కడా లేదు. అరబ్బీభాషలో 'స్త్రీ' అంటే దాచవలసిన వస్తువు అనీ, దానిని తెరిచి ఉంచటం అనుచితమని అర్థం. కురాన్ షరీఫ్‌లో ముస్లిం, ముసల్మాను కాని స్త్రీల పట్ల భేదమేమీ చెప్పలేదు.

ముసల్మానుల పైగంబర్ హజరత్ మహమ్మద్ సాహిబ్ రసూల్ సల్లల్లాహ తను చెప్పిన అంశాల్ని పాటించని వారిని 'కాఫిర్' లని అన్నారు. కురాన్ షరీఫ్ ఆదేశాలపై నడవని వారిని, రసూల్ చెప్పిన సూత్రాల్ని అనుసరించని వారిని, ఇష్టం వచ్చినట్లు వ్యవహరించే వారినందర్నీ 'కాఫిర్ల'నే అంటాన్నేను.

ఏదైనా కానీ, తను చేసిన పనులకు ఫలితం ఎవరైనా అనుభవించాల్సిందే! హిందువే కానీ, ముస్లిమే కానీ, మరో మతానుయాయేకానీ... అందరూ చివరికి భగవంతుని న్యాయస్థానానికి వెళ్ళాల్సినవారే! అందరికీ జరిగే న్యాయమూ ఒక్కటే!

భారతదేశంలో పోస్టింగ్ ఇవ్వమని దరఖాస్తుచేసుకున్నాను. అదిగానీ మంజూరైతే నిన్ను కలిసే అదృష్టం కలుగుతుంది. రెండు దేశాలమధ్య స్పర్ధలవలన దీనికి అనుమతి లభిస్తుందో లేదో చెప్పలేం. లక్నో పరిసరాల్లో నా బంధువులున్నారని అధికారులకి తెలుసు. అలా నన్ను బదిలీ చేస్తే చెప్పలేను.

చిట్టి తల్లి కామినికి శుభాశీస్సులు

-జాహిద్ "

జాహిద్ నిజాయితీ ప్రతి అక్షరంలోనూ వ్యక్తమవుతోంది. రెండుసార్లు ఆ ఉత్తరాన్ని చదివిన సీమ హృదయతంత్రుల్ని మీటినట్లయింది. కలం తీసుకుంది.

"జాహిద్ మహాశయా!

మీరు భారతదేశంలో పోస్టింగ్ కోసం అప్లికేషన్ పెట్టుకున్నారని చదివి నాకెంతో సంతోషం కలిగింది. మీ దరఖాస్తును ప్రభుత్వం అంగీకరించాలని భగవంతుని ప్రార్థిస్తున్నాను.

నేనేదో చేశానని ఈ లక్నోలోని ప్రభుత్వం, సంస్థలు చెబుతున్నాయిగానీ ఆ కీర్తి నాది కాదు. అదంతా కేవలం మీ చలవే!! కనుక అది మీకే చెందుతుంది.

నాకు జీవితాన్ని మీరే ప్రసాదించారు. లేకుంటే పాకిస్థాన్ ప్రభుత్వ ఖైదులోనో... మరెక్కడో ఉండేదాన్ని. నా వలన ఏ మంచి పని జరిగినా దాని ఘనత, కీర్తి మీకే చెందుతుందని పదేపదే అంటాను.

ఇక అంతర్జాతీయ వైమనస్య విషయాలకి వస్తే అవి ఇక్కడ కూడా అధికంగానే ఉన్నాయి. మహాత్మాగాంధీ సంత్-సాధుత్వంవలన, జవహర్‌లాల్ నెహ్రూ ఆకర్షణీయ వ్యక్తిత్వ ప్రభావకారణంగా కొంతవరకు నియంత్రించబడుతున్నాయి. ఇక్కడ కూడా విధ్వంసకారులు ఏదో ఒక రోజు గాంధీని హతమార్చినా ఆశ్చర్యమేమీ లేదు. సాధుతత్వజ్ఞుడవడం వలన పోలీసుల సంరక్షణ కల్పిస్తామన్నా ఆయన అంగీకరించడు. కురాన్‌లో రాశారని ఇటీవలే నాకొక ఫకీర్ ఓసూక్తి చెప్పాడు. హంతకులని భగవంతుడు నిప్పుల్లో తోస్తాడనీ, ఇస్లాంలో బలవంతం ఉండరాదనీ ఉందనీ అన్నాడు. మరి వీళ్ళు ఇతర మతస్తులనే బలవంతంగా మతం మార్పిడులు చేయిస్తున్నారు. అన్యధర్మాలను విశ్వసించేవారిని ఆతతాయిలని వక్రీకరిస్తున్నారు. ఇంత బాహాటంగా కురాన్ ఆజ్ఞల్ని ధిక్కరిస్తున్నారు వీళ్ళంతా. శిక్షలనుండి తప్పించుకోగలరా?

మన రెండు దేశాలవారికి ఈ అంశాలు ఎప్పటికి అర్థమవుతాయో ఆ భగవంతునికే తెలుసు!

మన ఆలోచనలు ఒక్కటే! హిందూ, ముస్లీం ముసుగు ధరించి మనం సమస్యల్ని చూడటంలేదు. మనిషిగా మానవత్వపు దృక్కోణంతో చూసేందుకు ప్రయత్నిస్తున్నాం. మనం కలుసుకునే అవకాశాన్ని భగవంతుడు కల్పిస్తే వీటిని గురించి విస్తృతంగా చర్చిద్దాం.

శుభాకాంక్షలతో

-సీమ "

★ ★ ★

దుండగులు విషం పూసిన ఆయుధాల్ని మన్‌మోహన్‌పైకి విసిరినప్పుడు అది అతనికి తగల్లేదు. అతని పక్కనే ఉన్న ఓ ముస్లిం యువకుడు దానికి బలయ్యాడు. విధ్వంసకారులు విన్న హాహాకారం అతనిదే!

ఈ శబ్దం వినగానే ఇళ్ళలోంచి జనం బయటికి రాసాగారు. తను అక్కడే ఉండటం ప్రమాదకరం అని భావించిన మన్‌మోహన్ తన ఇంటివైపు పరుగెత్తసాగాడు. ఇది చూసిన పోలీసులు అతను ఓ విధ్వంసకారుడు కాబోలనుకుని బంధించి మర్నాడు మియాంచనూ జైలుకు పంపించారు. జైల్లో తన పేరు ఉస్మాన్‌గా రాయించుకున్నాడు మన్‌మోహన్.

జైల్లో మన్‌మోహన్ జీవితం అత్యంత దుర్భరంగా గడవసాగింది. అతన్ని ఉస్మాన్ అనో లేదా 212 అనో పిలవసాగారంతా. నేరస్తులుగా భావించినవారిని జైల్లో నింపసాగారు అధికారులు. ఇంతమందికి సరిపడా డ్రెస్సులు లేవు. అందుకే కేవలం నెంబరు బిళ్ళలు మాత్రం ఇవ్వసాగారు. మన్‌మోహన్‌కి కూడా జైలు దుస్తులేమీ ఇవ్వలేదు. 212 నెంబరు బిళ్ళ ఇచ్చారు. జైలు గోడలమధ్య అతని దినచర్య పూర్తిగా వేరుగా ఉంది. ఉదయం జైలుగది తలుపులు తెరిచేవారు. ఖైదీలంతా బహిర్భూమికి వెళ్ళేవారు. దుర్గంధమయమైన అక్కడి వాతావరణం రోగాలను వ్యాపింపచేసేదిలా ఉంది. అయినా వెళ్ళక తప్పేది కాదు. తరువాత అందరికీ టిఫిన్లు ఇచ్చేవారు. అవిముగిశాక ఖైదీలతో రోజంతా వివిధ రకాల పనులు చేయించేవారు. మధ్యాహ్నం భోజనాలు వడ్డించేవారు. ఖైదీలు ఆవురావురని భోంచేసేవారు. తరువాత పొలం పని. సాయంకాలం మౌల్వీ వచ్చి ఇస్లాం మతం గురించి ప్రసంగించేవాడు. తరువాత రాత్రి భోజనాలు ముగించి ఖైదీలంతా నిద్రకు ఉపక్రమించేవారు.

తను ఇక్కడినుండి ఎలా తప్పించుకోవడమా అని మన్‌మోహన్ ఆలోచించేవాడు. చివరికి ఓ ఉపాయం తోచి తనలో తనే నవ్వుకున్నాడు! మర్నాడు దానిని అమలుపరచాలని నిశ్చయించుకున్నాడు కూడా!

మధ్యాహ్నం పొలంలో ఖైదీలంతా పనుల్లో నిమగ్నమై ఉండగా ఎదురుగా ఉన్న చెట్టు ఆకులు కోశాడు మన్‌మోహన్. ఎవరూ చూడనప్పుడు గబగబా వాటిని నమిలి మింగేశాడు. కాస్సేపటికే విరేచనాలు మొదలయ్యాయి. రోజంతా అవటంతో జైలు అధికారులు అతన్ని ఆస్పత్రిలో చేర్పించారు. రెండు రోజులు అక్కడే ఉన్నాడు మన్‌మోహన్. మూడవరోజు పారిపోయేందుకు నిశ్చయించుకుని ప్రయత్నించాడు. ఆస్పత్రిలోని నర్సు అతన్ని కనిపెట్టి అరవబోయింది. తన వేలికున్న బంగారు ఉంగరం తీసి ఆమె చేతిలో పెట్టాడు. ఆమె నోటికి తాళం పడింది. గబగబా గోడలు దూకి పారిపోయాడు మన్‌మోహన్. నెంబరు బిళ్ళ తీసి పారేశాడు. మియాంచనూ శరణార్థుల శిబిరాలకు చేరుకున్నాడు. శరణార్థులలో మన్‌మోహన్ మిత్రుడు కనిపించాడు. ఆ విధంగా వారితో కలిసి భారతదేశానికి వచ్చాడు. మియాంచనూ శరణార్థుల్ని సోనేపట్‌కు పంపించారని తెలిసింది. తన వాళ్ళు అక్కడే ఉండొచ్చని సోనేపట్ వెళ్ళాడు. వెతికివెతికి వేసారి ఢిల్లీకి వచ్చేశాడు. లక్నోలో అతని తల్లిదండ్రులున్నారని తెలిసి లక్నోకి వెళ్ళి రాత్రింబవళ్ళు వెతికి తన తల్లితండ్రుల్ని కలుసుకున్నాడు మన్‌మోహన్.

మన్‌మోహన్‌ని చూడగానే అతని తల్లిదండ్రుల ఆనందానికి అవధులు లేకుండాపోయాయి. తన గాథనంతా చెప్పాడు మన్‌మోహన్. సీమ కన్పించకపోవటంతో ఆమె గురించి అడగాలనుకున్నా గొంతు పెగల్లేదు. బహుశా సీమ, కామిని పాకిస్థాన్‌లోనే చిక్కుకుని ఉన్నారేమో అనుకున్నాడు. మాటలు, భోజనాలు ముగిశాక నిద్రకు ఉపక్రమించబోతుండగా తల్లి అతని గదిలోకి వచ్చింది.

"జైల్లో గడిపానని ఎవరికీ చెప్పొద్దు బాబూ! అందరూ నీలాగే నిష్కపటంగా

ఉంటారనుకుంటావు. ఓ ఖైదీకి పిల్లనివ్వడానికి ముందుకు వచ్చే సహృదయం ఎవరికి ఉంటుందంటావ్? ప్రతికూల పరిస్థితుల్ని ఎదుర్కొని వచ్చిన నీ ధైర్య సాహసాల్ని మెచ్చుకోరు సరిగదా! ఖైదీ అనే ముద్రే వేస్తారు" అంది తల్లి.

సీమ గురించి తెలుసుకోవడానికి ఇదే మంచి సమయం అనుకున్నాడతడు.

"సీమ, కామినిలను గురించి ఏమీ తెలీనే లేదా"

"తెలిసింది. కానీ తెలీకుండా ఉంటేనే బాగుండేదనిపిస్తుంది. కనీసం మనసు భగ్గుమనకుండా ఉండేది"

"ఏమిటి విషయం? ఏం జరిగింది"

"అది మన వంశగౌరవాన్ని మంటగలిపింది. స్త్రీలనందరినీ విధ్వంసకారులు ఎత్తుకుపోయారు నిజమే! కాని మిగిలినవారంతా మర్నాడు వచ్చేశారు. ఈవిడగారు అక్కడే ఓ ముస్లిం ఇంట్లో దూరింది. అక్కడే పీఠం వేయడంతో, చుట్టుపక్కల ఉన్న ముస్లింలంతా, ఈవిణ్ణి చేరదీసిన వ్యక్తిపై విరుచుకుపడటంతో తన జీవితం అపాయంలో ఉందని అక్కడినుండి పారిపోయి హిందూస్తాన్‌కి వచ్చేసింది. ఇక్కడికి వచ్చాక సోమనాథ్ అనే అతని ఇంట్లో చాలాకాలం గడిపింది. సోమనాథ్ భార్య దీన్ని తన్ని తరిమేస్తే అక్కడినుండి పారిపోయి ఉద్యోగం చేస్తోంది.

'సమాజసేవ' పేరుతో ఇష్టం వచ్చినచోటికి తిరుగుతుంది. లక్నోలో 'కల్యాణ కేంద్రం'లో పనిచేస్తోంది. గౌరవనీయురాలైన స్త్రీ లక్షణం ఇదేనా? మన వంశంలో ఎవరైనా ఉద్యోగాలు చేశారా? ఇలాంటి దాన్ని నా ఇంట్లో ఉండనివ్వడానికి నేను సిద్ధంగా లేను..."

"కామిని కూడా ఆమెతో ఉందా? "

"ఉంది. కాని అది పెద్దదయ్యాక ఓ కులటకూతుర్ని ఎవరు చేసుకుంటారు? కామిని మగపిల్లాడైనా కాదు. ఆడపిల్ల. పైగా తల్లి ఇతరులతో తిరుగుతుందనే కళంకం ఉండనే ఉంది. అందుకే ఆ పిల్లా తల్లితోనే ఉండనీ..."

మన్‌మోహన్ మౌనంగా ఉండిపోయాడు. తల్లి నిజమే చెబుతోంది కాబోలు! సీమతో ఆమెకు వైరమేమీ లేదు. కామినిని ఎంతగా ముద్దులాడేది... అనుకుంటూ పడుకున్నాడు. ఎంతకీ నిద్ర పట్టలేదు. మర్నాడు 'కల్యాణకేంద్రా'నికి వెళ్ళాడు. రోజూలాగే సీమ నగరపర్యటనకి వెళ్ళింది. సీమ ఆఫీసు గదిలో కూర్చున్నాడు. కేంద్రంలో పనిచేస్తున్న వాళ్ళలో పురుషులే అధికంగా ఉన్నారని గమనించాడు. తల్లి మాటల్లో నిజం ఉందనిపించిందతనికి.

కాస్సేపటికి సీమ వచ్చేసింది. మన్‌మోహన్‌ని చూడగానే ఆమె ఆశ్చర్యానందాలకు అవధులు లేవు. "వచ్చేశారా? మీకేం కాలేదా? నిజంగా దేవుడు దయామయుడు-ఆయనకి నేనెంతో కృతజ్ఞురాలిని" అంటూ భర్తని కౌగిలించుకుంది. కూతుర్ని పిలిచి "నాన్నగారికి ముద్దు పెట్టమ్మా" అంది. మన్‌మోహన్ దగ్గర కూర్చుని, "అమ్మా, నాన్నల్ని చూసివచ్చారా? వాళ్ళూ ఈ ఊళ్లోనే ఉన్నారు. హిందుస్తాన్‌కి ఎప్పుడు, ఎలా వచ్చారు? " అంది ప్రేమగా.

తన జైలు జీవితం, పారిపోయిన ఉదంతం సంక్షిప్తంగా వివరించాడు మన్‌మోహన్.

"భగవంతుడు నా మాంగల్యాన్ని రక్షించాడు. కోటి కోటి ధన్యవాదాలర్పిస్తున్నాను ఆయనకి" అంది సీమ సంతోషంగా.

అంతలో నౌకరు టీ, టిఫినూ తీసుకువచ్చాడు. అతను వెళ్ళగానే సీమ ప్లేట్లో సర్ది అతనికి అందిస్తూ, "శీలానికి శక్తి ఉందని నమ్మే నా విశ్వాసం ఈరోజు మరింత ధృఢమైంది. సావిత్రి సతీత్వం సత్యవంతుని యమునినుండి విడిపించుకొచ్చినట్లే భగవంతుడు నాపై కృపజూపి ఆ ఆకతాయిల

నుండి మిమ్మల్ని క్షేమంగా నా వద్దకి చేర్చాడు" అంది.

మన్‌మోహన్ మనసులో తల్లి హితబోధే నిండివుంది. సీమ మాటలేవీ అతనికి రుచించలేదు.

"ఇన్నాళ్ళూ పాకిస్తాన్‌లో ఎందుకు ఉన్నావ్? మిగతా స్త్రీలంతా ఇళ్ళకి తిరిగొస్తే నువ్వెందుకు అక్కడ ఉండాల్సివచ్చింది. ఇక్కడికి వచ్చాక సోమనాథ్ ఇంట్లో ఎందుకు ఉన్నావో అడగొచ్చా? ఇప్పుడు కూడా ఇన్నిరకాల మగవాళ్ళ మధ్య తిరుగుతున్నావు. ఇన్ని చేసీ ఇంకా శీలం గురించి, సతీత్వం గురించి మాట్లాడతావా? " అన్నాడు కోపంగా.

తన పరిస్థితులను స్పష్టంగా వివరించబోయింది సీమ. ఆమెకి అడ్డుతగులుతూ అరిచాడు మన్‌మోహన్. "మా కుటుంబంలోనే కాదు, ఊళ్లో ఎవరినైనా చూపించు, నీలా బరితెగించి తిరిగే ఆడదాన్ని..."

"సోమనాథ్ చిన్నప్పుడు నా క్లాస్‌మేట్. నా స్నేహితురాలు రాధకి భర్త. ఈ విషయం మీకు తెలుసు. నాకు ఈ ఉద్యోగం రావడానికి వాళ్ళిద్దరే కారణం. మీ అమ్మా, నాన్నల చిరునామా కూడా వాళ్లే కనుగొన్నారు. నన్ను అక్కడికి తీసుకెళ్ళారు. మీ అమ్మ-నాన్నలు నన్ను ఇంట్లోకి రానీయలేదు. అటువంటప్పుడు ఉద్యోగం చెయ్యకుండా ఏం చెయ్యాలి? ముష్టెత్తుకోవాలా? లేక ఉపవాసాలుండి చచ్చిపోతే బాగుండేదా? కామిని కోసమైనా నేను బ్రతకటం అవసరం అనుకున్నాను. లేక దాన్నీ చంపేయాల్సిందనా మీ అభిప్రాయం? "

"మఖ్దూంపూర్‌లో అపహరణకు గురైన స్త్రీలంతా తిరిగొచ్చారు. నువ్వెందుకు రాలేదు? ఎంతమందితో కులికావేమిటి? "

"ఇలా నీచంగా మాట్లాడకండి. నేనెలా గడిపానో..." ఆమె జవాబివ్వటం నచ్చని మన్‌మోహన్ మరింత క్రోధంతో, "ఒక్క మాటకి సమాధానం చెప్పు! ఉద్యోగం వదిలేస్తావా? లేదా? "

"మొదట్లో జీవనాధారం కోసమే ఉద్యోగంలో చేరాను. కాని ఇప్పుడు సమాజసేవ నా జీవితంలోని అంశంగా మారింది. నేను నిస్సహాయ స్థితిలో ఉన్నప్పుడు, మీ తల్లిదండ్రులు నన్ను తృణీకరించి, ఛీత్కరించి, వెళ్ళగొట్టినప్పుడు నా జీవనానికి ఈ ఉద్యోగమే ఆలంబన అయింది. ఈ సంస్థకి నేను రుణపడివున్నాను. దీన్ని నేను వదల్లేను. నా శీలాన్ని శంకించి నిందించిన ఇంటికి నేను రావటం మూర్ఖత్వమే అవుతుంది. నాకు మీరు కావాలి. మిమ్మల్ని స్వీకరించడానికి సిద్ధంగా ఉన్నాను. మాతోపాటు ఇక్కడే ఉండండి. చూడాలన్పించినప్పుడు మీ అమ్మా నాన్నల్ని చూసిరండి" అంది సీమ నచ్చచెపుతూ.

"నా కిష్టంలేదు" అంటూ మెరుపువేగంతో వెళ్ళిపోయాడు మన్‌మోహన్.

"నాన్నగారూ! నాన్నగారూ!" అంటూ కామిని వెనకే పరుగెత్తుతున్నా ఆ పిలుపుని విన్పించుకోలేదు.

★ ★ ★

భిక్షగాళ్ల సమస్యకు పరిష్కారం కనుగొన్న తరువాత సీమలోని ఉత్సాహం మరింత పెరిగింది. ఆమె మనసులో మరో ప్రణాళిక రూపుదిద్దుకుంటోంది. ఈ ప్రణాళిక మహిళకు సంబంధించింది. దీనిని ప్రారంభించడానికి దుర్లభసింహ అనుమతి అవసరం. అందుకోసం ఆమె దుర్లభసింహ కార్యాలయానికి వెళ్ళింది. దుర్లభసింహ మొదటి నుండీ సీమ చేస్తున్న సామాజికసేవను పరిశీలిస్తూనే ఉన్నాడు. ఆమె ఏ పని చేసినా దళితులకు ఉపయోగకరమైనదే చేస్తుందని ఆయన నమ్ముతాడు. ఆయనకి సీమ రూపొందించిన కొత్త ఆలోచన, ప్రణాళిక నచ్చి వెంటనే తన ఆమోదముద్రవేశాడు. ఆ ప్రణాళికని అభినందిస్తూ, "మన దేశంలో మహిళల జనసంఖ్య సగానికి పైగా ఉంది.

కాని దురదృష్టవశాత్తూ ఇవాళ్టివరకూ వారి సమస్యల్ని లోతుగా, క్షుణ్ణంగా పరిశీలించేం దుకు, పరిష్కారం కనుగొనేందుకూ మనం దృష్టి సారించలేదు..." అన్నాడాయన.

"పురుష ప్రపంచంలో ఇలా జరగడం ఆశ్చర్యకరమేం కాదు..." అంది సీమ చిరు నవ్వుతో.

సీమ మాటల్ని అర్థం చేసుకోవటంలో ఆలస్యమేం కాలేదు దుర్లభసింహకి.

"ఈ పథకం ఆచరణకి వచ్చాక ఇప్పుడు స్త్రీలు చేస్తున్న ఫిర్యాదులు మగవాళ్లు చేస్తా రేమో" అన్నాడు.

"అలా ఎన్నటికీ జరగదు. పురుషునితో పోల్చితే స్త్రీ న్యాయవంతురాలే అయిఉం టుంది" అంది సీమ.

దుర్లభసింహ అనుభవజ్ఞుడైన అధికారి. ఆయన కాస్సేపు ఆలోచించి, "మహిళల సమస్యల్ని క్షుణ్ణంగా, అధ్యయనం చేశాక నాకు చెప్పాలి సుమా! ఈ సమస్యలపట్ల పురుషులు ఎక్కువ స్పందిస్తున్నారా? స్త్రీలా అనీ, పురుషుడు ఎక్కువ అన్యాయం చేస్తు న్నాడా, స్త్రీయే స్త్రీకి అన్యాయం చేస్తోందా అనీ నిర్ధారించాలి!" అన్నాడు నవ్వుతూ.

"నా ఆశీస్సులు, శుభాకాంక్షలు నీతో ఉంటాయి. నీవు పథకాన్ని ఆచరించడం ప్రారంభించు" అన్నాడు మళ్ళీ తనే.

"చాలా చాలా థ్యాంక్స్ సార్! మీ నేతృ త్వంలో ఒక సమితి ఏర్పడాలని నా అభి ప్రాయం. వకీలు, సమాజసేవకుడు, అధ్యా పకుడు, పోలీసు అధికారి, ఇంకా ఇతర సంస్థలతో సత్సంబంధాలు గల ప్రముఖులు కొందరు ఈ సంస్థలో సభ్యులుగా ఉండాలి. నేను పోలీసు అధికారులుండాలని ఎందు కంటున్నానంటే మనం రూపొందించిన పథకం ఆచరణలో పెడుతున్నప్పుడు అనేక సమస్యలు ఎదురవుతాయి. అప్పుడు పోలీ సుల సహాయం అవసరమవుతుంది"

"నీ ఆలోచనని బలపరుస్తున్నాను. ఒకటి రెండు రోజుల్లో కమిటీని ఏర్పాటు చేస్తాను. ఈ సమితిలోకి పెట్టుబడిదారులైన ధనవం తుల్నీ, పారిశ్రామికవేత్తల్నీ కూడా ఆహ్వాని స్తాను. నిజానికి మనకు ఆర్థికంగా లోటేమీ లేదు. కానీ సంస్థ ప్రయోజనాలకు, కార్యాచ రణకు, ప్రభుత్వాలతో లావాదేవీలకీ డబ్బు అవసరమని నీకు తెలిసిందేకదా!"

"మీరంటున్నది నిజమే! నేను కూడా ఈ పనికోసం సామాజిక కార్యకర్తల్ని పిలిచి క్లబ్బును ఏర్పాటుచేసి మీ పర్యవేక్షణలో పని ప్రారంభిస్తాను"

"క్లబ్బు అనే పదం విని ఇదేదో పేకాట లతో, డాన్సులతో, తాగుళ్ళతో సాగే మనో రంజక సంస్థ అనుకుంటారేమో...?"

"సంస్థ విలువ పెరిగేది చేపడుతున్న మంచిపనులవలనగాని పేరుతో కాదు. ఏ పేరైతేనేం? 'క్లబ్బు' అనే పదం అభ్యంతర కరంగా ఉంటే మరో పేరు పెడదాం...!"

"నీవు నీ పథకం ప్రకారం పనులు ప్రారం భించు. నీ సంస్థ సాధించే సత్ఫలితాలు, ప్రయోజనాలు ముఖ్యం కానీ పేరు కాదు"

సీమ దుర్లభసింహకు నమస్కరించి శలవు తీసుకుంది. 'సమాజకళ్యాణ కేంద్రా' నికి చేరుకుని తన పథకం రూపొందించుకో వడంలో నిమగ్నమైంది.

సీమ వెళ్ళిన తరవాత దుర్లభసింహ కూడా సంస్థ నిర్మాణం కోసం అవసరమైన తనవంతు పనులు ప్రారంభించాడు. ఆయన సీమను గురించి ఆలోచిస్తూ మన సులోనే అభినందించాడు. 'అబ్బ! ఎలాంటి యువతి? ఎటువంటి మేధస్సు? రోజూ ఏదోఒక పథకాన్ని రూపొందించి ఎదుట పెడుతుంది. ఎంత ఏకాగ్రత ఉందీమెలో? ఇలాంటి వజ్రం విలువ తెలుసుకోలేని ఆమె అత్తింటివారు ఎంత దౌర్భాగ్యులోకదా..." అనుకున్నాడు.

సీమ తన ఆఫీసులో కూర్చొని ఉంది. ఉదయం పది గంటలవుతోంది. టెలీఫోన్ మోగింది. అవతలివైపునుండి ఎవరో ఆందో

ళనగా చెబుతున్నారు, "మేడమ్! నేను 'సాకేత్‌కాలనీ'నుండి మాట్లాడుతున్నాను. మా పక్కింట్లో అంటే ఎమ్-72లో ఒక మహిళను తగలబెట్టి చంపేందుకు ప్రయత్నాలు జరిగేయి. ఇక్కడి కాలనీలోని డాక్టర్ ప్రాథమిక చికిత్సచేయడానికి కూడా నిరాకరించాడు. కారణం అడిగితే, "ఇది పోలీస్‌కేసు. ఈమెను ప్రభుత్వ ఆసుపత్రికి తీసుకువెళ్లండి" అన్నాడు. మేం పోలీసులకి వార్త పంపాం. ఎందుకోమరి ఇంకా వాళ్లు రాలేదు. మా పేరు, చిరునామా చెప్పి కష్టాలు కొనితెచ్చుకోదలచుకోలేదు. మీకు విషయం చెప్పేశాం. ఒక సమాజసేవికగా మీరు మీ కర్తవ్యాన్ని నిర్వహిస్తారో లేదో మీ ఇష్టం" అంటూ ఆ వ్యక్తి ఫోన్ పెట్టేశాడు.

సీమ ముగ్గురు నలుగురు సంస్థ సభ్యులకు ఫోన్‌చేసి నేరుగా సాకేత్‌కాలనీ, ఎం-72కి వెంటనే బయల్దేరమని చెప్పింది. తనూ స్వయంగా కార్లో సాకేత్‌కాలనీకి వెళ్లింది. సీమ అక్కడికి చేరుకునేసరికి కొద్ది నిమిషాలకు పూర్వమే పోలీసులు వచ్చారని తెలిసింది. పీడితురాలైన స్త్రీ శరీరం సుమారు ముప్పయి శాతానికి పైగా అగ్నికి ఆహుతైంది. మరికొన్ని నిమిషాల్లో ఆ మహిళను అంబులెన్స్‌లో ప్రభుత్వ ఆసుపత్రికి తీసుకు వెళ్లారు. ఆ మహిళ కుటుంబ సభ్యులతో విషయం ఏమిటో కనుక్కుందామని సీమ ప్రయత్నిస్తూ ఆమె భర్త, అత్తగారి వైపు చూసింది. కానీ వారి ముఖాల్లో సహజమైన గాభరా, భయం, బాధలాంటి చిహ్నాలేవీ కన్పించలేదు.

ఇంతలో దగ్గర్లోని పోలీస్ స్టేషన్‌నుండి ఒక ఇన్స్‌పెక్టర్ విచారణకోసంవచ్చాడు. అతను ఇంట్లోకి రాగానే సీమ బయటికి వచ్చింది. పోలీసు ఎఫ్.ఐ.ఆర్ రాయడం మొదలుపెట్టాడు.

సీమ ఆ ఇంటి చుట్టుపక్కల ఉన్న వారితో మాట్లాడి అసలు సంగతి ఆరాదీయ సాగింది. తమ పేర్లేమిటో చెప్పకుండా అనేకమంది స్త్రీలు, పీడితురాలైన మహిళ బల్వంతకౌర్‌అనీ ఆమెను అత్త, భర్త మరింత కట్నం డబ్బుతెమ్మని ఇన్నాళ్లనుంచి ఎంతగా పీడించేవారో వర్ణించి వర్ణించి చెప్పారు. ఈ కోడలిని అంటే బల్వంతకౌర్‌ని కాల్చిచంపడానికి ఇంతకుముందు కూడా ప్రయత్నించారనీ, కానీ అందులో విఫలమయ్యారనీ చెప్పారు కొందరు. ఆ రోజు బలవంతకౌర్ ఇంటి బయటికి పరుగెత్తుకు రావటంతో చుట్టుపక్కలవాళ్లూ, ఆమె తల్లిదండ్రులూ నచ్చచెప్పి పరిష్కరించారని సీమతో మరికొందరు చెప్పారు. అంతేకాదు బల్వంతకౌర్ చదువుకున్న అమ్మాయనీ, ఎక్కడో ఉద్యోగం చేస్తోందనీ అన్నారు. అయితే ఆమె తల్లిదండ్రులు శ్రీమంతులు కానందున అధిక కట్నం ఇవ్వలేదని తెలిసింది.

ఈ అమానుష కృత్యాలు విని సీమకి తల దిమ్మెక్కినట్లయింది. ఆమెలో ఆలోచనలు చెలరేగాయి.

"ఆడపిల్లని బాగా చదివించడం నేరమా! కట్నంకంటే ఉద్యోగాదాయం తక్కువా? నెలనెలా బల్వంత్‌కౌర్‌కి వచ్చే జీతభత్యాలు పరోక్షంగా వచ్చే కట్నం డబ్బులు కావా? " అనుకుందిసీమ.

"అత్తవారు బల్వంతకౌర్‌ని పెట్టేబాధలు, కాల్చి చంపేందుకు ప్రయత్నించటం ఇవన్నీ సాక్ష్యంగా చెబుతారా? " అని కొందర్ని అడిగిందామె. అందుకు ఎవరూ ముందుకు రాలేదు.

ఇంతలో పోలీసులు తమ విచారణ ముగించారు. పోలీస్ స్టేషన్‌కి వెళ్తూ పోలీస్ ఇన్స్‌పెక్టర్ బలవంతకౌర్ అత్తనూ, భర్తనూ తనతో తీసుకువెళ్లాడు.

సీమ, ఆమె అనుచరులు ఇక తాము అక్కడ ఉండటం అనవసరం అనుకున్నారు. వాళ్లు అక్కడినుండి బయల్దేరి దుర్గభసింహ కార్యాలయానికి వచ్చారు. సంఘ

టనకు సంబంధించిన పూర్తి వివరాలు ఆయనకి చెప్పారు. ఈ సమస్య గురించి చర్చించాలని మర్నాడు మీటింగ్ ఏర్పాటు చేశాడు దుర్లభసింహ. ఈ మీటింగ్‌లో సీమ, ఆమె అనుచరులు బల్వంత్‌కౌర్ పొరుగువారు చెప్పిన అంశాలను మళ్లీ చెప్పారు. కమిటీలోని అడ్వొకేట్ సభ్యుడు వెళ్లి బల్వంతకౌర్ తల్లిదండ్రుల్ని కలిసి కమిటీ సభ్యుల తరపున అంటే సంస్థ తరపున వారికి ధైర్యం చెప్పి, ఆర్థికంగా, వృత్తిపరంగా సహాయం అందిస్తామని చెప్పాలని ఆ మీటింగ్‌లో నిర్ణయించారు.

అడ్వొకేట్ బల్వంతకౌర్ తల్లిదండ్రుల్ని కలుసుకున్నాడు. పీడితురాలైన తమ కూతురి బాధల్ని, ఆమె అనుభవిస్తున్న చిత్రహింసల్నీ చెప్పి వాళ్లు ఏడవసాగారు. అనునయించిన మీదట తమ కూతురి అత్తవారికి చట్టం ఏమిటో, శిక్షలేమిటో రుచిచూపించి తీరాలన్నారు. ఇందుకు అవసరమైతే తమ సామాను అమ్మైనాసరే డబ్బిస్తామన్నారు. అడ్వొకేట్ మధ్యలోనే కల్పించుకుని అవేమీ అవసరం లేదనీ, కోర్టులో కేసు ఉన్నరోజు వెనక్కి తగ్గకుండా వస్తేచాలనీ చెప్పాడు. "సూర్యుడు పడమర ఉదయించినా మా నిర్ణయం మారదు. వాళ్లకి బుద్ధి చెప్పాల్సిందే" అన్నారు బల్వంత్‌కౌర్ తల్లిదండ్రులు.

పోలీసులు కోర్టులో కేసుదాఖలు చేశారు. విచారణ రోజురానేవచ్చింది. కేసును చర్చిస్తూ వకీలు, "యువరానర్! ఇది అత్యాచారాలకేసు. బల్వంతకౌర్ అందమైన చదువుకున్న ఉద్యోగస్థురాలైన మహిళ. ఆమె భర్త, అత్తగారి వరకట్నదాహాన్ని ఆమె తల్లిదండ్రులు తీర్చలేకపోయారు. అందుకే ఆమెను అత్త, భర్త చంపాలని ప్రయత్నించారు. అదృష్టవశాత్తూ ఆమె మృత్యువు నుండి తప్పించుకుంది. అందుకే అపరాధులు ఐ.పి.సి. సెక్షన్ 299, సెక్షన్ 304 ప్రకారం దండనకు అర్హులు. సెక్షన్ 299లో స్పష్టంగా ఉంది.

ఎవరినైనా చంపాలని ఉద్దేశపూర్వకంగాగానీ లేక గాయాలు చేసి మృత్యువాత పడేలా చేసిగానీ వారి మరణానికి ప్రత్యక్షంగా, పరోక్షంగా కారణమైనా అది నేరమనీ, ఈ అపరాధానికి ఐ.పి.సి. సెక్షన్ 304 ప్రకారం జీవితఖైదు విధించాలనీ చెపుతోంది.

మిలార్డ్, 304 సెక్షన్ ప్రకారం అపరాధులకి కఠినాతి కఠిన దండన విధించాలనీ, దీనివలన మిగతావారికి గుణపాఠం లభించి కాబోయే నేరస్థుల్ని తగ్గించవలసిందిగా కోర్టువారిని ప్రార్థిస్తున్నాను" అంటూ తన వాదన ముగించాడు.

ప్రతి పక్షాల వకీలు బల్వంత్‌కౌర్ భర్తనీ, అత్తనీ ప్రశ్నించాడు. తల్లీకొడుకులిద్దరూ ఒకే సమాధానం ఇచ్చారు. బల్వంత్‌కౌర్ వంటింట్లో పనిచేస్తోంది. ఆకస్మికంగా ఆమె బట్టలకు నిప్పంటుకుంది. ఈ మంటలతో ఆమె ఒళ్లు కాలిపోయింది. ఈ విపత్తు సంభవించినప్పుడు తామిద్దరూ ఇంటి డాబామీద పనిచేస్తున్నారు. తాము కిందికి దిగివచ్చాకే ఈ విషయం తెలిసింది.

ఇదంతా విన్న తరువాత మరో వకీలు బల్వంత్‌కౌర్‌ని ప్రశ్నించాడు. "ఎవరైనా నిన్ను కాల్చడానికి ప్రయత్నించారా లేక నీవే ఆత్మహత్య చేసుకునేందుకు ప్రయత్నించావా లేక అకస్మాత్తుగా జరిగిన సంఘటనా?" అని.

"వంటింట్లో పని చూస్తున్నాను. నా బట్టలకు ఆకస్మికంగా నిప్పంటుకుంది. అంతే తప్ప ఈ దుర్ఘటనకు ఎవరూ బాధ్యులు కారు" అని బల్వంత్‌కౌర్ చెప్పింది. ఇది వినగానే జడ్జీగారు కేసుకొట్టేసి బల్వంతకౌర్ అత్తగారినీ, భర్తనీ నిర్దోషులని నిర్ధారించి వదిలేశారు.

బల్వంత్‌కౌర్ సాక్ష్యం విని సమాజకళ్యాణకేంద్ర వకీలు, సభ్యులందరూ నివ్వెరపో

యారు.

బల్వంత్‌కౌర్‌ని ఆస్పత్రిలో చేర్చగానే ఆమె భర్త ఆమె తల్లిదండ్రుల దగ్గరికి వెళ్లి తనను క్షమించమని వేడుకున్నాడు. ఇకపైన తను తన భార్యను బాధించననీ, సముచితంగా వ్యవహరిస్తాననీ మాటిచ్చాడు.

బల్వంత్‌కౌర్ తల్లిదండ్రులు కాసేపు తమలో తాము చర్చించుకున్నారు. అమ్మాయి తమ ఇంట్లోనే ఉంటే లోకులు విమర్శించేవీలుంది. బిడ్డని ఇంట్లో పెట్టుకుని బాధపడటంకంటే రాజీపడటమే మంచిదని నిర్ణయించుకున్నారు. అందుకే కూతురి దగ్గరికివెళ్లి కోర్టులో తప్పుడు సాక్ష్యం చెప్పమని ఒత్తిడిచేశారు. పాపం! బలవంతకౌర్ తల్లిదండ్రులు, అత్తభర్తల ఒత్తిళ్లకి లొంగిపోయి వివశురాలై తప్పుడు సాక్ష్యం చెప్పకతప్పలేదు.

కోర్టునుండి బయటికి వచ్చాక బలవంత కౌర్, ఆమె తల్లిదండ్రులు సమాజకళ్యాణ కేంద్ర సభ్యుల ఎదుట నిల్చోడానికి కూడా తాము అనర్హులమని భావించి సిగ్గుతో అక్కడినుంచి వడివడిగా వెళ్లిపోయారు.

★ ★ ★

ఆరోజు సీమ తన ఆఫీస్‌లో సోషల్ వర్కర్స్ క్లబ్బు మీటింగ్ నిర్వహిస్తోంది. అప్పుడే హమీదా సీమను కలుసుకుని తన విషయం చెప్పుకోవాలని అక్కడికి వచ్చింది. సీమకు క్లబ్బు సభ్యులు అందరి ఎదుటా ఆమె తన కరుణామయ గాథ చెప్పుకుంది. భర్త ఆమెను రోజూ కొడుతుంటాడు. తంతాడు. జుట్టుపీకుతాడు. కర్రలతో కొడతాడు. అతని దురంతాల్ని ఇక భరించటం తనవల్లకాదని విలపించింది హమీదా.

క్లబ్బు సభ్యుడు ఆమెను అనునయించి, "ఏమమ్మా! అతను తాగుతాడా" అన్నాడు.

"ఔను బాబుగారూ! చాలా తాగుతాడు. తాగినప్పుడెప్పుడూ నన్ను కొట్టలేదు. నిషాలో మునిగిన వ్యక్తి మృతునిలా పడి వుంటాడు. అంతేతప్ప ఏం చేయగలడు? ". అంది.

"నీ భర్త నిన్ను హింసిస్తున్నప్పుడు మీ అత్తగారి స్పందన ఎలా ఉంటుంది? " అడిగాడు క్లబ్బు సభ్యుడు మరొకతను.

"ఆమె కొడుకువైపే ఉంటుంది" చెప్పింది హమీదా.

"ఒక మనిషిపై అత్యాచారం జరుగుతూ ఉంటే ఆమెను రక్షించేందుకు ప్రయత్నించక పోగా హింసిస్తున్నతని పక్షం వహించటం అన్యాయం" అందొక సభ్యురాలు.

"మామామగారు కూడా మా అత్తగార్ని కొట్టేవాడట! అందుకే ఇది ఆమెకు తప్పుగా తోచదు" అంది హమీదా.

"అయితే ఇది తండ్రిని చూసి అలవడిందన్నమాట!" అందొక సభ్యురాలు.

"మనం హమీదా భర్తనీ, అత్తనీ కలుసుకుని చర్చించాలి" అంది సీమ.

"అమ్మగారూ! నేనిక్కడికి వచ్చినట్లు మావాళ్లకు చెప్పకండి. వాళ్లపై ఫిర్యాదు చేశానని నన్ను చితక బాదుతారు. ఇవాళ వాళ్లిద్దరూ ఇంట్లో లేకపోవటంతో ఇలా వచ్చాను" భయం తొంగిచూస్తోంది హమీదా స్వరంలో.

సీమ నవ్వింది. ఆమెకి అభయమిస్తున్నట్లుగా భుజం తట్టి, "అలాగే! నీవిలా వచ్చావని అనుమానం కూడా రాకుండా మాట్లాడతాం. సరేనా? "

వెళ్తానని లేచిన హమీదా ఇంకేదో గుర్తొచ్చి ఆగిపోయింది.

"నాకు వరుసగా ఇద్దరూ ఆడపిల్లలే పుట్టారనీ, మగపిల్లవాడు కలగలేదనీ రుసరుసలాడుతుంటారు" అంది.

"బావుంది! అందులో నీ తప్పేం ఉంది? " తేల్చేశారందరూ.

★ ★ ★

సమాజకళ్యాణకేంద్రం నుండి బయల్దేరి హమీదా నేరుగా తన తండ్రి దగ్గరికి

వెళ్లింది. కాస్సేపు పిచ్చాపాటీ మాట్లాడాక తన గోడు వెళ్లబోసుకుని కన్నీరు పెట్టుకుంది. అయినా దుఃఖం ఆపుకోలేకపోయాడు. కొంతసేపయ్యాక కూతుర్ని ఓదార్చి "చూడమ్మా! వాళ్లతో రాజీపడేందుకే నువ్వు ప్రయత్నించు. మన సమాజంలో అత్తిల్లు వదిలిన స్త్రీకి విలువుండదు. మెట్టినింటినుండే అమ్మాయి శవం కదలాలి గానీ మరోరకంగా జరగకూడదు" అన్నాడు.

హమీదా తండ్రి వద్ద శలవు తీసుకుని బయల్దేరింది. తండ్రినుండి ఓదార్పులభించిందేగాని ధైర్యం నూరిపోయలేదాయన. శోకసంతప్తురాలిగానే తిరిగొచ్చిన హమీదాకు సీమ చీకట్లో చిరుదివ్వెలా భాసించింది.

ముందుగా హమీదా అత్తగారితో చర్చించాలని క్లబ్బు సభ్యులు నిర్ణయించారు. కొడుకుకంటే తల్లికి నచ్చచెప్పటం సులువ న్పించింది.



త్వరగా పరిష్కారం లభిస్తుందనుకున్నారు.

నాలుగు రోజుల అనంతరం హమీదా అత్తగారిని సమాజకళ్యాణకేంద్రానికి పిలిపించారు. హమీదా అత్తగారు విషయం విని ఇంతెత్తున లేచింది. తమని ఇక్కడిదాకా లాగిన కోడలు ఎదుటే వుంటే కాల్చి పారెయ్యాలన్నంత కోపం వచ్చిందామెకు.

"చూడమ్మా! మీరలా కోపగించుకుంటే లాభంలేదు. హమీదా సమస్యను మనం సామరస్యంతో పరిష్కరిద్దాం" అంది సీమ.

"మీరలాగే అంటారు. దాని ప్రవర్తన గురించి మీకేం తెలుసు? మొగుడు కూర్చోమంటేనే కూర్చోవాలి. లేకుంటేలేదు. అదేం చేస్తుందో తెలుసా? అతని ఎదుటే కుర్చీలో కూర్చొంటుంది. నేను అక్కడే ఉన్నా సిగ్గూ ఎగ్గూ లేకుండా వాడి పక్కన కూర్చుంటుంది. నేను తన అత్తగారినన్న భయమూ, భక్తీ దాని కేమైనా ఏడిశాయా అంట? నా ఎదుటే కాలుమీద కాలేసుకుని దర్జాగా కూర్చొంటుంది. వేళకు నాకు టీ ఇవ్వదు. స్నానానికి నీళ్లు తోడదు. మా అబ్బాయి ఇంటికి రావటం ఆలస్యమైతే అతనొచ్చేవరకు ఆగకుండా భోంచేస్తుంది. ఇవన్నీ మంచివారి లక్షణాలేనా?"

"మీ కూతురు మీ ఎదుట కాలుపైన కాలు వేసుకుని కూర్చోదా"

"కూతురి విషయం వేరు..." అంది హమీదా అత్తగారు.

"కూతురి విషయం వేరే ఎలా అవుతుంది? ఇద్దరూ స్త్రీలే! ఇద్దరూ తల్లిదం



డ్రుల్ని వదిలి అత్తగారిళ్ళకు మెట్టినవారే! ఇద్దరూ అత్తగారింటి వాళ్ళనుండి ప్రేమాభిమానాలను కాంక్షించేవారే!"

"మీరెన్నైనా చెప్పండి! కూతురు కూతురే! కోడలు కోడలే!"

ఆమెకు నచ్చచెప్పడం వ్యర్థమని క్లబ్బు సభ్యులకు అర్థమైపోయింది.

హమీదా అత్తగారికి కూడా గందరగోళంగా ఉంది. ఇంకేం మాట్లాడితే ఎటు దారితీస్తారో? ఏ మాటకు ఏం అర్థం చెబుతారో... వెంటనే ఇక్కడినుండి వెళ్ళిపోవటం వినా మరో మార్గం కన్పించలేదు. "ఇంట్లో బోల్డంత పని ఉంది వస్తా..." అంటూ బయటకి నడిచిందామె అర్థాంతరంగా

అదేరోజు హమీదా భర్తని కూడా సమాజ కళ్యాణ కేంద్రానికి పిలిపించారు. హమీదా భర్తకి ఈ పిలుపుని కాదనగలిగే ధైర్యం లేదు. కళ్యాణ కేంద్రం పేరు అప్పటికే ప్రఖ్యాతి పొందింది. క్లబ్బు సభ్యుల ఎదుట కూర్చోగానే అతను మొదటగా ప్రశ్నించాడు, "ఇంట్లో హమీదాపై అత్యాచారాలు జరుగుతాయని మీకెలా తెలిసింది? " అంటూ.

"నిప్పు రాజుకుంటే పొగవస్తుంది. ఆ పొగ ఇరుగుపొరుగువారికి కనిపిస్తుంది" అందొక సభ్యురాలు.

"మేడమ్! నిప్పు రాజుకుంటే మంటలే వస్తాయి. పొగలు రావు. మంట మండుతుంటే పొగవచ్చే ప్రశ్నేలేదు. మా ఇరుగు-

పొరుగు వారివల్ల మీరు విన్నదంతా అబద్ధం. మీరు నమ్మకండి" అన్నాడు హమీదా భర్త.

"నేను స్వయంగా హమీదా వంటిపైన దెబ్బల చిహ్నాలు చూశాను. ఎదుటి వ్యక్తిని కొట్టటం, హింసించటం నేరం. ఇలా చేసిన మిమ్మల్ని చట్టం అపరాధిగా పరిగణిస్తుంది. భార్యను ప్రేమగా చూడటం, అన్నిరకాలుగా ఆమెకు రక్షణ కల్పించటం భర్త ధర్మం. తల్లిదండ్రుల్ని విడిచి వచ్చానన్న వెలితిని, బాధను ఆమె మరిచిపోయేలా అతను వ్యవహరించాలి" అంది సీమ.

"ఓహో అలాగా! మీరు నాకు కర్తవ్య బోధ చేస్తున్నారా? బెదిరిస్తున్నారా?" అన్నాడు ఆవేశంతో.

"చూడండి! మీరు తెలివైనవారు, బుద్ధిమంతులు. మేం కేవలం మీకు సూచన అందిస్తున్నాం. ప్రవర్తనలో కొంచెం మార్పు తీసుకురాగలిగితే నరకప్రాయంగా ఉన్న జీవితం స్వర్గధామం అవుతుంది" అంది సీమ.

హమీదా భర్త లేచి నిల్చున్నాడు. వెళ్ళిపోతూ, "నేను మీ సలహాను గురించి ఆలోచిస్తాను" అంటూ బయటపడ్డాడు.

హమీదా భర్త, అత్త ఇకపైన ఇంట్లో ఆమెపై మరింత విషంచిందే ప్రయత్నాలు చేస్తారని క్లబ్బు సభ్యులకు అర్థమైపోయింది. అందుకే మరో రెండు రోజుల తరువాత పరిస్థితిని పరిశీలించేందుకు క్లబ్బు సభ్యులు కొందరు హమీదా ఇంటివైపు వెళ్ళారు. హమీదా పట్ల అత్తింటి వాళ్ళు మొదటిలాగే వ్యవహరిస్తున్నారా? లేక బాధించటం తగ్గించారా అనే విషయం ఇరుగు పొరుగువారి ద్వారా తెలుసుకోవాలని వాళ్ళు ఆ వీధిలోకి వచ్చేసరికి హమీదా ఇంటి ఎదురుగా జనం గుమిగూడి కనిపించారు. విచారించగా హమీదా భర్త హమీదాకి వాతలు పెట్టాడనీ ఆమె అరుపులు విని జనం చుట్టుముట్టారే తప్ప ఎవరూ ఈ దురంతాన్ని అడ్డుకోలేదనీ తెలిసింది.

సీమ, మరికొందరు క్లబ్ మహిళా సభ్యులు కలిసి హమీదా ఇంట్లోకి వెళ్లారు. సీమ హమీదా భర్తని సంబోధిస్తూ,

"భార్యపైగానీ మరో స్త్రీపైగానీ అత్యాచారాలు చేస్తే మూడేళ్ళ కఠినకారాగారవాస శిక్ష పడుతుందని మీకు తెలుసు. ఇండియన్ పీనల్ కోడ్ 498(ఎ) ప్రకారం హమీదాని చిత్రహింసలపాలు చేస్తున్నందుకు మీకే శిక్ష తప్పదు" గర్జించింది సీమ.

సీమ, ఆమె మిత్ర బృందాన్ని చూసిన హమీదా భర్త కంగుతిన్నాడు. వెనకా ముందూ ఏమీ ఆలోచించకుండా, భార్యవైపు చూసి, "నేను నీకు విడాకులిచ్చాను. నేను నీకు విడాకులిచ్చాను. నేను నీకు విడాకులిచ్చాను" అంటూ తలాఖ్ చెప్పేశాడు.

పిడుగుపడ్డట్టుగా చూసింది హమీదా. ఒకటి రెండు నిమిషాల్లో అతన్ని బతిమాలుతూ, "దయచేసి ఇలా చెయ్యకండి. మన ఇద్దరు బిడ్డలపై కనికరం చూపించండి. వీళ్ళని తీసుకుని నేనెక్కడికి వెళ్తాను?" అంటూ ఏడవసాగింది హమీదా.

"మన మతనియమానుసారంగానే నేను నీకు విడాకులిచ్చాను. నీకు ఎక్కడికి వెళ్ళాలనుంటే అక్కడికి వెళ్లవచ్చు. బిడ్డలిద్దరి బాధ్యతా తీసుకుని ఇక్కడి నుంచి వెంటనే వెళ్ళిపో..." కఠినంగా అన్నాడు హమీదా భర్త.

అత్తవారింటి తలుపులు మూసుకున్నాయి. తండ్రి మొదటే రావద్దని చెప్పాడు. ఏం చేయాలో దిక్కుతోచక హమీదా విలపించసాగింది.

మౌనప్రేక్షకురాలే అయి చూస్తున్న సీమకి కర్తవ్యం స్ఫురించింది. కళ్యాణకేంద్రానికి తనతోపాటు రమ్మని హమీదాని ఆహ్వానించింది.

ఇద్దరు బిడ్డల్నీ వెంటబెట్టుకుని హమీదా ఆమె వెంట బయల్దేరింది. హమీదా మానసిక స్థితి ఆక్షణంలో ఎలా ఉందో వర్ణిం

చటం కష్టం.

కళ్యాణ కేంద్ర సభ్యుడొకరికి ఓ కార్ఖానా ఉంది. సీమ హమీదా విషయం చెప్పి ఆమె కేదైనా పని ఇప్పించమని కోరింది. హమీదాని అతను తమ పరిశ్రమలో పనిలోకి చేర్చుకున్నాడు. హమీదా శ్రద్ధగా పనిచేస్తూ అందరిమెప్పులూ పొందసాగింది. ఇప్పుడామె ప్రశాంతజీవనం గడుపుతోంది. తిట్టేవారూ, కొట్టేవారూ లేరు. ఆత్మవిశ్వాసం ఆమెలో రోజురోజుకీ పెరగసాగింది. కళ్యాణకేంద్రానికి వచ్చాకే వాస్తవిక జీవనం ప్రారంభమైన అనుభూతి కలగసాగింది.

సీమ సలహాతో దుర్లభసింహ కళ్యాణ కేంద్రసమితి క్లబ్బు సభ్యులందర్నీ ఒకసారి చర్చాగోష్ఠికి పిలిచాడు. కల్యాణకేంద్రం నిర్వహిస్తున్న విధులగురించి చర్చ జరిగింది.

"మహిళలకు విద్యావకాశాల్ని మెరుగుపరచడానికి తోడ్పడమంటూ ప్రభుత్వంపై వత్తిడి తీసుకువద్దాం. స్త్రీ విద్యావంతురాలైతే తమ అధికారాలు, హక్కులు, చట్టం ఏమిటో తెలుసుకునే వీలుంది. చదువు ఆత్మవిశ్వాసాన్ని పెంచుతుంది. దాని బలంతో సమస్యల్ని ఎవరికి వారే పరిష్కరించుకునే అవకాశం కలుగుతుంది..." అన్నారు కొందరు సభ్యులు.

"బలవంతకౌర్ చదువుకున్న అమ్మాయే కదా! ఆమె తన సమస్యను స్వయంగా పరిష్కరించుకోగలిగిందా? " అన్నాడు ఓ సభ్యుడు.

"సమాజంలో శతాబ్దాల తరబడిగా వస్తున్న ఆచారాలను నమ్మకాలను మార్చడానికి అన్ని కోణాలనుండీ ప్రయత్నించవలసి ఉంటుంది" అంది సీమ.

"పెళ్ళి విషయంలో కొడుకుని అభిప్రాయం అడుగుతారు కాని కూతుర్ని సలహా అడగరు. ధైర్యంచేసి చెప్పినా పట్టించుకోరు. ప్రాచీన కాలాన్ని స్వర్ణయుగమనీ, బంగారు కాలమనీ, గడిచిన రోజులే ఉత్తమమైనవనీ అంటూ ఉంటారు. ఆ కాలంలో రుక్మిణి తండ్రినీ, అన్ననీ ఎదిరించింది. వాళ్ళు నిర్ణయించిన శిశుపాలుడిని వివాహం చేసుకోనని ధైర్యంగా ఎదురు తిరిగింది. మరి నేటి మహిళ ఈ ధైర్యాన్ని ఎందుకు ప్రదర్శించలేకపోతోంది? మహిళకు సహజంగా ఉండవలసిన ఈ హక్కును ఎవరూ లాక్కోనేందుకు వీల్లేదు. వరమాల సదా ఆమె చేతిలో ఉండటం అవసరం" అంది ఒక సభ్యురాలు.

"ఇళ్ళలో స్త్రీలు ఎంతో పనిచేస్తారు. చేయిస్తారు. పర్యవేక్షిస్తారు. ఈ పనికి వేతనం ఉండదు. ఆమె పర్యవేక్షణ వల్ల కలిగే పొదుపు, ఆదాయం చాలా ఉంటుంది. అయినా పురుషుడే స్త్రీని పోషిస్తున్నాడంటాం. ఆమె చేసే చాకిరీకి జీతం నిర్ణయిస్తే పురుషుని జీతంకంటే తక్కువేం ఉండదు. ఈ దృష్టికోణాన్ని మార్చడానికి కళ్యాణ కేంద్రం అనేక సంస్థలతో స్నేహసంబంధాలు పెంచుకుని సంతప్త మహిళలకు కార్యాలయాల్లో, కర్మాగారాల్లో ఉద్యోగాలిప్పించడానికి ప్రయత్నించాలి. వాళ్ళని తమ కాళ్ళపై తాము నిలబడేలా చేయాలి. దీనివలన మహిళలు ఆర్థికంగా పరులపై అధారపడకుండా ఉన్నందున వారిలో ఆత్మవిశ్వాసం పెంపొందుతుంది. రైతులు పురుషులకంటే స్త్రీలకు రోజు కూలీ డబ్బు తక్కువగా చెల్లిస్తుంటారు. ఈ అన్యాయానికి విరుద్ధంగా పోరాడవలసి ఉంది"

సమితిలో సభ్యుడైన ఓ పోలీస్ ఇన్‌స్పెక్టర్ జనరల్ "మహిళా పోలీసుల్ని నియమించమని ప్రభుత్వాన్ని కోరదాం" అన్నాడు

"మహిళల్ని జాగృత పరచడానికి బల్వాంతకౌర్లపై, హమీదాలపై అత్యాచారాలు జరిగినప్పుడు మనం వ్యతిరేక ప్రదర్శనలు నిర్వహించాలి. సమాజం, ప్రభుత్వం స్త్రీకి కావాల్సిన రక్షణ, మనోబలాన్ని, సహకారాన్ని అందించేవరకు మనం పోరాటం సాగిస్తూ

ఉండాలి" అన్నారు ముగ్గురు నలుగురు క్లబ్బు సభ్యులు.

"మీరు పురుషుల చేతుల్లోనుండి అన్ని అధికారాల్నీ లాక్కుని మహిళల చేతికి అప్ప గించేందుకు పథకం వేస్తున్నట్టుందే!" చిరు నవ్వుతో అన్నాడు దుర్లభసింహ.

"అలాంటి ఆలోచనలూ, పథకాలూ ఏమీ లేవు. కానీ ఒక విషయం నేను నమ్మకంగా చెప్పగలను. దేశంలోని విధానసభలను, న్యాయస్థానాల్ని, కార్యాలయాల్ని మహిళలకే అప్పగిస్తే దేశంలో దొంగతనాలు, లూటీలు, బలత్కారాలు మొదలైనవన్నీ సమూలంగా నాశనమవుతాయి. ఎందుకంటే స్త్రీలు ఈ చెడుపనులకు చాలా దూరంగా ఉంటారు గనుక" అంది సీమ.

★ ★ ★

ఓ సాయంసమయంలో సీమ తన కార్యా లయంలో కూర్చుని పని చేసుకుంటోంది. నడివయసు దంపతులు ఆమె దగ్గరికి వచ్చారు. వాళ్లమ్మాయి సూసన్‌కి ఇరవైసం వత్సరాలు. రెండురోజుల కింద వాళ్ళిద్దరూ ఏదో పనిపై పొరుగూరికి వెళ్తూ తమ కుమార్తెను ఆమె చిన్నాయన జేమ్స్ పర్యవే క్షణలో వదిలివెళ్ళారు. వాళ్ళులేని ఈ సమ యంలో జేమ్స్ సూసన్‌పై అత్యాచారం జరి పాడు.

"జేమ్స్ మీ ఇంట్లోనే ఉంటాడా? " అడి గింది సీమ.

"ఇల్లొక్కటే. జేమ్స్‌పై అంతస్థులో వేరే పోర్షన్‌లో ఉంటాడు" అంది సూసన్ తల్లి.

"ఈ అత్యాచారాన్ని మీ పోర్షన్‌లో జరి పాడా? పైన తన పోర్షన్‌లోనా? "

"ఆయన పోర్షన్‌లోనే. సూసన్ భోజనం తీసుకుని పై అంతస్థులో ఉన్న అతని ఇంట్లోకి వెళ్ళినప్పుడు" కళ్ళనీళ్ళ పర్యంతమ వుతూ చెప్పింది సూసన్ తల్లి.

కళ్యాణ కేంద్రంలో సభ్యుడుగా ఉన్న ఓ అడ్వొకేట్‌కు ఫోన్ చేసి ఈ కేసును వివ రించి, సూసన్ తల్లిదండ్రుల్ని తీసుకుని ఆయన ఆఫీసుకు వెళ్ళింది సీమ.

అడ్వొకేట్‌తో జరిగిన ఉదంతాన్ని చెప్పారు భార్యాభర్తలు. అంతా విన్న తరు వాత, "కేసులో కొన్నిలోపాలున్నా, సరైన రీతిలో వాదించిపోరాడితే నేరస్తునికి శిక్ష పడవచ్చు" అన్నాడు వకీలు.

కోర్టులో కేసు వేశారు. కేస్ హియరింగ్ రోజు మహిళా జడ్జిని నియమించారు కోర్టు వారు. తలుపులు మూసిన గదిలో విచా రణ జరిగింది. సూసన్ కేసును వివరిస్తూ వీరి పక్షం వహిస్తున్న వకీలు, జేమ్స్ తన కుటుంబంలోనే, పైగా అన్న కూతురుని బలాత్కారంగా మానభంగం చేశాడు. అన్నావదినలు తమ కూతుర్ని జేమ్స్ సంర క్షణలో విశ్వాసంతో వదిలి రెండు రోజుల పాటు పొరుగూరికి వెళ్ళినప్పుడు అతనీ దుష్కార్యం చేశాడు. ఇండియన్ పీనల్‌కోడ్ 376 (2) (a) (iii) సెక్షన్ ప్రకారం నింది తుడు కఠినశిక్షకు అర్హుడు. అపరాధికి పై సెక్షన్ రూల్స్ ప్రకారం కఠినాతికఠినమైన శిక్ష వేయమని కోర్టువారిని ప్రార్థిస్తున్నాను" అంటూ తన వాదన వినిపించాడు.

జేమ్స్ నియమించుకున్న వకీలు లేచి నిల్చుని, "యువరానర్! ఎదుటిపక్షం వకీలు విషయాలన్నీ వక్రించి చెబుతున్నాడు. నిజా నికి సూసన్ నా క్లయింటును సంభోగానికి ఆహ్వానించగా ఇతను నిరాకరించాడు. తల్లి దండ్రుల ప్రోత్సాహంతోటే సూసన్ అలా ప్రవర్తించిందని నా క్లయింట్ అనుమానం. జేమ్స్ ఉంటున్న ఇల్లు అన్నదమ్ములిద్దరి ఆస్తి. సామ, దాన, దండ, భేదోపాయాలతో జేమ్స్‌ని ఆ ఇంట్లోనుండి వెళ్ళగొడితే సంప దంతా అన్నగారికే దక్కుతుంది. అందుకే ఈ పన్నాగం పన్నారు. ఎలాగైనా జేమ్స్‌ని ఇంట్లోనుండి వెళ్ళగొట్టాలన్న దురుద్దేశం తోనే సూసన్ తల్లిదండ్రులు ఆమెను జేమ్స్ పైకి ఉసిగొలిపి నాటకీయంగా రెండురో

జులు పొరుగూరికి వెళ్ళారు..." అంటూ తన వాదన విన్పించాడు జేమ్స్ తరపు న్యాయవాది.

కక్షిదారు తరపు న్యాయవాది మాట్లాడుతూ, "ప్రతిపక్షాల న్యాయవాది తన కల్పనా చాతుర్యంతో ఒక కొత్త కథ తయారుచేసి కోర్టును పెడదోవ పట్టిస్తున్నాడు. యువరానర్! మనకందరికీ తెలుసు, 'క్రైమ్ ఇన్ ఇండియా' ప్రకారం మనదేశంలో ప్రతి సంవత్సరం సుమారు 8 వేల 'బలత్కారం' కేసులు నమోదవుతున్నాయి. అంటే ప్రతి గంటకూ ఇలాంటి కేసులు జరుగుతున్నాయి. ఇవి ప్రభుత్వ రికార్డుల కెక్కిన అంకెలు. సామాజిక కారణాలవలన, పరువు పోతుందన్న భయాలవలన మరెన్నో కేసులు వెలుగుచూడటం లేదు. కోర్టుదాకా వస్తున్న కేసులకంటే రానివే అనేక రెట్లు ఉంటాయి. మనదేశంలో అవివాహితకు బలాత్కార సంఘటన జరిగితే ఆమె జీవితానికే మాయని కళంకం ఏర్పడుతుంది. ఆమెకు పెళ్ళవటం అసంభవమవుతుంది. అందుకే తల్లిదండ్రులు లోలోపలే ఏడ్చి ఊరుకుంటారు తప్పితే అల్లరి చెయ్యరు. వీధికెక్కరు. అందుకే యువరానర్! నేరస్థునికి పదేళ్ళ కారాగారవాస శిక్ష విధించమని నా ప్రార్థన" అంటూ తన వాదన ముగించేడు.

ప్రతికక్షిదారు న్యాయవాది లేచి నిల్చుని, "మానభంగం కేసు నిందితురాలు సూసన్ సంఘటన జరిగినట్లు చెబుతున్న రోజుకి నాలుగు రోజుల తరువాత పోలీస్‌స్టేషన్‌లో ఎఫ్.ఐ.ఆర్. రాశారు. నా క్లయింటును అపహాస్యంపాలు చేయడానికే సూసన్ తల్లిదండ్రులు పథకం వేశారనడానికిదే నిదర్శనం. కక్షిదారు వకీలు నా క్లయింటుకు వ్యతిరేకంగా ఒక్క సాక్ష్యాన్ని కూడా చూపలేదు. జేమ్స్ తనని బలాత్కారం చేశాడని సూసన్ అంటోంది. ఇది ఆమె ఆరోపించిన అభియోగమైతే, తను సూసన్‌ను బలాత్కారమే చేయలేదని నా క్లయింట్ చెబుతున్నాడు. సూసన్ ఆరోపణ ఆధారంగా నా క్లయింటును నేరస్థుడనటం న్యాయం దృష్టిలో నేరమే అవుతుంది..." అని వాదించాడు.

కక్షిదారు వకీలు లేచి, "యువరానర్! ఎవరైనా స్త్రీ తనపై బలాత్కారం జరిగిందని ఆరోపిస్తే తను అలా చేయలేదని ప్రతివాది సాక్ష్యం చూపాలి. సంఘటన జరిగిందని చెబుతున్న సమయంలో తను ఆ స్థలంలో లేనని నిరూపించుకోవచ్చు. అంతే తప్ప వాదినే రుజువు చేయమనటం ఏమిటో ఆయనకే తెలియాలి"

ఉభయవాదనలు విన్న జడ్జీగారు "ఈ వాదనలు ఇక సమాప్తం చేస్తున్నాం. వాదినీ, ప్రతివాదినీ వేరువేరుగా ఏకాంతంలో కలుసుకుని చర్చిస్తాను. కేసు నిర్ణయం రేపు విన్పిస్తాను" అనటంతో ఎక్కడివారక్కడ వెళ్ళిపోయారు. జడ్జీగారు సూసన్‌తో, జేమ్స్‌తో విడివిడిగా కలుసుకుని మాట్లాడటం జరిగింది.

మర్నాడు కేసుకు సంబంధించిన తీర్పిస్తూ, "నేను ముందుగా వాది సూసన్‌తోనూ, తరువాత ప్రతివాది జేమ్స్‌తోనూ విడివిడిగానూ, ఇద్దర్నీ కూర్చోబెట్టి మాట్లాడాను. ఇరువర్గాల వకీళ్ళ వాదనలూ గమనించాను. ప్రతివాది జేమ్స్ తన నేరాన్ని అంగీకరించాడు. అయితే తను వాది ఆహ్వానం మేరకే, అంగీకారం మేరకే చేశాననీ, అందుకే ఆమె తనకు తానుగా తన నివాసానికి వచ్చిందనీ, తను ఆమె ఉంటున్న చోటికి వెళ్ళలేదనీ చెప్పాడు. సూసన్ తల్లిదండ్రులు డాక్టర్‌తో పరీక్ష చేయించకుండా, ఆలస్యంగా ఎఫ్.ఐ.ఆర్. రాయించి పొరపాటు చేశారు. డాక్టర్ పరీక్షిస్తే ఇది బలాత్కారం చేసిన కేసా లేక వాది ప్రతివాదులిద్దరి అంగీకారం మేరకే జరిగిందా అనేది ధృవపడుతుంది. పూర్వాపరాలన్నీ పరిశీలించి ఆలోచించాక కోర్టువారు

జేమ్స్‌కి ఐదు సంవత్సరాల కారాగారవాస శిక్ష విధించడమైనది. జడ్జీగారు లేచి తన యాంటీ చాంబర్‌లోకి వెళ్ళారు. జేమ్స్‌ని పోలీసులు బంధించి తీసుకువెళ్ళటంతో సీమ, ఆమె మిత్రవర్గమంతా కోర్టు నిర్ణయాన్ని హర్షించారు.



లక్నోలోని స్థానికులకేగాక పరిసర ప్రాంతాల్లోని అనేక గ్రామాలకు సీమ పేరు ప్రఖ్యాతులు వ్యాపించాయి. నగరంలో ఉన్న అనేక సంస్థలు నిర్వహించే కార్యక్రమాల్లో, సభల్లో ఆమె పాల్గొనేది. సమాజ సేవికకు కార్యక్షేత్రం ఆఫీసు గది కాదనీ, జనం మధ్యకు వెళ్తేనే అందరి మంచి చెడ్డలు తెలిసే వీలుందని సీమకి అర్థమైపోయింది. ఆమె సాఫల్య రహస్యం ఇదే. సాక్షరత, జాతిఐక్యత, వరకట్న నిషేధం, బాలకార్మికుల వెట్టిచాకిరి తదితర అనేక అంశాలతో కూడిన కార్యక్రమాలలో ఆమె చురుగ్గా పాల్గొంటూంది. ప్రభుత్వోద్యోగులు, ప్రభుత్వేతరులు, పిన్నా పెద్దా అందరూ ఆమెను అభిమానించసాగారు. స్వార్థరహితంగా చేసేపని విలువ ఎలాంటిదో సీమపట్ల జనం చూపే ఆదరణను చూస్తే తెలుస్తుంది. ఆమె తననుతాను ఎంత బిజీగా ఉంచుకుంటున్నప్పటికీ మనసులో ఒంటరితనం నిరంతరం బాధిస్తూనే ఉండేది.

ఎప్పటిలాగే తెల్లవారుతోంది. పొద్దు వాలుతోంది. అలాగే వయసంతా గడిచిపోతోంది. సుప్రసిద్ధ ఆంగ్ల రచయిత రాబర్ట్ ఫ్రాస్ట్ రాసిన పంక్తుల అనువాదం తన టేబుల్‌పై రాసి పెట్టుకుంది సీమ.

"అడవి చక్కగా, పచ్చగా అందంగా ఉంది. కాని నేను నా మానవజాతిపట్ల నా బాధ్యతలు నిర్వహించాల్సిన ముఖ్యమైన పని మిగిలిపోయింది. నా జీవితంలోని అంతిమ అధ్యాయం రాయడానికీ, చిరనిద్రలోకి వెళ్ళడానికీ ముందే అనేక మైళ్లదూరం ప్రయాణించవలసివుంది"

సీమ పొద్దున్నే లేచేది. స్నానాదులు ముగించి కొంతసేపు సమాజ కళ్యాణ కేంద్రంలో పనులు చూసుకునేది. తరువాత ఫీల్డ్ వర్క్‌కోసం వెళ్ళేది. మధ్యాహ్నం తరువాత కేంద్రానికి వచ్చి అక్కడ నివసిస్తున్న వారి, అక్కడి ఉద్యోగుల మంచిచెడ్డలు విచారిస్తూ గడిపేది. ఈరోజు కామినిని కూడా తనతోపాటు తీసుకుని రైల్వేస్టేషన్‌కు వెళ్ళింది. ఆమె ఆంతరంగిక మిత్రురాలు నిర్మల ఉరఫ్ సుభద్ర హైదరాబాద్‌నుండి వస్తోంది. వీళ్లు వెళ్ళిన ఐదు నిమిషాలకు రైలు వచ్చేసింది. రైలు దిగిన సుభద్ర సీమను అమాంతం వాటేసుకుంది. ఆత్మీయత, భావుకత, స్నేహం కలబోసుకున్న వారి కలయిక చూసి తీరాల్సిందేనన్నంత అపూర్వంగా ఉంది దృశ్యం. ఇద్దరి కళ్లూ వర్షిస్తున్నాయి. కామినిని ప్రేమగా ఎత్తుకుని ముద్దులాడింది సుభద్ర. వీరి స్నేహాన్ని, అనురాగాన్ని సంభ్రమంగా చూడసాగాడు నీరజ్. నీరజ్ సీమల పరస్పర పరిచయాలయ్యాక తను ఉండే కల్యాణకేంద్రానికి వారిని తీసుకువచ్చింది సీమ. రాత్రికి నీరజ్ పడుకున్నాక సుభద్ర, సీమలు చాలా సేపటివరకు మాటల్లో గడిపారు. వాళ్ళు నిద్రకు ఉపక్రమించేసరికి సమయం రెండయింది.

మర్నాడు పదకొండు గంటలైఉంటుంది. నగరానికి ఏడు మైళ్ల దూరంలో ఉన్న ఓ గ్రామంలో ఘర్షణలు జరుగుతున్నాయని

తెలిసింది. సుభద్రకు చెప్పి తనూ వస్తా
నన్న ఆమెను వారించి బయల్దేరింది సీమ.

సీమ వెళ్ళేసరికి ఆ గ్రామంలో పోలీసుల
శిబిరాలు కన్పించాయి. హిందువులు,
ముస్లింలు, క్రైస్తవులు ఉన్నారు. "హరహర
మహాదేవ", "సనాతన ధర్మానికే జయం"
అంటూ హిందువుల గుంపు నినాదాలి
వ్వటం కన్పించింది. కారణం అడిగితే తలా
ఓ రకంగా చెప్పారు జనం. పోలీసులకి
లాఠీ ప్రయోగించడం ఒక్కటే తెలుసునేమో
అన్పిస్తుంది. ప్రజలతో మృదువుగా వ్యవహ
రించే తీరును వారికి ఎవరూ శిక్షణ సమ
యంలో బోధించరు కాబోలు. పోలీసులూ,
ఇతర అధికారులూ జనాన్ని అదుపు చేయ
లేక మౌనంగా చూస్తూ నిల్చున్నారు. సీమ
ఓ ఎత్తయిన ప్రదేశానికి వెళ్ళి అందర్నీ
శాంతించమని పదేపదే కోరసాగింది.
"మాకు అమ్మాయిని తిరిగి చూపించండి.
మాకు మా అమ్మాయిని తిరిగి ఇచ్చేయండి"
"హరహర మహాదేవ" అని జనం నినా
దాలివ్వసాగారు.

ఎవరో అమ్మాయిని అపహరించాడు
కాబోలు అనుకుంది సీమ. జనసముదాయా
నికి నచ్చచెబుతూ, "అమ్మాయిని తీసుకురా
వడానికి నేను సాయపడతాను. వెతకడానికి
నా ప్రతినిధులతో వెళ్ళడానికి నేను సిద్ధం.
కానీ మీరిలా గొడవచేసి పోలీసుల్ని లాఠీ
ఛార్జి చేసేందుకు ప్రేరేపించకండి!" అంది
ఊరడిస్తూ.

ప్రజలు శాంతించారు. గుంపు క్రమంగా
పల్చబడి ఎవరిళ్లకు వాళ్లు వెళ్ళసాగారు.
సీమ గ్రామ ప్రతినిధులతో చర్చలు జరపసా
గింది ఆ ప్రశాంత వాతావరణంలో యుక్త
వయస్సులో ఉన్న ఓ హిందూ యువతిని
చర్చిలోకి తీసుకువెళ్ళి క్రైస్తవ మతంలోకి
మార్చారు. అందుకే హిందువులు ఉద్రేకప
డుతూ క్రైస్తవులను చంపాలనుకుంటు
న్నారు. నిజానికి తల్లిదండ్రులు ఆ అమ్మా
యికి పెళ్లి చేయాలనుకున్నారు. వారి
కులంలో కట్నాలడిగారు. వీరికి ఇచ్చే స్తోమ
తలేదు. క్రైస్తవ కుర్రవాడు కట్నం లేకుండా
పెళ్ళి చేసుకుంటాననటంతో ఈ అమ్మాయి
మతం మార్చుకుంది. ఇదీ జరిగిన
విషయం. ఈ సమస్యని పరిష్కరించడానికి
వారంరోజులగడువిమ్మనీ, ఈలోగా ఈ
అమ్మాయి మళ్ళీ హిందుత్వం స్వీకరిస్తే
అభ్యంతరం లేదని, కట్నం కోరక పెళ్లి
చేసుకునే యువకుణ్ణి వెదికి ఉంచమని
హిందూ ప్రతినిధుల్ని కోరింది సీమ.

హిందూ ప్రతినిధులు వెళ్ళిపోయాక
క్రైస్తవ మతనాయకుల్ని సంప్రదించింది.
అధిక సంఖ్యలో జనాన్ని తమ మతంలోకి
చేర్చడమే తమ లక్ష్యం అన్నారు వాళ్లు. కానీ
ప్రస్తుత పరిస్థితుల దృష్ట్యా ఈ అమ్మాయిని
మళ్ళీ హిందువుల్లోకి పంపడానికి తమకే
అభ్యంతరం లేదన్నారు వాళ్లు.

వారంరోజుల తర్వాత సుభద్రను వెంట
బెట్టుకుని ఆ ఊరికి వెళ్ళింది సీమ. "ఆ
నిరుపేద యువతిని కట్నం కోరకుండా
పెళ్ళాడే వరుడిని చూశారా?" అడిగింది
సీమ. "అన్వేషిస్తున్నాం" అన్నారు హిందూ
ప్రతినిధులు.

క్రిస్టియన్లు సంతోషించినట్లు కన్పించారు.
సీమపట్ల గల జనాదరణ, ఆమె సమస్యల్ని
పరిష్కరిస్తున్న తీరును చూసి సుభద్ర ఆశ్చ
ర్యచకితురాలయింది. గంటసేపు అక్కడ
గడిపి కల్యాణకేంద్రానికి వచ్చేశారు. ఆ తరు
వాత ఆ ఊరునుండి ఏ సమాచారం రాక
పోయేసరికి 'కష్టకాలం గడిచిపోయింది.
తమపై బాధ్యత పడేసరికి మతం మార్పిడి
ఎవరికీ అభ్యంతరమన్పించలేదు కాబోలు'
అనుకుంది సీమ.

సుభద్ర లక్నోలో ఉండగానే అలాంటి
సంఘటనే మరొకటి జరిగింది. ఈసారి
పోట్లాటకు మూలం ముస్లిములు! ఓ
కుటుంబంలోని పదిహేనుమంది సభ్యులు
ముస్లింమతాన్ని స్వీకరించారు. ఈ వార్త

విని హిందువులు ఉలిక్కిపడ్డారు. ఈ ధర్మ పరివర్తనకు విరుద్ధంగా మతంమార్పిడికి నిరసనగా ఓ ఊరేగింపును బయల్దేరదీ శారు.

వీరంతా సనాతన ధర్మం జిందాబాద్" అనీ, పాకిస్థాన్‌కి విరుద్ధంగానూ నినాదాలి వ్వసాగారు. శరణార్థులు ఆ గ్రామంలోకి



వచ్చాక హిందూ, ముస్లింల సంఖ్య సమా నంగా మారింది. సమాన సంఖ్యలో ఉన్న ప్పుడే పోటీలు బయల్దేరుతున్నాయి. సుభద్ర సలహాలు కూడా స్వీకరించిన సీమ మొదట జన సందోహాన్ని శాంతింపచే యాల్సి వచ్చింది. ముస్లింపై ప్రదర్శన కారు లకున్న క్రోధం అంతా తొలగించాల్సి ఉంది. అందుకే జనసందోహాన్ని ఉద్బోధిస్తూ, "విచ్ఛిన్నకుల కుయుక్తుల కారణంగా మనలో ఈ అశాంతి, అల్లకల్లోలం ఏర్పడు తోంది. మనదేశం శక్తివంతంగా మారుతుం

డటాన్ని ఆయాదేశాలు సహించలేకున్నాయి. పరస్పర కలహాల్ని మానుకుని వికాసానికి బాటవేసుకుందాం. మీరు శాంతంగా ఉండండి. మీ ఊరిపేరు 'ఏతిబారాబాద్'. మీ ఊరిపేరును సార్థకం చేస్తూ విశ్వాసాన్ని సడలనీయకండి!"

అంతలో పోలీసులు గాలిలోకి కాల్పులు జరపసాగారు. ఊళ్ళో కర్ఫ్యూ విధించేసరికి జనం చెల్లాచెదురై ఇళ్ళలోకి వెళ్ళసాగారు. గ్రామనాయకుల్ని పోలీసులు చర్చలకి పిలిచి సీమతో కూడా సలహాలు సంప్రదింపులు జరిపారు. మతం మార్పిడి వెనుక జరిగిన కథాకమామీషు పూర్తిగా అడిగి తెలుసు కుంది సీమ. తరువాత గ్రామ నాయకుల్ని సంబోధిస్తూ, "మతం మార్పిడిలు చేయటం మనం దేశం వంటి సాపేక్షరాజ్యంలో అంతం కావాలి. నిజమే. నేను సైద్ధాంతిక రూపంలో మీతో ఏకీభవిస్తున్నాను. లేకుంటే విభిన్నవర్గాల మధ్య సద్భావ వాతావరణం ఏర్పడదు. అల్ప సంఖ్యల్లో ఉన్న వర్గాన్ని సంరక్షించటం మన నైతికధర్మం, కర్తవ్యం. కానీ ప్రస్తుతం ఈ కుటుంబంలో జరిగిన సంఘటనలు పరిశీ లిస్తే హిందువులలోని ఈ బ్రాహ్మణ వర్గా నిదే దోషమని చెప్పకతప్పటంలేదు. మతం మారిన కుటుంబాన్ని ఈ బ్రాహ్మణులు తమకులంనుండి చిన్న కారణంగా వెలివే శారు. వాళ్ళు మరో మతంలోకి చేరితే గొడవ చేస్తున్నారు. తమలో, తమతో ఉండ నీయరు. ఇతర మతంలో కలవడానికి అంగీకరించరు. ఇదెక్కడి న్యాయం? " అంది సీమ.

"చరిత్రలో జరుగుతున్న సంఘటనల్ని చూస్తూ కళ్ళు మూసుకోవాలనా మీ అభి ప్రాయం? మధ్యకాలంలో లక్షలాది హిందు వుల్ని కత్తులతో బెదిరించి ముస్లింలుగా మార్చలేదా? బ్రిటిష్ పాలకులు లాలూచీలు చూపి అనేకుల్ని క్రైస్తవులుగా మార్చలేదా?'' అన్నాడు ఆ గ్రామానికి చెందిన ఓ నాయ కుడు.

"జరిగిన సంఘటనలపై తెరలు వేయలేం. దాచలేం. మర్చిపోలేం. నిజమే! ఏ సంఘటననైనా ఈ చారిత్రాత్మక భూమిపై చూడటమేలేదు, దానితోపాటు స్వతంత్ర, మానవీయ రూపంలో కూడా చూడవచ్చు చూడాలి. మీ గ్రామంలో జరి గిన సంఘటనను మానవతా దృక్పథంతో చూడాల్సిన అవసరం ఉంది"

తరువాత సభ ముగిసింది. నాయకులు ఎక్కడివారక్కడ వెళ్ళిపోయారు. తాము ఇక్కడినుండి వెళ్ళిపోయాక అగ్గి మళ్ళీ రాజుకుంటుందనిపించింది సీమకి. గ్రామ నాయకుల మాటలు విన్న పోలీసులూ ఇలాగే భావించి మరికొన్నాళ్ళపాటు సీమని ఆ ఊళ్లోనే నిల్చిపొమ్మని కోరారు. ముస్లిము లను నగరానికి తీసుకుపోవడానికి పోలీ సులు ఏర్పాట్లు చేయసాగారు.

పోలీసుల ఏర్పాట్లు పూర్తవటం చూసిన సుభద్ర సీమతో "హిందువులలో ఆర్థికంగా సామాజికంగా వెనుకబడిన బలహీన వర్గా లవారు ఎన్నోసార్లు మతం మార్చుకోవటం చూస్తుంటాం. చిన్న చిన్న ఘటనలను అదుపు చేస్తే మతం పరివర్తన చేసుకునే సమస్య తీరుతుంది. ఈ సమస్యకు ఏదో ఓ పరిష్కారం జరగాలి కదా!" అంది.

"వెనుకబడిన వర్గాలవారికి సామాజిక న్యాయం" .

"ప్రభుత్వం అన్ని జాతులవారికి అన్ని ప్రదేశాల్లో సురక్షితస్థానం ఏర్పాట్లు చేస్తోంది కదా!" అంది సుభద్ర.

"ఈ సమస్యకు సంపూర్ణ పరిష్కారం జర గలేదని నా అభిప్రాయం. యోగ్యత తక్కువ ఉన్న అధ్యాపకుడిని మీరు మూల గ్రామాలకి వేస్తే సామాజిక న్యాయం జరిగి నట్లనుకోవటం పొరపాటే! అయోగ్యుడైన అధ్యాపకుడిని ఇస్తే అతని వద్ద శిక్షణ పొందాలని వచ్చిన వందమంది విద్యార్థులకి

సరైన న్యాయం జరుగుతుందా? వారి భవిష్యత్తుతో ఆటలాడినట్లు కాదూ! విద్యార్థుల్లో వెనుకబడిన వారి పిల్లలేకాదు, ఉన్నత వర్గాల వారి పిల్లలు కూడా ఉంటారు కదా!"

"మరి ఈ సమస్యకు పరిష్కారం ఎలా జరగాలి? " అంది సుభద్ర.

"ఇందుకోసం ఒకరో, ఇద్దరో పూనుకుంటే సమస్య నిర్మూలనం కాదు. దీనికి విస్తారమైన ప్రోగ్రాం ఏర్పాటుచేయాల్సి ఉంటుంది"

"ఆ ప్రోగ్రాం రూపురేఖలు ఎలా ఉంటాయి" అడిగింది సుభద్ర.

"మానవజీవనానికి ఆధారభూతమైనవీ, పరివర్తనీయమైన ఆవశ్యకతలు ఉంటాయి. ఇతర వర్గాల వారికి వీటి ఆవశ్యకత ఉన్నట్లే వెనుకబడిన వర్గాలవారికి కూడా ఇవి అత్యవసరాలు. పూర్తిచేయాలి. ప్రతి జీవీ తన జీవనానికి సంరక్షణ కోరటం సహజం. వెనుకబడిన వర్గాలు తమకు సంపూర్ణ రక్షణ ఉందని భావించేలా పరిస్థితులు కల్పిస్తూ సమాజం ముందడుగువేయాలి. తమకు అవమానాలు ఉండవని వెనుకబడినవారిలో నమ్మకం కుదరాలి. రెండవ విషయం. వెనుకబడిన వర్గాలవారికీ, మిగతావారికీ మధ్య సామరస్యం, సమన్వయం, మైత్రీ భావన వికాసం చెందేలా నాయకులు పర్యవేక్షించాలి. అంతర్జాతీయ, అంతర్రాంతీయ వివాహాలకు విశేష ఆదరణ కల్పించాలి. ఎక్కువ, తక్కువ ఫీజులు వసూళ్ళు చేసే స్కూళ్ళను మూసేసి చక్కని శిక్షణని అందించే ప్రణాళికల్ని రూపొందించాలి. వెనుకబడిన వర్గాల విద్యార్థుల శిక్షణలో ఇంగ్లీషు, సంస్కృతం, శాస్త్రీయ సాహిత్యాలకి విశేషస్థానం ఉండేలా చూడాలి. లేదా ఉపనిషత్తుల్ని, కురాన్, ఇతర ధార్మిక గ్రంథాల్ని చదివి అర్థంచేసుకునేందుకు దోహదపడే ఉత్తమ సాహిత్యాన్ని చిన్ననాటి నుండి బోధించాలి... ఇలాంటివే మరికొన్ని" అంది సీమ.

ఇంతలో ముసల్మానులని అక్కడినుండి తీసుకుని వెళ్ళడానికి పోలీసులు టాంగాలు, ట్రక్కులు ఏర్పాటు చేశారు. గ్రామంలో కర్ఫ్యూ ఉంది. కొందరు ముస్లింలు బళ్ళెక్కుతున్నారు. అంతలో ఒక యువకుడు పరుగెత్తుకుంటూ వస్తూ కన్పించాడు. అతని కళ్లలో మెరుపు ఉంది. ముఖం ప్రసన్నంగా ఉంది. చిరునవ్వు పెదవులపై విరుస్తోంది. అతను సీమవైపు వస్తున్నాడు. సీమ అతన్ని చూసి గుర్తించింది. నమ్మలేనట్లు మళ్ళీ చూసింది. అతనెవరో కాదు జాహిద్. ఉత్సాహంగా అతనికి స్వాగతం చెప్పింది.

"ఎలా వచ్చావు" సీమ సంతోషంతో అడిగింది.

"నాకు ఇక్కడికి బదిలీ అయింది. ఈ ఊళ్ళో ఓ బంధువుని కలుసుకోవాలని పొద్దున్నే ఇక్కడికి వచ్చాను. మనం ఇక్కడ ఈ పరిస్థితుల్లో కలుసుకుంటాం అనుకోలేదు" అన్నాడు జాహిద్ సంభ్రమంగా.

జాహిద్‌ని సుభద్రకు పరిచయం చేసింది సీమ. అందరూ ట్రక్కుల్లో, టాంగాల్లో ఎక్కి ప్రయాణమవుతున్నారు. సీమ, జాహిద్, సుభద్ర ఓ టాంగాలో ఎక్కి నగరం వైపు బయల్దేరారు.

"ఈ జాహిద్ సాయపడకుంటే సీమ నీ ఎదుట ఇవాళ ఉండేదేకాదు" అంది సీమ సుభద్రతో.

"నేను నిన్నూ, కామినిని ఇద్దరినే రక్షించాను. కాని ఇవాళ నీవు అనేక ముస్లిం కుటుంబాల్ని కాపాడుతున్నావు. ఇందుకోసమే నిన్ను నేను కాపాడానేమో అన్పిస్తోంది. నువ్వు నిజంగా గొప్పదానివి" అన్నాడు జాహిద్ మెచ్చుకోలుగా.

సుభద్ర మౌనంగా వింటోంది. ఆమెకి గతమంతా గుర్తుకొస్తోంది. కర్మఫల స్వరూపం అంటే ఇదేనేమో అన్పిస్తోంది. జరుగుతున్న సంఘటనలు చూస్తుంటే. ఏ

ముస్లిమూ, హిందువుకంటే గొప్పవాడు కాదు. ఏ హిందువూ ముస్లింకంటే గొప్ప వాడు కాదు. ఇద్దరినీ మించినశ్రేష్ఠులు న్నారు. వారికి హిందూ, ముసల్మాన్‌లనే భేదభావాలు, మత భేదాలు ఉండవు. వీటికి అతీతంగా మానవత్వం వారిలో నిండుగా ఉంటుంది. మానవతదే పై చేయి! మాన వత్వం అణువణువునా నిండిన వ్యక్తులే ఉన్నతులు. నిజమైన మానవులు.

నగరానికి చేరుకున్న ముస్లింలంతా జాహిద్, సీమల కథ విని ఆశ్చర్యచకితుల య్యారు. వారిని చూశాక చాదస్తాల్ని, మూఢనమ్మకాల్ని, మత భేదాల్ని నిర్మూలిం చడం కష్టమేమీ కాదనీ ఆరోగ్యవంతమైన దృష్టికోణం, సత్సంకల్పం ఉండటం అవసర మనీ అన్పించింది అందరికీ.

★ ★ ★

జాహిద్ ఢిల్లీకి తిరిగి వెళ్ళిపోయాడు. తన కార్యాలయ విధి నిర్వహణల్లో నిమగ్న మయ్యాడు. జాహిద్, సీమల సాహసకృత్యాలు, సాధించిన సత్ఫలితాల వివరాలు విన్న తరువాత కల్యాణ కేంద్రంలోని వారికి సీమపట్ల గౌరవం మరింతగా పెరిగింది.

ఓరోజు సాయంకాలం సీమ, నిర్మల కల్యాణకేంద్రం పచ్చిక మైదానంలో పచార్లు చేస్తున్నారు. మాటల సందర్భంలో నీరజ్‌ని ప్రశంసిస్తూ, "నీ కింత మంచి జీవన సహ చరుడు దొరకటం చూస్తుంటే నాకెంతో సంతోషంగా ఉంది. భగవంతుడు మిమ్మల్ని చల్లగా చూడాలి. ఈ మీ అను బంధాన్ని పది కాలాలపాటు శాశ్వతం చేయాలి. నరకయాతనలు అనుభవించా నని ఉత్తరంలో రాశావు. ఎందుకలా రాయ వలసి వచ్చింది? " అంది సీమ.

ఢిల్లీలో సీమ దగ్గరనుండి వెళ్ళినప్పటి నుండి నీరజ్‌తో పెళ్ళి జరిగేవరకూ జరిగిన కథంతా చెప్పింది నిర్మల. నిర్మల గతం వింటుంటే సీమ శరీరంపై రోమాలు నిక్క పొడుచుకున్నాయి. "ఇలాంటి హోటల్ మేనేజర్‌లకి యావజ్జీవ కారాగార శిక్ష విధిం చాలి" అందామె.

"నీవు ఆ మేనేజర్‌కి సూచించిన శిక్ష షకీలా, తారా మొదలైనవారికి కూడా వర్తిం చాలి. నేనూ, నీరజ్ పోలీస్ రిపోర్ట్ ఇస్తే వారితోపాటే మా పేర్లూ లోకానికి తెలు స్తాయి కదా! ఈ విషయం తెలిస్తే నన్ను గురించి ఎవరెవరు ఏమేం అనుకుంటారో ఎవరికి తెలుసు? చదువుకున్నదానివై కూడా షకీలాలాంటి ఓ దళారిచేతిలో ఎలా చిక్కు కున్నావని నన్నంటారు. నేను ధనాశతో తెలిసే వెళ్ళానని అపార్థంచేసుకునే వారూ ఉండొచ్చు. ఈ మాటలు నీరజ్ మనసుని ఎలా ప్రభావితం చేస్తాయో చెప్పలేం. అందుకే మా మేలుకోసమే అన్ని బాధలను అవమానాలను మౌనంగా దాచుకోవాలనే నిర్ణయానికి వచ్చాను" అంది నిర్మల.

ఇదంతా విని కొద్దిక్షణాలపాటు సీమ మౌనంగా ఉండిపోయింది. కాస్సేపటి తరు వాత మౌనం వీడి, "నీ ఆలోచనలతో ఏకీభ విస్తున్నాననిగానీ, ఏకీభవించననిగానీ చెప్ప లేను. నీ వాదన కూడా సరైనదనే అన్పి స్తోంది" అంది ఏదో ఆలోచిస్తూ.

లక్నోలో కొన్నాళ్ళు ఉండాలనే వచ్చింది నిర్మల. నీరజ్ తన పనులలో బిజీగా ఉండేవాడు. సీమ, నిర్మల కబుర్లు చెప్పుకో వడానికి చాలా సమయమే దొరికేది.

ప్రస్తుతం నెమ్మది నెమ్మదిగా దేశ పరిస్థి తులు మారుతున్నాయి. మారిన పరిస్థితు లకు అనుకూలంగా నడవటం అలవర్చుకు న్నారు ప్రజలు. ఇళ్ళూ, దుకాణాలూ, ఇతర భవనాలూ అగ్నికి ఆహుతయ్యే దురదృష్ట కర సంఘటనలు తగ్గిపోయాయి. వార్తాప త్రికలలో హింసలకు సంబంధించిన వార్తలు తగ్గాయి. ఒకవేళ కనిపించినా మూడో పేజీలోనో, నాలుగో పేజీలోనో లేక స్థానిక వార్తల మధ్యలోనో తరచుగా ఉంటు న్నాయి.

తీవ్రవాదుల క్రోధాలను చాలావరకు శాంతింపచేసింది కాలం. శరణార్థులంతా ప్రభుత్వసాయంతోనో, తమ ప్రయత్నాలద్వారానో ఏవో పనులు చేసుకొని పొట్టపోషించుకుంటున్నారు. తమ ఉద్యోగాలలో నిమగ్నమవుతున్నారు. సీమ దినకృత్యాలలో కూడా చాలావరకు మార్పు వచ్చింది. ఇదివరకటి పనివత్తిడి తగ్గింది. వేళకాని వేళలలో వచ్చేవారు తగ్గారు. కేంద్రానికి సంబంధించిన పనులు చూసుకోవడం, తను సభ్యురాలుగా ఉన్న సంస్థల సభలకు వెళ్లటం వరకే సీమ విధులు పరిమితమయ్యాయి. కొన్ని సమావేశాలకు తనతోపాటు నిర్మలను కూడా వెంటబెట్టుకుని వెళ్తోంది.

"ఓ మాట అడుగుతాను. ఏమీ అనుకోవు గదా? " అంది నిర్మల ఓ రోజు.

"ఏదైనా చెప్పాలనుకుంటే నీకూ ఉపోద్ఘాతం అవసరమా? ఏమిటి? " అంది సీమ నవ్వుతూ.

"తనకో తోడు కావాలని నీ మనసు కోరటం లేదూ? "

"ఆ సంగతి వదిలెయ్! ఇంకేదైనా మాట్లాడు"

ఆ ప్రస్తావన అంతటితో ఆపదలచుకోలేదు నిర్మల. తన అంతరంగ మిత్రురాలి భావి జీవనం గురించి ఆమె తీవ్రంగా ఆలోచిస్తోంది.

"చూడు సీమా! ప్రతి మనిషికి ఒకతోడు అవసరమవుతుంది. ఎవరి పేరు వింటేనే భయంతో శరీరం కంపిస్తుందో అలాంటి తీవ్ర ఉగ్రవాదికి కూడా సంకట సమయంలో ఆయుధాలు అవసరమవుతాయి. చివరికి భూమిలో కలిసిపోవాలన్నా ఇతరుల సాయం అవసరమవుతుంది. మిల్లు యజమానులు, షావుకార్లు, జమీందార్లు ఎందరో ఉన్నారు. వీరికి వేలాదిమంది నమస్కారాలు చేస్తుంటారు. వీరి ఎదుట అమ్మా, బాబూ అని అతివినయంతో ప్రవర్తిస్తారు. ధన సహాయాన్ని వారినుండి వేరుచేసి చూడు. ధనహీనులైన వీరంతా ఒక గవ్వకు కొరగారు. ఎవరూ వారిని పలకరించరు. ప్రతి వ్యక్తికీ జీవితంలో నమ్మకస్తుడైన నేస్తం అవసరం ఉంటుంది. సలహాలకూ, సంప్రదింపులకూ, కష్టసుఖాలకూ ఓ తోడుండటం అందరికీ అవసరం"

"నీ ఉపన్యాసం ముగిసిందా? ఇంకా ఉందా? "

"సీమా! నా మాటల్ని కొట్టిపారేయాలని చూడకు. నిజాల ఎదుట కళ్లు మూసుకోకు. కోరికలకు అతీతులమై ఉండటం చాలా కష్టం. అవి ఎంతటివారినైనా వేధిస్తాయి. ఋషులు, మునులే తప్పించుకోలేకపోయారు. సృష్టిరచనకు ఆధారం కోరిక కాదూ"

"నీవు చెబుతున్న మాటలను గురించి నేనేనాడూ ఆలోచించలేదు. నా ఆలోచనలు వేరుగా ఉన్నాయి"

"అవేమిటో చెప్పు! వింటాను..."

సీమ కళ్లలో అశ్రువులు నిండాయి.

"కామిని తన తండ్రి గురించి అడిగినప్పుడు రేపటిరోజు ఎలా సమాధానం చెప్పాలన్నదే నా చింత. ఆ సమయంలో నా ఎదుట వాస్తవిక ధర్మసంకటమే ఎదురవుతుంది. ఈ విషయంలో ఆ కఠోరసత్యాన్ని విని దాని మనఃస్థితి ఎలా వుంటుందో తెలియదు. మరికొంచెం పెద్దదయ్యాక స్నేహితురాళ్లు ఏదైనా ఎగతాళి చేస్తే కామిని మనసు ఎంత బాధపడుతుందో? తోటి పిల్లలు తండ్రులతో నవ్వుతూ, తుళ్లుతూ సరదాగా ఉంటే ఇది చూసిన కామినికి తనకు తండ్రి లేనిలోటు తప్పక వేధిస్తుంది. ఈ విషయంలో ఏ అబద్ధమూ దానికి చెప్పదలచుకోలేదు నేను. ఎందుకంటే ఏదో ఒక రోజు వాస్తవం తెలిసిపోతుంది. నిజం నిప్పులాంటిది. ఏదో ఒకనాటికి బయటపడుతుంది. నేను ఏదో అబద్ధం చెప్పి బుకాయిస్తే నిజం తెలిసినరోజు అది నన్ను నమ్ముతుందా? గౌరవిస్తుందా? అప్పుడు

పాపం కామిని జీవితం ఏమవుతుంది? ఊహించడానికే భయంగా ఉంది. అదిగాక పిల్లల్లో సంపూర్ణ వికాసం జరగాలంటే తల్లి, తండ్రి ఇద్దరూ తమ బాధ్యతలను సక్ర మంగా నిర్వర్తించాలి. ఆడపిల్లలు త్వరగా ఎదిగిపోతారు. కామిని వివాహ సమ యంలో మన్‌మోహన్, నేనూ విడిగా ఉంటున్నామని తెలిసి వియ్యంకులవారు వెనక్కి తగ్గవచ్చు ఇవన్నీ తలచుకుంటే హృదయం కల్లోల తరంగమే అవుతుంది"

కామిని గురించి ఎంతో బాధ్యతగా ఆలో చిస్తున్న సీమ వైఖరి చూసి నిర్మల ఉదాసీ నంగా ఉండిపోయింది. కొద్దిక్షణాలపాటు ఆమెను ఏదో స్తబ్దత ఆవరించింది. సీమ సమస్యలకు, ప్రశ్నలకు ఆమె వద్ద సమా ధానం లేదు మరి. కూతురికి బదులుగా సీమకు ఓ కొడుకైనా ఉంటే బావుండేది. ఈ సమస్య ఇంతగా పీడించేది కాదు అనుకున్న నిర్మల,

"నీ స్నేహితురాలిగా, తోటి మహిళగా నేను నీ బాధలకు తదానుభూతి చెందు తాను. నువ్వు సరేనంటే నీరజ్, నేను హైదరాబాద్ ప్రయాణాన్ని మరో నాలుగు రోజులపాటు వాయిదా వేసుకుంటాం. మన్ మోహన్‌ను కలిసి మాట్లాడతాం. ఆ తరు వాత అతని తల్లిదండ్రులతోనూ చర్చించ వచ్చు" అంది.

ఈ మాటలు విన్న సీమలో అంతర్లీనంగా దాగిన వేదన మరోసారి పెల్లుబికింది. అంతలోనే పౌరుషమూ మేల్కొంది. "మిమ్మల్ని అలా వెళ్ళనీయను. నేను వెళ్లద లచుకోని దారి గురించిన వివరాలూ, కొల తలూ నాకెందుకు? నాకే కాదు. నా స్నేహి తురాలు రాధ, ఆమె భర్త సోమనాథ్‌లకూ ఈ విషయంలో అవమానమే ఎదుర యింది. నిన్నూ, నీరజ్‌నూ అవమాన తిర స్కారాలకు గురి కానీయను" అంది దృఢంగా.

"అందుకు నువ్వేం బాధపడకు. లక్ష్యప్రా ప్తికై మనిషి శీతోష్ణాలు, సుఖదుఃఖాలు ఏవైనా అన్నీ సహించవలసే ఉంటుంది. అందుకు సిద్ధంగా ఉండకతప్పదు. నీ సుఖంకోసం నేనీమాత్రం కష్టపడకుంటే ఇక మనస్నేహం ఎందుకు? "

"నిర్మలా! నేను నీ స్నేహానికి పరీక్ష పెట్ట బోవటంలేదు. నీ మనసు లోతులలోని భావాన్ని నేను అర్థం చేసుకున్నాను. నా పట్లా, కామిని పట్లా నీ మనసులో ఉన్న ప్రేమ నాకు తెలుసు. నా మిత్రురాలు రాధ, ఆమె భర్త సోమనాథులే కాదు ఉత్తముడైన రహమత్‌ఆలీ ఎదుటే ఆ ఇంటివారిచే అవ మానాలకు గురైన నన్ను ఆ ఇంటి గడపను మళ్ళీ ఎలా తొక్కమంటావు? నా సతీత్వం పైనే నిందవేసిన వాళ్ళతో ఎలా కలిసి జీవించగలను. నా శీలాన్ని శంకించినవా రిని ఎలా గౌరవించగలను? "

"సీమా! ఎంతటి ఉన్నతులైనా, ఉత్తము లైనా ఏదో ఒక సందర్భంలో పొరపాటుపడే అవకాశం ఉంది. చిన్న పొరపాటు కార ణంగా జీవితాన్నే పణం పెట్టటం బుద్ధిమం తుల లక్షణం కాదు. నీవు నిండు యౌవ నంలో ఉన్నావు. మన్‌మోహన్ కూడా అంతే! ప్రస్తుతం అతని మనసు మారిం దేమో? తన పొరపాటు గ్రహించాడేమో? ఎవరు చెప్పగలరు? ఒప్పందం చేసుకోవా లని అనుకుంటున్నాడేమో? చూడు! నువ్వింత పెద్ద ఇంట్లో ఒంటరిగా ఉంటు న్నావు. ఇల్లు అన్ని విధాలుగానూ రక్షణని స్తోంది. కానీ నీ హృదయంలో ఏర్పడిన శూన్యాన్ని ఎవరు పూడ్చగలరు? ఇన్ని రోజులూ ఈ సమస్య నిన్ను ఎక్కువగా వేధించకపోవచ్చు ఎందుకంటే రాత్రింబ గళ్లు పనివత్తిడిలో ఉరుకులూ, పరుగులూ పెట్టావు. పనిలో సంపూర్ణంగా నిమగ్నమ య్యావు. ఇప్పుడు పని వత్తిడి తగ్గింది. వంటరిక్షణాలు పెరుగుతున్నాయి. అవే నీ చింతల్నీ, చికాకుల్నీ మరింత పెంచుతాయి. నామాట విను. ఒక్కసారి మమ్మల్ని ప్రయ

త్నించనీ! మన్‌మోహన్ మనసు నీవైపు లేదనీ, ఇంకా నిన్ను అనుమానిస్తూనే ఉన్నాడనీ అన్పించిన మరుక్షణమే మా ప్రయత్నం విరమిస్తాం"

"వద్దు నిర్మలా! నన్ను ఛీత్కరించి వెళ్ళగొట్టిన ఆ ఇంటికి నన్నుండనీయమని భిక్షమడగడానికి వెళ్ళమంటావా? నా తరపున నీవు సంధికి వెళ్తావా? రాముడు సీతను అరణ్యాలకు వెళ్ళగొట్టాడు. కొన్నాళ్లకు రాముడు ఆహ్వానించినా ఆమె అయోధ్యకు వెళ్ళలేదు. పృథ్వీమాత ఉదరంలోకి వెళ్ళి తలదాచుకుని తన అభిమానాన్ని చాటుకుంది. నన్ను తిరస్కరించిన మన్‌మోహన్ కనీసం కామిని పిలిచిన కన్నీటి పిలుపుకైనా కరగలేదే? వెనుదిరిగి చూడలేదే? చేరదీయలేదే? అలాంటి వ్యక్తితో నా జీవనరథం సాగుతుందా? ఆయన నా శీలాన్ని శంకిస్తే నేనూ అతని పవిత్రతను అనుమానించాలి గదా? అయినా అలాంటి ఆలోచనలు నా మనసులో లేనేలేవు. మా దారులు వేరయ్యాయి. అవి ఇక ఏకం కావు..."

నిర్మల అవాక్కయింది. ఇంతలో కామిని ఆడుతూ పాడుతూ అటువైపు వచ్చింది. సీమ వాత్సల్యపూరిత నయనాలతో కూతురివైపు చూసి ప్రేమగా ఎత్తుకుని వళ్ళో కూర్చోబెట్టుకుంది. పదేపదే ముద్దుపెట్టుకుంది.

"అమ్మా! నా బొమ్మనీ ముద్దుపెట్టుకో. లేకుంటే అది నాతో పోట్లాడుతుంది" అంది గారాబంగా. తన ముద్దుమాటలతో ఆ గంభీర వాతావరణాన్ని ఉల్లాసంగా మార్చేసింది కామిని. సీమ తన బొమ్మని ముద్దుపెట్టుకోగానే, "పిన్నీ! నీవూ దీన్ని ముద్దుపెట్టుకో" అంది. నిర్మల కామిని ఆజ్ఞను పాటించి,

"ఈ బొమ్మ నాకిస్తావా"అంది.

"బొమ్మలతో పిల్లలే ఆడుకుంటారు. పెద్దవాళ్ళెక్కడైనా బొమ్మలతో ఆడుకుంటారా?" అంది కామిని వెంటనే.

కామిని మాటలు నిర్మలని ఆలోచింపచేశాయి. ఈ బొమ్మలతోఆడుకోకుంటేనేం ప్రతి మనిషీ జీవనపర్యంతం బొమ్మలతో ఆడుకుంటూనే ఉంటాడు. మనిషి పెద్దవాడయ్యాక ఎముకలూ, రక్త, మాంసాలతో కూడిన బొమ్మలతో ఆటలాడుకుంటాడంతే! నిర్మల పెదవులు అప్రయత్నంగా చిరునవ్వుతో విచ్చుకున్నాయి.

సీమకూ, తనకూ జరిగిన సంభాషణను ఆ రాత్రి నీరజ్‌కు వివరించి అతని సలహా కోరింది నిర్మల.

"ప్రస్తుతం ఏ నిర్ణయమూ తీసుకోవడానికి సీమ సిద్ధంగా లేనట్లు తోస్తోంది. ఇప్పటికి ఈ ప్రస్తావన ఆపటం సముచితంగా ఉంటుంది. ఇక్కడికి వస్తూపోతూనే ఉంటాం! మరోసారి వచ్చినప్పుడు పరిస్థితి అనుకూలంగా ఉంటే ఈ విషయం మళ్ళీ చర్చిద్దాం. కామిని పుట్టినరోజుకు రమ్మంది గదా! వద్దాం. అప్పుడు చూద్దాం" అన్నాడు నీరజ్.

రెండురోజుల తరువాత నిర్మల, నీరజ్‌లు హైదరాబాద్‌కి వెళ్లిపోయారు. నిర్మలతో నిస్సంకోచంగా అన్ని విషయాలూ మాట్లాడాక సీమ మనసు తేలికైపోయింది. మాటల సందర్భంలో నిర్మలతో తాను అనుచితంగా ఏమైనా మాట్లాడానా, నిర్మల మనసు కష్టపెట్టానా అనే సందేహమూ కలిగింది. మంచో చెడో నిర్మల నా మేలుకోసమే, నా హితవును మనసారా కాంక్షించే ఆ సలహా ఇచ్చింది. అని తనకు తాను ధైర్యం చెప్పుకుంది. నిర్మల ప్రస్తావనని కాస్సేపు ఆలోచిస్తుంది. మరి కాస్సేపు భవిష్యత్తును గురించి చింతిస్తుంది.

దైనందిన కార్యక్రమాలలో కొంత, కామిని ఆలోచనలలో కొంత, కామిని ఆటపాటలతో కొంత సీమ కాలక్షేపం చేస్తోంది. ఓరోజు కళ్యాణ కేంద్రంనుండి వచ్చాక కామినికి కబుర్లు చెబుతోంది. కేంద్రంనుండి

బంట్రోతు వచ్చి "ఓ పెద్దాయన వచ్చాడు. మీతో ముఖ్యమైన పని ఉందంటున్నాడు. కంగారుగా కనిపించాడు" అని చెప్పాడు.

"ఆయన్ని ఆఫీసులో కూర్చోబెట్టు. నేను మరికాస్సేపట్లో వచ్చేస్తాను" అని అతన్ని పంపించేసింది. అతను వెళ్ళిన కొద్దిసేపట్లోనే తయారై, కామినిని వెంటబెట్టుకుని కళ్యాణ కేంద్ర కార్యాలయానికి వెళ్ళింది. ఆ వచ్చిన పెద్ద మనిషిని చూసి ఆశ్చర్య చకితురాలైంది. ఆయన సీమ మామగారు. సీమ వినయంగా వంగి మామగారి పాదాలకు నమస్కరించింది. సౌభాగ్యవతివి కమ్మని ఆయన దీవించాడు. కామినిని ప్రేమగా ఎత్తుకుని బుగ్గలు పుణికాడు.

"మన్‌మోహన్ తల్లి ఆస్పత్రిలో ఉంది. ఆమెకు క్షయ సోకిందంటున్నారు డాక్టర్లు. నిన్నూ, కామినినీ చూడాలంటోందామె" అన్నాడు.

సీమ తన చెవుల్ని తనే నమ్మలేకపోతోంది. మామగారు స్వయంగా పిలుస్తున్నారు. ఆస్పత్రికి బయల్దేరుతుండగా "కామినినీ తీసుకువెళ్దాం" అన్నారు మామగారు. కామినిని వెంట బెట్టుకుని మామగారితో ఆస్పత్రికి వెళ్ళిందామె. ఆస్పత్రిలో అత్తగారి గదిలోకి వెళ్ళగానే ఆదరపూర్వకంగా చేతులు జోడించి ఆమెకు నమస్కరించింది సీమ.

"అమ్మాయ్! పాదాలను స్పృశించవా ఏమిటి? " అంది చిరునవ్వుతో.

"అత్తగారూ! పెద్దల చరణ స్పర్శచేసి, వారి ఆశీర్వాదాన్ని పొందే అదృష్టం అందరికీ ఉండదు. నేను మీ పాదాలకి నమస్కరిస్తే మీరు కోపగించుకుని కాళ్ళు వెనక్కి లాక్కుంటారేమోనని నా భయం! ఆమధ్య అలాగే చేశారుగదా!"

"సీమా! ఈ రోగంనుండి విముక్తి పొంది బతికి బట్టగడతానో లేదో తెలియదు. పాత విషయాలు మర్చిపో!" అంటూ కాళ్ళు ముందుకు సాచి, "ఇప్పుడలాంటి అనుమానాలేం పెట్టుకోకు" అంది.

సీమ చిన్నగా నవ్వి, వంగి అత్తగారికి పాదనమస్కారం చేసింది. చిరంజీవివీ, సౌభాగ్యవతివీ కమ్మని అత్త ఆశీర్వదించింది. చేయి పట్టుకుని తనకు దగ్గరగా కూర్చోబెట్టుకుని గుండెలకు హత్తుకుంది. విచిత్రమైన వాతావరణం అక్కడ నెలకొంది. అత్త, కోడళ్ళ ఇద్దరి కళ్ళూ సజలమయ్యాయి. అత్త కళ్ళు వర్షించసాగాయి. వ్యాధి ఎలాంటి కఠిన మనస్కులనైనా వివశుల్ని చేస్తుంది. ఆమెకు క్షయ ఉందని సూటిగా ఎవరూ చెప్పకపోయినా డాక్టర్లు, నర్సుల పరస్పర సంభాషణలవల్ల తనకు వచ్చిన రోగం చిన్నదేం కాదని ఆమెకు అర్థమైపోయింది. అంతలో మన్‌మోహన్ వచ్చాడు. ఎలా పలకరించాలో అర్థంకాని సీమ అతనికి అభివాదం చేసింది. అతను తలపంకించి కూర్చున్నాడు. కామినిని ఎత్తుకోమని మన్‌మోహన్ తల్లిసైగ చేసింది. "కామినీ! నాన్నగారి దగ్గరకి వెళ్ళు తల్లీ" అని మనవరాలినీ హెచ్చరించింది. తల్లి ఒడిలో కూర్చున్న కామినిని మన్‌మోహన్ ఎత్తుకోగానే "ఆరోజు నీవు నాతో ఎందుకు మాట్లాడలేదు. నీతో వచ్చి... నీతో మాట్లాడను" అంది కామిని.

మన్మోహన్ ముఖం ఎర్రబారింది.

యధాలాపంగా పలికిన కామిని మాటలకు విపరీతార్థాలు తీయసాగింది మన్మోహనుని మనస్సు. ఇది సీమ నేర్పిన బుద్ధే! ఇలా అనమందేమో! అనుకున్నాడతను.

సీమ మరికాస్సేపు అక్కడ కూర్చుని ఇక వెళ్తానని అత్తగారినుండి ఆజ్ఞ తీసుకుంది. "ఇవాళ నేను మా కేంద్రానికి వెళ్ళి, అక్కడి పనులు కొన్ని చక్కబెట్టాల్సినవి చక్కబెట్టి రేపు రాత్రినుండి అత్తగారికి తోడుగా ఆసుపత్రిలోనే ఉంటాను. ఒక సమాజసేవికగా ఇది నా బాధ్యత..." అంటూ వాళ్ళ దగ్గర సెలవు తీసుకుని కామినిని తీసుకుని కేంద్రా

నికి వచ్చేసింది.

ఆ రోజుల్లో క్షయవ్యాధికి దేశంలో మందులు దొరికేవి కావు. సీమ అత్తగారి వ్యాధి తొలిదశలోనే ఉంది గనుక కొన్ని విదేశీ ఔషధాలు అధికంగానే లభ్యమయ్యేవి. ఎవరితో, ఎలా తెప్పించుకోవాలనేదే సమస్యగా ఉండేది. జాహిద్‌కి ఈ వివరాలు రాస్తే మందులు తెప్పించగలడేమోనను కుంది సీమ. 'మనిషి ధైర్యం చేస్తే భగవంతుడు తప్పక సాయం చేస్తాడని' ఓ సామెత ఉంది. అందుకే వెంటనే సీమ వ్యాధి గురించి రాసి మందులు పంపించమని జాహిద్‌కు ఉత్తరం రాసింది. జాహిద్ ప్రయత్నాల ఫలితంగా వారం రోజులలో క్షయరోగాన్ని తగ్గించే ఔషధాలు అమెరికా నుండి లక్నోకి చేరాయి. డాక్టర్లు మన్మోహన్ తల్లికి ఔషధవాడకం ప్రారంభించారు. ఇప్పుడు సీమ ఆస్పత్రిలో అత్తగారికి తోడుగా ఉంటోంది. నియమానుసారం అత్తగారికి వేళకు మందులు అందిస్తోంది. క్రమంగా ఆమె వ్యాధి తగ్గుముఖం పడుతోంది. మరికొన్నాళ్ళలో వ్యాధి సంపూర్ణంగా తగ్గిపోయిందనీ, రెండు రోజుల్లో డిశ్చార్జి చేస్తామనీ చెప్పారు డాక్టర్లు.

"జాహిద్ అమెరికానుండి మందులు తెప్పించకుంటే ఇంత త్వరగా ఈ సుదినాన్ని చూసేవాళ్ళం కాదు" అంది సీమ. ఆమె అత్తమామలకు జాహిద్ పట్ల సద్భావం ఏర్పడింది.

ఔషధాలకు వెచ్చించిన డబ్బు పంపిస్తామని జాహిద్‌కి సీమ లేఖ రాయగా తల్లిలాంటి మరో తల్లికి మందులిప్పించి డబ్బు తీసుకోవటం లజ్జాకరం అని బదులు రాశాడు జాహిద్. ఇది విని సీమ అత్తమామలు సంతోషించినా మన్‌మోహన్ మాత్రం, "ఏ స్వార్థమూలేనిదే జాహిద్ ఉచితంగా ఎందుకు పంపిస్తాడు? ఇందులో ఏదో రహస్యం ఉంది" అనుకున్నాడు. పాకిస్తాన్‌లో ఉన్నప్పటి మన్మోహన్‌కు నేటి మన్మోహన్‌కూ ఎంత తేడా? భార్యాబిడ్డల్ని కాపాడుకునేందుకు ఆరోజు విధ్వంసకారుల్ని సైతం వెంబడించాడు. ఇప్పుడు వాళ్లకు ఒకదాని తరువాత మరొకటిగా అన్యాయాలు చేస్తూనే ఉన్నాడు.

ఆస్పత్రినుండి రేపు ఇంటికి వెళ్లవలసి ఉంది. సీమ అత్తగారు సీమను తన దగ్గర కూర్చోబెట్టుకుని, "అమ్మాయ్! నన్ను క్షమించు. నా వలన పెద్ద పొరపాటు జరిగిపోయింది. సమాజం ఏమనుకుంటుందో నన్న భయంతో నేను నీకు ఎంతో అన్యాయం చేశాను. పాకిస్తాన్‌నుండి నువ్వు క్షేమంగా వచ్చాక నిన్నాదరించవలసింది పోయి నిన్ను నీ ఖర్మానికి వదిలివేశాను. బహుశా అదే పాపంవల్ల కాబోలు భగవంతుడు నాకీ వ్యాధిని అంటగట్టాడేమో? నీవు సహాయపడకుంటే ఈ చక్రవ్యూహంనుండి బయటపడగలిగేదాన్నేకాదు. ప్రకృతి చేసే ఏర్పాట్లు కొన్ని విచిత్రంగా ఉంటాయి. నా యీరోగం మన కుటుంబానికి ఓ వరదాయిని అన్పిస్తోంది. ఈ వ్యాధే మనలను కలిపింది. ఇకపైన నువ్వు మా అందరి మధ్య ఇంట్లోనే ఉంటావు. ఎక్కడో, ఏ కేంద్రంలోనో కాదు. నా సందేహాలన్నీ దూరం అయ్యాయి.

"మీ అనుమానం ఎలా తొలగిపోయింది అత్తగారూ!"

"నేను ఆస్పత్రిలో చేరకముందు మీ కేంద్రానికి చెందిన కొందరు మహిళలు మా వీధిలో మంగళవారం కీర్తనల సందర్భంగా జరిగిన ఉత్సవానికి వచ్చారు. కీర్తనలు ముగిశాక కళ్యాణకేంద్రం నిర్వహించె విధులను కొంత చర్చించారు. సమాజంలోని ఏ వర్గానికి చెందినవారికైనా కేంద్రం సహాయం అవసరమైతే సభ్యులందరూ సంతోషంగా కావలసిన సేవలందిస్తారని

చెప్పారు. మీ కేంద్రం పేరు వినగానే ఒక మహిళ నీ అపహరణ గురించిన ఉదంతం జ్ఞాపకం చేసి అనుచితరీతిలో విమర్శించింది. జాహిద్, రాధద్వారా తాము విన్న నీ గతాన్నంతా వాళ్లు వివరించి నీవు నిరపరాధివనీ, కష్టాల కడలిని ఈదుకుని బయటపడ్డావనీ చెప్పారు. దాంతో విమర్శించినావిడ నోరు మూతపడింది. నీ పాతివ్రత్య రక్షణకోసం నిన్ను బలత్కారం చేయబోయిన వ్యక్తిని నీవు హతమార్చిన విషయం విని అందరూ నిన్ను ప్రశంసించారు. నిన్ను తప్పుగా అర్థం చేసుకున్నందుకు ఆక్షణాన నేను లోలోపలే ఎంతగానో బాధపడ్డాను. నేనే నీ అత్తననే విషయం అక్కడివాళ్లెవ్వరికీ తెలియదు. అత్తగారింటివాళ్లంతా నిన్నెలా అవమానించిందీ, అనుమానించిందీ చెప్పి నువ్వు తలచుకుంటే మమ్మల్నందర్నీ కోర్టుకు ఈడ్వగలిగేవానివనీ, కానీ వంశ గౌరవంకోసం మా పతువు ప్రతిష్టల దృష్ట్యా నువ్వాపనిని చేయడానికి నిరాకరించావనీ అన్నారు. అవన్నీ విన్న నేను సిగ్గుతో చితికిపోయాను. ఆ తరువాత ఇల్లుచేరుకుని ఈ విషయాలన్నీ మన్‌మోహన్‌కీ, మీ మామగారికీ చెప్పాను. వాళ్లూ ఆశ్చర్యచకితులయ్యారు. మర్నాడే మీ కేంద్రానికి వచ్చి నిన్ను తీసుకురావాలనుకున్నాం. కానీ విధి వక్రించి నాకు జ్వరం తగలటంతో ఆ ప్రయత్నం కొనసాగలేదు. కొన్నాళ్లకి నన్ను ఆసుపత్రిలో చేర్చారు"

"ఇంతకీ మన్‌మోహన్ మనసులోని కల్మషం పూర్తిగా కరిగిందంటారా లేదా? "

"అతనూ మగవాడేకదా! అహంకారం మగజాతికి పుట్టుకతోనే వుంటుంది. కొన్నాళ్లకి వాడే సర్దుకుంటాడు. రేపు నన్ను డిశ్చార్జి చేసినప్పుడు నాతో నువ్వూ ఇంటికి రావాలి. ఉద్యోగం చేసి బతికే అవసరం నీకికలేదు. భగవంతుని దయవలన మీ మామగారూ, మన్‌మోహన్ చేస్తున్న వ్యాపారం బాగా సాగుతోంది. డబ్బుకేం లోటులేదు. నాలుగు గోడల మధ్యనుండి బయటకు వెళ్లి అన్ని రకాల మనుషులతో కలిసి మెలిసి తిరగటం మన కుటుంబానికి గౌరవం కాదు. నీవు ఉద్యోగం చేయటం మన్‌మోహన్‌కు కూడా ఇష్టంలేదు. నీవు నీ ఉద్యోగానికి రాజీనామా చేస్తే అతని మనసులోనూ పరివర్తన వస్తుంది"

"అత్తగారూ! కళ్యాణకేంద్రంలో పనిచేయడం ఇప్పుడు జీవనోపార్జనకోసమేకాదు, అది నా జీవితంలో ఒక భాగమైపోయింది. ఆ విధుల్ని నేను నిర్వర్తించకుండా వుండలేనంతగా నేను ఆయా పనులకు అలవాటుపడ్డాను. నా లక్ష్యమూ, గమ్యమూ కళ్యాణకేంద్రమే. కళ్యాణకేంద్రంలో నివసించేవారంతా ఇప్పుడు నా కుటుంబ సభ్యులయ్యారు. నాకు దిక్కూ దారీ తెలియని దీన పరిస్థితిలో, నిరాశలో నేను కొట్టుమిట్టాడే సమయంలో ఈ కేంద్రం నాకు ఆశ్రయమిచ్చింది. ఇప్పుడా కేంద్ర విధుల్ని త్యజించటం కృతఘ్నత అన్పించుకుంటుంది"

"సీమా! నీవు సంప్రదాయ కుటుంబీకుల కోడలివి కూడా! డబ్బుకోసం నువ్వు ఇల్లు దాటి వెళ్లటం మేం భరించగలమా? చూసే వాళ్లేమంటారు? కామిని మాకు దూరంగా ఉంటే మాకెలా ఉంటుంది? తండ్రి ప్రేమ కోసం ఆ చిన్నారి మనసు తహతహలాడుతూ ఉండే ఉంటుంది. మాకు ఓ బొమ్మ కావాలి. ఆ అమ్మాయి తుళ్లుతూ గెంతుతూ ఇల్లంతా తిరుగాడుతుంటే మాకెంత సంతోషంగా ఉంటుందీ? అమ్మాయ్! ఆ ఆనందం మాకు అందకుండా అడ్డుపడకు. రేపటినుండి నువ్వూ, కామినీ మాతోనే ఉండండి. మన్‌మోహన్‌కు నచ్చచెప్పే బాధ్యత నాది"

అత్త, భర్తల అంతరంగాలేమిటో సీమకు బోధపడింది. ఈ విషయాన్ని ఇంకా చర్చించటం వృధా అనిపించింది. అందుకే "అత్తగారూ! బాగా పొద్దుపోయింది. ఇక విశ్రాంతి తీసుకోండి. కామిని నా కోసం

ఎదురు చూస్తూ ఉండి ఉంటుంది. రేపు ఉదయం కళ్యాణకేంద్రానికి వెళ్లకతప్పదు. రోజంతా చేయబోయే పనుల వివరాలు పొద్దునే నిర్ణయించవలసి ఉంటుంది. ఆదివారం రోజు కామిని పుట్టినదినం గనుక కేంద్ర నివాసులందరికీ విందు ఏర్పాటు చేయాలనుకున్నాను. దుర్లభసింహ, రాధలు కూడా కామినిని దీవించడానికి వస్తామన్నారు"

దీని తరువాత సీమ, అత్తగారు ఇద్దరూ నిద్రకు ఉపక్రమించారు. తెల్లవారగానే సీమ కళ్యాణకేంద్రానికి వచ్చేసింది. కాస్సేపటికి ఆమె అత్తగారు ఆసుపత్రి నుండి విడుదలై ఇంటికి వెళ్లిపోయింది. సీమ బయల్దేరుతున్నప్పుడు ఆదివారం ఆమెను తీసుకు వెళ్లడానికి వస్తామనీ, దుర్లభసింహతో మాట్లాడి సీమకు బదులుగా మరో సంచాలకుణ్ణి నియమించుకొమ్మని చెప్పమనీ చెప్పింది ఆమె అత్తగారు.

ఆసుపత్రినుండి ఇంటికి వెళ్లాక భర్తతోనూ, మన్‌మోహన్‌తోనూ ఈ విషయం చర్చించింది సీమ అత్తగారు. ఆదివారం నాడు కామిని పుట్టిన రోజును పురస్కరించుకుని కళ్యాణకేంద్రానికి వెళ్లి సీమను తీసుకు రావాలని చెప్పింది. ఆమె ప్రస్తావనను భర్త అంగీకరించాడు. మన్‌మోహన్ ఏదో ఒక అడ్డుపుల్ల వేస్తూనే ఉన్నాడు. ఇప్పుడూ అదేపని చేశాడు. మనిషి మనసు అద్దం వంటిదనీ, ఒకసారి పగిలితే అతుక్కోదని చెప్పాడు. తల్లి ఎంతగానో నచ్చజెప్పగా "సీమ ఆ కళ్యాణ కేంద్రం ఉద్యోగం మానేస్తుందా? లేదా? " అన్నాడు సందేహంగా.

"ఇప్పుడే మాటా చెప్పలేదు, కొన్నాళ్లకి నేను నచ్చచెపుతాన్లే" అంది తల్లి.

"అమ్మా! ఒక నిజం చెప్పనా! తను కళ్యాణకేంద్రంలో పనిచేస్తున్నానని ఆమెకెంతగానో మిడిసిపాటు, అహంకారం. ఆ ఉద్యోగం ఎట్టి పరిస్థితిలోనూ వదులుకోదు. ప్రభుత్వం గుర్తించి సన్మానించాక తనను తాను ఓ దైవాంశ సంభూతురాలిననుకుంటోంది"

ఇలా చాలాసేపు వారి సంభాషణ సాగింది. మన్‌మోహన్ తండ్రి మౌనంగా వింటున్నాడు. అతని స్వభావమే అంత! ఎంతో అవసరమైతే తప్ప కలగజేసుకోడు. రాత్రి చాలా పొద్దుపోవటంతో "ఆదివారం ఎల్లుండే! రేపు సాయంత్రమో, ఎల్లుండి ఉదయమో ఏదో ఒక నిర్ణయానికి వద్దాం. ఏ మహాయుద్ధం తరవాతో సంధికోసం జరుపుకునే చర్చల్లా ఇంతగా హైరానా పడటం ఎందుకు? " అన్నాడాయన విసుగ్గా.

కాలం నిరంతరం సాగిపోతూనే ఉంటుంది. ఆదివారం రావడానికెంతసేపు? నేడు ఆదివారం. కామిని పుట్టినరోజును ఘనంగా జరపాలనుకుంది సీమ. ఇందుకొక కారణం ఉంది. కేంద్రంలో ఆశ్రయం పొందుతున్న అభాగ్యులకు పుట్టినరోజు పండగంటే ఏమిటో తెలియదు. విందు భోజనమూ కరువే! అందరిలోనూ ఉత్సాహాన్ని రేకెత్తించి ఒకరోజు సరదాగా గడిపామన్న సంతృప్తి వారిలో కలిగించాలనుకుంది సీమ.

ఆ మధ్యాహ్నం భోజనం ఖర్చంతా తనే భరించింది. భోజనానంతరం ప్రతినిత్యం వారు చేసినట్లే భగవంతునికి కృతజ్ఞతలు చెబుతూ ప్రార్థన చేశారు. తరువాత కేంద్రవాసులందరూ కామినికి దీర్ఘాయువు, ఆరోగ్యం, సుఖజీవనం ప్రాప్తించాలని దేవునీ ప్రార్థించారు. నిండు మనసుతో కామినిని ఆశీర్వదించారు.

కామిని పుట్టినరోజుకు సీమ సరదాగా చాలా కానుకలు కొనుక్కొచ్చింది. రకరకాల బొమ్మలు, ఆట వస్తువులు, సరికొత్త డ్రెస్సులు వగైరా చూసి కామిని మురిసిపోయింది. బజార్లో కామిని అడిగిన వస్తువులన్నీ కాదనకుండా తల్లి కొనిపెట్టింది. తల్లీ తండ్రీ తనే అయి పెంచుతోంది మరి!

తండ్రి లేడనే కొరత కూతురి మనసులో ఏర్పడకూడదని సీమ తాపత్రయం.

నిర్మల, నీరజ్‌లు వచ్చారు. దుర్లభ సింహ రాధ సాయంకాలం వస్తామని



కబురు చేశారు. ఆ సాయంత్రం నిర్మల అనేక కానుకలను కామినికి అందించింది. నీరజ్ ఓ సైకిల్‌ని బహుమతిగా ఇచ్చాడు. హైద్రాబాద్‌నుండి మంచి ముత్యాల దండ, గాజులు ప్రత్యేకంగా తీసుకు వచ్చింది నిర్మల. వాటిని కామినికి తొడిగింది. ఏనుగు దంతాలతో చేసిన వస్తువులు, చెస్ బోర్డు చివరగా ఇచ్చింది. కామిని సంతోషానికి అంతేలేదు. సైకిలెక్కి హుషారుగా నడపసాగింది.

అంతలో దుర్లభసింహ వచ్చాడు. అతని చేతిలోనూ పెద్ద పాకెట్ ఉంది. సీమ, నిర్మల, నీరజ్‌లు అతన్ని ఆహ్వానిస్తుండగానే రాధా, సోమనాథ్‌లు వచ్చేశారు. వస్తూనే వాళ్లు తమ బహుమతిని కామినికి అందించటమూ, కామిని వాటిని విప్పి చూసి ఆనందించటమూ జరిగాయి. తరువాత దుర్లభసింహ కానుకను విప్పింది. లండన్‌లోని మేడమ్ మేరీ తుసాడ్‌మైనం సంగ్రహాలయానికి మోడల్ అది. దుర్లభ సింహ లండన్, ప్యారిస్‌లలో పర్యటించినప్పుడు ఇది కొన్నాడు. ఇందులో ప్రపంచంలోని అనేక ప్రముఖుల మోడళ్లున్నాయి.

ఇది కామినికే కాదు అందరికీ కొత్తగా అద్భుతంగా అన్పించింది.

అంతలో కామిని రాధా సోమనాధ్‌లు తెచ్చిన బహుమతి విప్పింది. అది పిలల

పార్కు మోడల్. ఇందులో రైలు పార్కంతా చుట్టివస్తుంది. పార్కులో రైలు కదలటం చూసి కామిని ఎగిరిగంతేసింది.

కామిని సంతోషాన్ని చూసి, "కామిని ఆనందానికి ఈ రోజు పట్టపగ్గాల్లేవు. ఈ వయసులో పుట్టినరోజంటే ఇంత ఉత్సాహం, సంతోషం ఉండటం సహజమే! నాలా వయసుపై బడినవారికి ఏం పుట్టినరోజులే అనే ఓ నిర్లిప్తత వ్యాపించి దాని అర్థమే మారిపోతుంది. జుట్టునెరిసి, దంతాలు సడలి, శరీరాన్ని ఏ వ్యాధి ఆక్రమిస్తుందో నని బితుకు బితుగ్గా రోజులు గడపటం అలవాటవుతుంది. కామిని వయసులో ఉన్న పిల్లలు సంవత్సరానికి రెండుమూడు పుట్టిన రోజులు వస్తే బావుంటుందని ఆలో చిస్తే నా బోటివారం రెండు మూడేళ్లకో పుట్టినరోజు వస్తే బావుణ్ణనుకుంటాం" అన్నాడు దుర్లభసింహ.

కాసేపటి వరకు కబుర్లు కొనసాగాయి. మరికొందరు మిత్రులు వచ్చారు. మన్‌మో హన్, అతని తల్లిదండ్రులు ఇంకా రాలేదే మిటా అని చూస్తోంది సీమ. ఎంతదాకా ఎదురు చూడటం? భోజనానికి వేళ మించి పోతోంది. వంటలు చల్లారిపోతున్నాయి. ఆలస్యం అవుతుందని భోజనాలకు సిద్ధం చేయమని ఆదేశించింది సీమ.

భోజనాల సమయంలో దుర్లభసింహ తన లండన్ యాత్రా విశేషాలు చెబుతు న్నాడు. అందరూ ఆసక్తిగా వింటున్నా సీమ అన్యమనస్కంగానే ఉంది. ఆమె కళ్లు పదే పదే ద్వారం వైపే చూస్తున్నాయి. మన సులో ఏదో ఆందోళన. ఘొల్లుమని నవ్వులు విన్పించే సరికి ఈ లోకంలోకి వచ్చింది. దుర్లభసింహ చెబుతూనే ఉన్నాడు.

"మోమ్ సంగ్రహాలయానికి వెళ్లి టిక్కెట్ కొందామని బుకింగ్ ఆఫీసుకి వెళ్లాను. కౌంటర్లో ఓ మహిళ కూర్చుని ఉంది. టిక్కె ట్టిమ్మంటూ డబ్బు ఎదుట పెట్టాను. కుర్చీ లోకూర్చుని ఉన్న ఆ మహిళ ఉలకదు పల కదు. టిక్కెట్టివ్వదు. నాకు వళ్లు మండిపో యిందనుకోండి. కోపంగా ఆమె వైపు చూశాను. ఊహూc! షరా మామూలే! పక్కనుండి వెళ్తున్న వ్యక్తిని పిలిచి నాలుగూ దులిపేశాను. అంతా విని అతడు నవ్వి, 'బొమ్మెలా మాట్లాడుతుందీ" అంటూ వెళ్లిపో యాడు. సిగ్గుతో చితికిపోయాననుకోండి. అసలది బొమ్మలా లేనేలేదు. నిజం మనిషే అనుకుని మోసపోయాను. తరువాత ఆ పక్కనే ఉన్న మరో కౌంటర్‌కి వెళ్లి టిక్కెట్టు కొన్నాననుకోండి" అలా అతని వాక్ప్రవాహం సాగుతూనే ఉంది.

భోజనాలయ్యాక అందరూ తమతమ ఇళ్లకి వెళ్లిపోయారు. మన్‌మోహన్, అతని తల్లిదండ్రులు ఎవరూ ఉత్సవానికి రాలేదు. మన్‌మోహన్ తన పట్టుదల వదల్లేదు. సీమకంటే తను అన్ని విధాలా తక్కువ అనే భావన అతనిలో నిండిపోయి ఉంది. దాన్ని అతిక్రమించ లేకపోతున్నాడు. తన భార్య అన్నిటిలోనూ తనకంటే ఉన్నతంగా ఉండటం సహించలేకపోతున్నాడు. మన్ మోహన్ తల్లి సంధి ప్రయత్నాలు విఫలమ య్యాయి. పైగా కోడలు వీధిలో తిరుగుతూ, ఆడమగా తేడా లేకుండా అందర్నీ పలక రిస్తూ, సలహాలిస్తూ, చర్చిస్తూ, ఉపన్యాసాలి వ్వడం ఆమెకు సుతరామూ గిట్టదు. కోడలు ఉద్యోగం మానేలా లేదు. కొడుకుకు ఆమె పొడేగిట్టడం లేదు. ఇలాంటి పరిస్థితులను తనేం మార్చగలదని ఆమె నిర్లిప్తంగా ఉండి పోయింది.

సంధి కుదరడమంటే ఇరువైపులవాళ్లూ అంగీకరించాలే తప్ప ఒక్కరే తమ షరతు లను మరొకరిపై రుద్దడం కాదనే విషయం ఆమె మర్చిపోయింది.

మన్‌మోహన్, సీమల జీవన రహదా రులు శాశ్వతంగా వేరైనట్లే! ★

## విచిత్ర విచిత్రం



# దుమ్ము దులపకపోతే...

ఈ ఫొటోలోవి వింత జీవులేంకావు. మన మంచాల మీది దుమ్మును 976 రెట్లు పెద్దగా చేసిచూసే మైక్రో కెమేరాతో ఫొటో తీస్తే కనిపించిన దృశ్యమిది!

# చతురకతలు

## కంగ్రాట్స్ ముసలమ్మా!



**బ**స్సు చాలా రద్దీగా వుంది.

నిండుచూలాల్లా వున్న ఆ బస్సులో మగ మిడ్‌వైపులా కండక్టరు చకచకా టిక్కెట్లు కొట్టేపని చేసుకుపోతున్నాడు.

నేను ఆ స్టేజీలోనే బస్సెక్కాను. నాతో పాటు మరో నలుగురు కూడా. ఫుట్‌బోర్డు దగ్గర వాళ్ళు కదలక అలాగే నిల్చుండిపోతే, నేను వాళ్లను దాటుకొని లోపలికి జరిగాను.

కండక్టరు నా దగ్గర కొచ్చేడు.

పాలకొల్లుకు టిక్కెట్ అడిగాను డబ్బిస్తూ.

అతను నా చేతిలో పదిరూపాయల నోటు అందుకొని, నా చేతిలో టికెట్ పెట్టి డ్రైవర్‌వైపు సీట్ల దగ్గరకు వెళ్ళిపోయాడు.

చిల్లర నేను అడగలేదు. ఎందుకంటే దిగేప్పుడు తీసుకోండి అని కండక్టరు అంటాడని నాకు తెలుసు.

బస్సు నడుస్తోంది.

ఆ మార్గం అంతా రోడ్డు గతుకులమయం కావడంవల్ల బస్సు ఎగిరెగిరి పడుతోంది. బస్సులో కూర్చున్నవాళ్ల సంగతి సరే, నిల్చున్నవాళ్ల పరిస్థితే ఘోరంగా వుంది.

అప్పుడు చూశాను నేను.

నాలాగే నిల్చున్నవాళ్లలో చాలామంది ఆడవాళ్లున్నారు. వాళ్ళలో వృద్ధులు, చంటిబిడ్డల తల్లులు కూడా వున్నారు.

బస్సు కుదుపులకు వాళ్లు నిలబడలేక అవస్థలుపడుతూ ఉస్సురుస్సురంటూ నిట్టూర్పులు విడుస్తున్నారు.

కండక్టరు టిక్కెట్లు కొట్టేపని పూర్తిచేసి తన సీట్లో కూర్చొని ఎస్. ఆర్. రాసుకుంటున్నాడు.

"సార్! పాపం ఆడవాళ్లు నిలబడలేక ఇబ్బంది పడుతున్నారు. కాస్త వాళ్ళ సీట్లలో వాళ్లను కూర్చోబెట్టండి!" అడిగాను అతన్ని.

కండక్టరు నావైపు వింతగా చూశాడు.

"అది నా డ్యూటీ కాదు..." విసురుగా అన్నాడు.

"ఇది మీ డ్యూటీ కానప్పుడు... అదెందుకు బస్సులో తీసి అవతల పారెయ్యండి' కండక్టరు ప్రవర్తనకి కోపం వచ్చి అన్నాను.

డ్రైవరు సీటు వెనుక రేకు బోర్డుమీద అందంగా వ్రాయించి వుందది.

"స్త్రీలను గౌరవించడం మన సంప్రదాయం. కనుక వారికి కేటాయించిన సీట్లలో వారినే కూర్చోనిద్దాం" అని గట్టిగా చదివి-

బస్సులో రాసి వున్నదానినే అమలు చేయడానికి మీరే ప్రయత్నం చేయకపోతే ఎలా? " ప్రశ్నించాను.

నా ప్రశ్నకు కండక్టరుకు బాగా చిర్రెత్తుకొచ్చినట్లుంది. "మీకంత సరదాగా వుంటే, ఆ ఆడవాళ్ల సీట్లలో కూర్చున్న మగాళ్లనందర్నీ లేపి, వాటిల్లో ఈ నిలబడ్డ ఆడవాళ్లను కూర్చోబెట్టండి చూద్దాం" అన్నాడు ఛాలెంజీ చేస్తున్నట్టు.

బస్సులోని వాళ్ళందరూ నన్ను చిత్రంగా చూస్తున్నారు.

"వచ్చాడండీ వీరేశలింగంపంతులు"

ఎవరో వెనుకనుండి అరిచారు. తర్వాత నవ్వులు వినిపించాయి.

కండక్టరుకు, నాకూ మధ్య ఇంత వాగ్యుద్ధం జరుగుతున్నా లేడీస్ సీట్లలో కూర్చున్న మగాళ్లకు చీమకుట్టినంత చలనం కూడా లేదు.

నిల్చున్న ఆడవాళ్లు కూడా 'ఇది తమకు సంబంధంలేని వ్యవహారం అన్నట్టు' బస్సు కుదుపులకు తూలుతూనే వున్నారు తప్ప, పెదవి విప్పలేదు.

కండక్టరు నామీద విజయం సాధించినట్టు విలాసంగా ఓ నవ్వు నవ్వి ఎస్.ఆర్. పనిలో పడ్డాడు.

కొద్దిసేపటి తర్వాత బస్సు తర్వాత స్టేజీలో ఆగింది.

అక్కడ పదిమంది దిగితే, పధ్నాలుగు మంది ఎక్కారు.

కండక్టర్ డోర్‌మూసి, రైట్ చెప్పగానే బస్సు కదిలింది.

"కొద్దిగా సోటియ్యి బాబూ! ముసిల్దాన్ని... నిలబళ్లేను... నీకు పున్నెం వుంటుంది"

ఆ స్టేజీలో నలుగురు ఆడవాళ్ళతో కలిసి బస్సెక్కిన అరవైఏళ్లు పైబడ్డ ముసలామె ప్రాధేయపడుతోంది ఆడవాళ్ల సీట్లలో కూర్చున్న వ్యక్తిని.

ఆమెను ఎవ్వరూ పట్టించుకోలేదు.

అంతలోనే ముసలమ్మ ఉన్నట్టుండి విరుచుకుపడిపోయింది.

ఫిట్స్‌తో వూగిపోతున్నట్టు ఆ ముసలామె తమమీద పడ్డంతో ఆ సీట్లోని మగాళ్లు ముగ్గురూ కంగారుగా లేచిపోయి, సీటు ఖాళీచేసి బయటకు వచ్చేశారు.

ఆ సీట్లో కూర్చోబెట్టారు ముసలామెను, ఆమెతోపాటు బస్సెక్కినవాళ్లు.

"మీరూ కూకోండే! బస్సుల్లో ఆడోళ్లకీ పెత్తేకంగా సీట్లిత్తే... ఈల్లెవులే మనల్ని కూకోనియ్యకుండా అడ్డెయ్యడానికి రాండి..'

' అంది ముసలమ్మ కిటికీవైపు తను జరగి, మిగిలిన నలుగురికి ఆ సీట్లోనే చోటు కల్పిస్తూ.

**-యస్.కె.నాగేశ్వరరావు**

## శిక్ష ఎవరికి?

అతను ఓ ప్రముఖ రాజకీయ నాయకుడు. తమ పార్టీ ఎన్నికలలో పరాజయం పొందిన కారణంగా పదవీచ్యుతుడయ్యాడ తను ఆమధ్యనే.



కొత్తపార్టీ అధికారంలోకి రాగానే పాత ప్రభుత్వపు హయాంలో సాగిన స్కాములూ, స్కీములూ బయటపడ్డాయి. ఆ నాయకుడిపైనా అతని సహచరులపైనా క్రిమినల్ కేసులు బనాయించబడ్డాయి. వాటికి సంబంధించిన ట్రయల్స్ న్యాయస్థానాలలో కొనసాగాయి.

వివిధ టెర్రరిస్టు గ్రూపుల హిట్‌లిస్టులలో ప్రథముడైన ఆ నాయకుడు, ప్రభుత్వానికి హయ్యెస్ట్ సెక్యూరిటీ రిస్కు. అందువల్ల రూల్స్ ప్రకారం అతనికి స్పెషల్ ప్రొటెక్షన్ గ్రూప్ (ఎస్.పి.జి) యొక్క ప్రత్యేక రక్షణ కల్పించబడింది.

అయితే అతనిపైన వున్న క్రిమినల్ కేసుల దృష్ట్యా ఎస్.పి.జి రక్షణను ఉపసంహరించుకోవాలనుకుంది ప్రభుత్వం. ఆ ప్రతిపాదనను వ్యతిరేకిస్తూ కోర్టుకి వెళ్లాడతను.

ప్రభుత్వంయొక్క ప్రతిపాదనలోని పూర్వాపరాలను క్షుణ్ణంగా పరిశీలించిన కోర్టు ఆ ప్రతిపాదనను త్రోసిపుచ్చింది. "సంబంధిత శాసనం ప్రకారం ఆ నాయకుడు అండర్‌ట్రయల్‌గా కోర్టులకు హాజరవుతున్నప్పుడేకాక ఒకవేళ అతని నేరాలు రుజువయి శిక్షపడినా, శిక్షాకాలంలో జెయిలులో సయితం ఎస్.పి.జి. రక్షణను కొనసాగించవలసిందే" అని తీర్పు ఇచ్చింది.

కొన్ని నెలలపాటు సాగిన ఆ సెన్సేషనల్ కేసులో ఆరోజు న్యాయస్థానం తీర్పు ఇవ్వబోతోంది.

కోర్టు హాలు, ఆవరణ, పరిసరాలు... అన్నీ జనంతో కిటకిటలాడుతున్నాయి. అయినా అంతటా భయంకర నిశ్శబ్దం ఆవరించుకుంది.

న్యాయమూర్తులు న్యాయపీఠాన్ని అధిష్టించారు. బోనులో ఆ నాయకుడు నిలుచుని వున్నాడు, తీర్పుకోసం ఆత్రుతతో ఎదురుచూస్తూ.

ఎస్.పి.జి గార్డ్సు ఇద్దరూ అత్యంత జాగరూకతతో అతని కిరువైపులా నిలుచుని అప్రమత్తతతో రక్షణనిస్తున్నారు.

ఎదురుచూసిన క్షణం రానేవచ్చింది. "నిందితుడిపైన మోపబడిన నేరాలను ప్రాసిక్యూషన్ సాక్ష్యాధారాలతో నిరూపించింది కనుక ఈ న్యాయస్థానం ముద్దాయికి పదేళ్ల కఠిన కారాగారశిక్షను విధిస్తోంది" అని తీర్పును ప్రకటించింది న్యాయస్థానం.

తీర్పు వెలువడిన మరుక్షణంలో బోను వద్ద దబ్బుమన్న శబ్దం వినిపించింది.

కంగారుగా అటువైపు చూశారంతా షాక్‌తో ఆ నాయకుడు స్పృహతప్పి పడిపోయి వుంటాడని. కానీ చెక్కుచెదరకుండా నిలుచుని వున్నాడతను.

అయితే, అతనికి రక్షణనిస్తోన్న ఎస్.

పి. జి. గార్డ్సు ఇద్దరూ మొదలు నరికిన చెట్లలా నేలమీద పడున్నారు స్పృహతప్పి.

కోర్టులో కలకలం చెలరేగింది.

గబగబా వారి ముఖాలపైన నీళ్లు చల్లి తెలివిలోకి రప్పించారు పోలీసులు.

తెలివిలోకి వస్తూనే న్యాయమూర్తుల్ని వుద్దేశించి ఏకకంఠంగా అరిచారు వారిద్దరూ. "ఇది అన్యాయం మిలార్డ్! ఇతనితోపాటు పదేళ్లు జెయిల్లో మగ్గేందుకు మేం చేసిన నేరమేమిటి? ? "

**–తిరుమలశ్రీ**

# దొంగ

**ఆ**ఖరి ఊచని కూడా లాఘవంగా వంచాక నిశ్శబ్దంగా కిటికీ రాడ్స్ మధ్య ఖాళీలోంచి లోపలికి ప్రవేశించాడు చంద్ర. ఆ గదిలో ఎవరూ లేరు. గుడ్డి వెలుతుర్లో అతన్ని ఆ గదిలోని టి. వి., వి. సి. ఆర్., ఖరీదైన టెలిఫోన్ ఆన్సరింగ్ మెషీన్ ఆకర్షించాయి.

ఆ గదిలోంచి బయటకి వున్న తలుపు దగ్గరకి నడిచి టవర్ బోల్ట్‌ని నిశ్శబ్దంగా జరుపుతూండగా గదిలోని ట్యూబ్‌లైట్ వెలిగింది. ఓ ఆడకంఠం వినబడింది.

"ఎవరది? "

మెరుపులా వెనక్కి తిరిగి చూశాడు. ఎదురుగా ఓ ముప్ఫైఅయిదేళ్ళ యువతి నిలబడివుంది. హౌస్‌గౌన్‌లో వుందామె.

చంద్ర జేబులోంచి మడత కత్తిని తీసి తనవైపు వస్తూండగా క్షణంలో వంగి, దివాన్ కిందవున్న స్టెన్‌గన్‌ని అందుకుని అతనికి గురిపెట్టిందామె.

"దీన్ని ఎలా ఉపయోగించాలో నాకు తెలుసు. ఉపయోగించడానికి నేను వెనుకాడను కూడా"

ఈ హఠాత్పరిణామానికి శిలలా నేలకి అంటుకునిపోయాడు చంద్ర. "చేతులెత్తు" యాంత్రికంగా చేతులెత్తాడతను.

పక్కనే గోడమీద వేలాడుతున్న ఫొటో మీద పడింది అతని దృష్టి దాన్ని బట్టి ఆమె ఐ.ఎ.ఎస్. ఆఫీసర్ త్రినాథ్ భార్యగా గుర్తించాడు. బహుశా అతనికి ప్రభుత్వం నియమించిన గన్‌మేన్ ఆ గన్‌ని ఇంట్లోనే జాగ్రత్తచేసి వెళ్లివుంటాడు.

"నిన్ను కాల్చిచంపినా నా మీదకి నేరం రాదు. ఆ వంచిన కడ్డీలు చాలు. నేను ఆత్మరక్షణకి కాల్చానని రుజువు చేసుకోడానికి. పైన వేలిముద్రలున్న కత్తి అదనపు సాక్ష్యం" చెప్పిందామె. సన్నగా నవ్వుతూ.

"వద్దు. నేను దొంగతనానికి వచ్చాను. వెళ్ళిపోతాను" చెప్పాడు చంద్ర తడబాటుగా.

"గోడవైపు తిరిగి నించో"

"ఎందుకు? "

చంద్ర వెంటనే అటువైపు తిరిగాడు.

"చెప్పినట్లు చెయ్యి ముందు"

"ఇప్పుడు కాలిస్తే వీపులో గుచ్చుకుంటాయి గుళ్లు. అప్పుడది ఆత్మరక్షణకోసం అని పోలీసులకి చెప్పి నమ్మించడం కష్టం. అవునా? " అడిగిందామె నవ్వుతూ.

"ఆల్‌రైట్ నేచెప్పేది విను. బయట ఆగి వున్న వేన్ చూశావా? "

"చూశాను"

"ఖరీదైన పెద్ద వస్తువులని ఇంత తెల్లారు జామున ఎలా మోసుకువెళ్తావు? నీకేంకావాలో అన్నీ ఆ వేన్‌లో లోడ్ చేసుకో"

ఆమె మాటలు నమ్మబుద్ధి కాలేదు చంద్రకి.

"ఏమిటి మీరనేది? " ఆశ్చర్యంగా అడిగాడు.

"నా భర్తంటే నాకు అసహ్యం కాబట్టి ఇవన్నీ తీసుకుపొమ్మంటున్నాను.

"దేనికంత అసహ్యం? "

"తన ఆఫీస్‌క్లర్క్‌తో అక్రమ సంబంధం వెలగపెడుతున్నాడులే" ఆమె మాటల్లో తన భర్తమీద ఉన్న కోపం మొత్తం వ్యక్తమైంది.

"ఈ ఇంట్లోవి ఎన్ని విలువైన వస్తువులు

నువ్వు తీసుకెళ్ళగలిగితే నాకంత మనశ్శాంతి, తృప్తి"

ఆమె చేతిలో స్టెన్‌గన్ లేదిప్పుడు. దాన్ని దివాన్‌కింద యధాస్థానంలో వుంచింది. ఆమె చెప్పేది నిజమే అని తెలియగానే చిరునవ్వు నవ్వాడు ఆనందంగా.

"తెల్లారడానికి ఇంకా గంట టైంవుంది. విలువైనవన్నీ వేన్‌లోకి ఎక్కించెయ్యి. నాకు విడాకులు ఇచ్చి ఆ అమ్మాయిని చేసుకుంటాడట. ఇప్పుడు చేసుకోమను" బోసిగా మారుతోన్న ఇంటిని చూసి ఆనందంగా నవ్వుతుండిపోయిందామె.



"ఇవీ తీసుకెళ్ళు. నేను హెల్ప్ చేయనా? ' ' చెప్పింది కసిగా ఓ ట్రంక్‌పెట్టిని చూపిస్తూ.

"వద్దు. నేను మోయగలను. నాకంత బలం లేకపోతే కిటికీఊచలు ఎలా వంచగలను? " ఆ పుస్తకాల పెట్టిని ఒక్కడే వేన్‌లో పెట్టి తన బలానికి తనే మెచ్చుకున్నాడు చంద్ర. ఆనందంగా ఇంటికి చేరుకున్నాడు అరగంటలో. ఒక్కో వస్తువునే వేన్‌లోంచి తీసి ఇంట్లో దించుకుంటూ వాటిని ఎంతకి అమ్మచ్చో తనకి మొత్తం ఎంత రావచ్చో అంచనా వేసుకోసాగాడు.

పావుగంట తర్వాత వేన్ పక్కనే పోలీస్ జీప్ ఒకటి వచ్చి ఆగింది. అందులోంచి దిగుతున్న సర్కిల్ ఇన్‌స్పెక్టర్‌ని, పోలీస్ కానిస్టేబుల్స్‌ని చూసి ఉలిక్కిపడ్డాడు చంద్ర. ఆమె మోసం చేసిందన్నమాట. తెలివిగా తనని పోలీసులకి పట్టిస్తోంది. ఇద్దరు కానిస్టేబుల్స్ అతని పెడరెక్కలు విరిచి కదలకుండా పట్టుకుంటే ఇంట్లోని సామాను, వేన్‌లో మిగిలిన సామానుని పరిశీలనగా చూసి అడిగాడు సి.ఐ.

"ఎక్కడివివి? "

చంద్రమౌళికి ఏం. చెప్పాలో వెంటనే తట్టలేదు.

"ఐ.ఏ.ఎస్. ఆఫీసర్ త్రినాథ్ ఇంట్లోవేనా? " గర్జించాడు సి.ఐ.

అయోమయంగా తల ఊపడం మినహా ఏం చేయలేకపోయాడు చంద్రమౌళి.

కానిస్టేబుల్స్ వేన్‌లోని ట్రంక్‌పెట్టిని దింపి దాని మూతని తెరిచారు.

అందులోని నలభైఏళ్ళమనిషి శవాన్ని చూసి ఉలిక్కిపడ్డాడు చంద్రమౌళి. స్టెన్‌గన్ గుండు ఒకటి గుండెల్లోకి దిగివుంది. సి.ఐ. వంగి శవం గుండెమీద అంటుకున్న రక్తాన్ని వేలితో ముట్టుకుని చూశాడు. తడిగా ఉంది, గడ్డకట్టిలేదు ఇంకా.

"ఈ శవం ఇందులోకి ఎలా వచ్చింది? "

నిలదీశాడు సి. ఐ.

"నాకు తెలీదు. అందులోవి పుస్తకాలని చెప్పిందామె" ఏడుపుగొంతుతో చెప్పాడు చంద్ర.

"ఎవరామె? " అతని మాటలకి అడ్డుప డుతూ అడిగాడు సి. ఐ.

"నేను దొంగతనం చేయలేదు. ఇవన్నీ ఆయన భార్యే ఇచ్చింది. ఈ శవం సంగతి నాకు నిజంగా తెలీదు" ఏడుపుగొంతుతో అరిచాడు చంద్రమౌళి.

"ఎవరిచ్చారన్నావ్? " గుచ్చి గుచ్చి చూస్తూ అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"ఆ ఐ. ఎ. ఎస్. ఆఫీసర్ భార్యే. పేరడగ లేదు నేను"

"అబద్ధం. ఎందుకిస్తుంది? ఆమెకేమైనా పిచ్చా? "

"నేచెప్పేది నమ్మండి. ఆమెకి తన భర్త మీద కోపం కాబట్టి ఇవన్నీ స్వయంగా నాకు ఇచ్చింది. ఆమె భర్త తన ఆఫీస్‌లో పనిచేసే లేడీక్లర్క్‌తో సంబంధం పెట్టుకుని ఆమెకి విడాకులివ్వాలనుకుంటున్నాడట. నేను దొంగతనం కోసం వెళ్ళినమాట వాస్త వమే. కాని ఆ కోపంతో నిజంగా ఆమే ఇవన్నీ తీసుకెళ్ళమంది"

"ఎల్. కే. జి. కుర్రాడు కూడా నమ్మేలా లేదు నువ్వు చెప్పే కహానీ"

"అర్థమైంది. ఇప్పుడర్థమైంది" అరిచాడ తను ఉద్రేకంగా.

"ఆమె అంత ఉదారంగా ఇవన్నీ ఎందుకి చ్చిందో చెప్పనా? నాకు ఆమె చెప్పింది కట్టుకథ. ఆమే తన భర్తని కాల్చి చంపింది. ఆ సమయంలోనే నేను వెళితే తెలివిగా ఆ శవంతో పాటివన్నీ ఇచ్చింది"

"ఎంత చక్కటి అబద్ధం చెప్పావురా నా తండ్రి"

సి. ఐ. మాటలకు కానిస్టేబుల్స్ కిసుక్కున నవ్వారు.

"నేచెప్పేది నిజం. నేనాటైంకి వెళ్లకపోతే ఆమె ప్లాన్ ఏమిటో నాకు తెలీదు కాని, నా ఖర్మకొద్దీ సరిగ్గా ఆ ఇంట్లోకే వెళ్లాను. లైట్లు వెలగడంలేదని. నన్ను పంపించి నా వెనకే రహస్యంగా ఫాలో అయి ఈ ఇల్లు కను క్కుని వుంటుంది. ఆమే మీకు ఫోన్‌చేసి నా గురించి చెప్పి నన్నిలా ఇరికించివుంటుంది. ఆమే అసలు హంతకురాలు" కీచుగొంతుతో చెప్పాడు చంద్ర.

"ఇది జడ్జి నమ్మితే మంచిదేగానీ ముందీ వెధవని జీప్ ఎక్కించండి" సి. ఐ. కోపంగా చెప్పాడు కానిస్టేబుల్స్‌తో.

కానిస్టేబుల్ చంద్రని లాగుతూ చెప్పాడు.

"త్రినాధ్ భార్య నాలుగురోజులుగా పుట్టింట్లో వుంటోంది. ఒక్క త్రినాధ్ ఆ ఇంట్లో ఉన్నాడని తెలుసుకుని నువ్వీ ముద నష్టపు పనిచేశావు. జరిగింది చూసినవారె వరో ఫోన్‌చేసి చెప్పకపోతే పట్టుబడేవాడివి కాదు నువ్వు"

–మల్లాది వెంకటకృష్ణమూర్తి

## కథానిషేధం

"మా బ్లాక్ ఫాక్స్ కంబైన్స్ ద్వారా నెక్స్ మంత్ ఫస్ట్‌వీక్‌లో ఒక పిక్చర్ స్టార్ట్ చేయా లని ప్లాను చేస్తున్నామమ్మా" చేతిలో ఉన్న కాఫీకప్పు టేబుల్‌మీద పెడుతూ చెప్పాడు నిర్మాత హర్షవర్ధనరావు. కుతూహలంగా ముందుకి వంగింది రచయిత్రి విశాలమ్మ.

"అందుకే వెతుక్కుంటూ మీ దగ్గరకి వచ్చాం. ఈసారి మా సంస్థ ప్రతిష్ఠాత్మకంగా నిర్మించబోయే చిత్రానికి మీరు కథ సమ కూర్చాలి" చెప్పాడు ఆనందరావు తన చే తిలో ఉన్న కాఫీ కప్పు కుర్చీకింద పెడుతూ. బావమరిదికేసి నవ్వుతూ చూశాడు హర్షవర్ధ నరావు.

"మీరు నన్ను క్షమించాలి. ఈమధ్యకా లంలో నేను ఏమీ వ్రాయలేకపోయా. నా చేతిలో కథలు ఏవీ లేవండి ప్రస్తుతం" అంది




రచయిత్రి విశాలమ్మ బాధగా.

"డిపాజిట్లు లేక స్విస్‌బ్యాంక్‌లు దివాళా తీశాయంటే నమ్ముతాను. తమిళనాడుకి ఇవ్వటానికి కర్నాటక రాష్ట్రం దగ్గర చుక్కనీరు లేదంటే నమ్ముతాను. కానీ మీ దగ్గర కథలు లేవంటే మాత్రం నేను నమ్మను. కథలు దొరకని ఈ చిత్రప్రపంచ ఎడారిలో మీరు ఒయాసిస్సువంటివారు. మీరు సమకూర్చిన కథలవలన గతంలో ఎన్నో చిత్రాలు విజయవంతంగా ప్రదర్శించబడిన సంగతి నాకు తెలుసు'' అన్నాడు ఆనందరావు చిన్నగా నవ్వుతూ.

"మీరు చెప్పింది అక్షరాలా నిజమే. అయితే నేను ప్రస్తుతం నిస్సహాయురాలిని. నేను కథలు వ్రాయటం మానేసి చాలాకాలం అయింది'' చెప్పింది విశాలమ్మ చిన్నగా నిట్టూర్చి.

"పోనీ మీరు గతంలో వ్రాసిన నవలలు ఏమన్నా ఉంటే ఇవ్వండి. వాటినే సినిమాగా రూపొందించుకుంటాం" అడిగాడు హర్షవర్ధనరావు ఆశగా చూస్తూ.

"అందుకు కూడా మీరు నన్ను క్షమించాలి. పబ్లిష్ అయిన నా నవలలన్నీ ఇదివరకే చలనచిత్రాలుగా రూపొందాయి. ప్రస్తుతం చాలామంది పబ్లిషర్స్ కూడా అడుగుతున్నారు. మంచి రచనలు ఏమన్నా ఉంటే ఇవ్వమని. సారీ చెప్పి పంపించేశాను వాళ్లని. అందుకే మీకు కూడా..." ఇక ఆపై చెప్పలేక ఆగిపోయింది విశాలమ్మ.

"సారీ చెప్పి పంపిచేస్తానంటున్నారు. అంతేకదా. రచయిత్రిగా ఒకరోజులో టన్ను కాగితాలని నలుపు చేస్తారన్న పేరుంది మీకు. మీరు కథకి ఎంత డిమాండ్ చేసినా ఇవ్వటానికి సిద్ధమే. లేదా బ్లాంక్ చెక్ ఇస్తాను. మీ ఇష్టం వచ్చిన ఫిగర్ వేసుకోండి. మీకు ఇక్కడ మూడ్ కుదరకపోతే ఊటీలో ఒక కాటేజి బుక్ చేస్తాను. ప్రశాంతంగా కూర్చుని వ్రాసి ఇవ్వండి. మీ మూడ్ కూడా బాగుంటుంది'' చెప్పాడు హర్షవర్ధనరావు.

"మూడ్ కుదరక కాదండీ నేను రచనలు చేయటం మానేసింది. ప్లాటు దొరక్క. మంచి ప్లాటు ఉంటే రెండు రోజుల్లో నవల పూర్తిచేసేస్తాను'' ధీమాగా చెప్పింది విశాలమ్మ.

"మరి ప్లాటు గురించి ప్రయత్నించండి'' సలహా ఇచ్చాడు ఆనందరావు.

"ఇదివరకు మా వారు ఫ్రెండ్స్‌తో రాత్రి తెల్లవార్లూ తాగితందనాలాడి వచ్చి అలా వచ్చినందుకు ఏదో కథ చెప్పేవారు. ఆ కథ ఆధారంగా రచనలు చేసేదాన్ని. చెప్పిన కథ చెప్పకుండా తాగి ఆలస్యంగా వచ్చిన ప్రతీ సారీ ఒక కథ చెప్పేవారు. ఆ రసవత్తరమైన కథకి కాస్త రంగులు అద్ది నేను నవల రూపంలోకి మార్చేదానిని. కానీ ప్రస్తుతం మద్యనిషేధం అమలులో ఉందికదా. అందుకే మావారు ఆఫీసు అయ్యాక ఇంటిపట్టునే ఉంటున్నారు కొత్త కథలేవీ సృష్టించకుండా. ఆయామ్‌సారీ'' అని చెప్పి భారంగా కుర్చీలోనుంచి లేచి నిలుచుంది విశాలమ్మ.

-కాశీభట్ల భానుమూర్తి

# ఎయిడ్స్

హాస్పిటల్ ఓ.పి ఖాళీగ వుంది. డాక్టర్ రఘు తన కుర్చీలో కూర్చుని ఆలోచిస్తున్నాడు. తను ఉద్యోగంలో జాయిన్ అయిన దగ్గర్నించి జీతాలు రావటం లేదు. 'రఘు' పనిచేసే శాఖ కొత్తగా ఓపెన్ చేసిన "ఎయిడ్స్ వ్యాధి నిరోధక విభాగం" కాబట్టి ప్రభుత్వం దాన్ని చిన్నచూపు చూస్తోంది.

జీతపురాళ్ళకోసం 'మెడికల్ డైరక్టర్'కి ఒక టెలిగ్రామ్ కూడా పంపించాడు. దానికి 'రిప్లయి' ఏదీ రాలేదేమిటా? అనుకుంటున్నాడు.



ఇంతలో ఇద్దరు వ్యక్తులు లోపలికి వచ్చారు. తమనితాము పరిచయం చేసుకుంటూ "మేము హైదరాబాద్‌నుంచి మీకోసం వచ్చాం. మెడికల్ డైరక్టర్‌గారు పంపించారు'' అన్నారు.

'డైరక్టర్' అంటున్నారు కాబట్టి తప్పనిసరిగా తన జీతం వివరాలు గురించే అయి వుంటుంది అనుకొన్నాడు రఘు. వాళ్ళకి 'కాఫీ' తెప్పించి యిచ్చాడు. వాళ్ళు ఆత్రంగా తాగేసి విచిత్రంగా చూస్తున్నారు డాక్టర్ రఘు కేసి.

"ఊ... చెప్పండి... నా సేలరీ పర్టిక్యులర్స్ ఏమైనా పంపించారా?"

"అవేమీ యివ్వలేదుసార్!" ముక్త కంఠంతో అన్నారిద్దరూ.

"మరి మిమ్మల్నెందుకు పంపించినట్లు అక్కడ్నుంచి?"

వారు కామ్‌గా ఒక గులాబిరంగు కాగితాన్ని 'రఘు' చేతిలో పెట్టారు. "యస్. ఇదే నేను పంపిన టెలిగ్రామ్..." అన్నాడు రఘు.

"అందుకే మేము వచ్చాం సార్' అన్నారిద్దరూ.

"ఎందుకు?"...

"మీరు టెలిగ్రామ్‌లో ఏమని మెసేజ్ పంపారో ఒకసారి చూడండి సార్!"

అప్పుడు చూశాడు రఘు. దానిలో "ప్లీజ్ సెండ్ 'ఎయిడ్'' అని వుంది. తను నిధులు లేక "ప్లీజ్ సెండ్ 'ఎయిడ్'' అని పంపిస్తే తంతి తపాలాశాఖవారి నిర్వాకం మూలాన జరిగిన విపరీత పరిణామం అది.

"అంటే మీరిద్దరూ..." సందిగ్ధంగా అడిగాడు.

"అవును సార్... మాకిద్దరికీ ఎయిడ్స్ వ్యాధి వచ్చిందేమోనని అనుమానంగా వుంది. ఇక్కడ పరీక్ష చేయించుకోమని 'డైరక్టర్‌గారే పంపించారు''

వెంటనే డాక్టర్ రఘు గుడ్లు తేలేశాడు.

-డా. కె.శివసుబ్బారావు

# రచయితలకు మనవి



- ★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో *100* పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో *100* పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**
- ★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**
- ★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- ★ ***ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.***

ఎడిటర్:

# చతుర

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.

# చతురప్రపంచం

## స్టేటస్ సింబల్

పాతికేళ్ల క్రితం వరకూ పల్లెటూళ్లల్లో వాచ్‌ని స్టేటస్ సింబల్‌గా భావించేవారు. మామూలుగా పల్లె ప్రజలు పంచాయితీ గడియారం కొట్టే గంటలనుబట్టిగానీ, చర్చ్ లేదా దేవాలయపు గంటల మోతను గమనించి టైము తెలుసుకునేవారు.

కానీ అటుపైన పల్లెల్లో కూడా ఎన్నో మార్పులు చోటు చేసుకున్నాయి. క్వార్ట్జ్ గడియారాల శకం ఆరంభమయింది. గ్రామాల్లో ఎవరిచేతికి చూసినా క్వార్ట్జ్ వాచీ కనిపించేది. అప్పట్లో వాటిని ఒక్కొక్క వాచీ కేవలం 25 రూపాయలకు అమ్మేవారు. "కొత్తకొత్త మోడల్స్, ఒకే ఒక్క బ్యాటరీతో ఏడాది పనిచేస్తాయి'' అంటూ ఆ కంపెనీవారు ప్రకటనలిచ్చేవారు.

ఈ క్వార్ట్జ్‌వాచ్‌ని మినరల్ స్టోన్‌తో తయారుచేస్తారు. ఈ మినరల్ స్టోన్స్ చవకగా కుప్పలు తెప్పలు దొరుకుతాయి. ఇందులోని అతిముఖ్యమైనది మెటల్ సిలికాన్ ఆక్సైడ్. ఇది రంగులేనిది, పారదర్శకమైనది.

ఈ క్వార్ట్జ్‌కి ఇంకో గుణం కూడా వుంది. ఈ క్రిస్టల్స్‌కి కదిలే గుణం వుంది. ఒక అతిచిన్న క్వార్ట్జ్ క్రిస్టల్ సెకండుకి 32768 సార్లు తిరుగుతుంది. అది తిరుగుతున్నట్టు మన కంటికి కనుపించదు. దాన్ని కొలవడానికి అత్యాధునిక ఎలక్ట్రానిక్ పరికరం అవసరం. సైంటిస్టులు ఈ క్వార్ట్జ్ వాచ్‌యొక్క సహజసిద్ధమైన చలనాన్ని శాస్త్రపరమైన గృహోపయోగాలకి ఉపయోగించే విధంగా మార్చాలనుకున్న ఫలితంగా క్వార్ట్జ్ క్రిస్టల్ వాచీలు ఉత్పత్తి కావడం ప్రారంభించాయి.

ఎలక్ట్రానిక్ క్వార్ట్జ్ వాచీలో ఓ చిన్న బ్యాటరీ, క్వార్ట్జ్ క్రిస్టల్, ఒక సర్క్యూట్ వుంటుంది. క్వార్ట్జ్ క్రిస్టల్ సహజంగానే



చలనం కలిగి వుంటుంది గనుక ఒక రకమైన శక్తితో తిరుగుతుంది. అయితే ఈ శక్తిని ఉపయోగించుకోడానికి ఓ మధ్యవర్తిత్వం నెరపే పరికరం కావాలి. అదే బ్యాటరీ. క్వార్ట్జ్ క్రిస్టల్స్‌లోని ప్రకంపనలు బ్యాటరీ సహాయంతో పల్సెస్‌గా మారతాయి. అలా వచ్చిన పల్స్ వాచ్‌లోని ఇంటెగ్రేటెడ్ సర్క్యూట్‌కి పంపబడుతుంది.

ఈ ఇంటెగ్రేటెడ్ సర్క్యూట్ యొక్క ముఖ్యోద్దేశం వాచ్‌లోని గమనాలను గంటలు, నిమిషాలుగా విడగొట్టి వాచ్ ప్లేటుమీదకి పంపుతూండటం.

అంకెలు ప్లేటుమీద ముందుగానే అమర్చబడివుంటాయి. ఇవి చుక్కల్లా అమరి వుంటాయి. ఒక్కొక్క చుక్కని కరెంట్ తాకగానే ఆ చుక్క మనకు కనబడి టైమును తెలియజేస్తుంది. ఇదే ఎలక్ట్రానిక్ వాచ్ యొక్క ముఖ్యమైన పని.

# క్యాసెట్లయుగం

**1898**లో ఇంగ్లండుకు చెందిన వి.బి.వోవెన్ అనే ఆయన 'గ్రామ్‌ఫోన్ కంపెనీ లిమిటెడ్' అనే సంస్థను స్థాపించాడు. ఆ రోజుల్లో గ్రామ్‌ఫోన్ రికార్డులు, యంత్రాలు అమెరికానుంచి ఇంగ్లండుకు ఎగుమతి అయ్యేవి. అదే సమయంలో 'ముటోస్కోప్ కంపెనీ' ఇండియాలో స్థాపించబడి గ్రామ్‌ఫోన్ రికార్డులను దిగుమతిచేసుకుని ఇక్కడ అమ్మకాలను కొనసాగించింది. ఇవన్నీ పాశ్చాత్య సంగీతానికి సంబంధించినవే.

1902లో టి.డబ్ల్యు గాట్స్ బర్గ్ అనే ఆంగ్లేయుడు హిందుస్థానీ సంగీతం యొక్క గొప్పతనాన్ని గుర్తించి ఆ రాగాలతో రికార్డును తయారు చేయడం ప్రారంభించాడు. అప్పుడు కూడా సంగీతంలో మంచి ప్రావీణ్యత వున్న కళాకారులుండేవారు. ఇప్పటికీ ఆ గొంతులు ఎంతో శ్రావ్యంగా మనకు వినిపిస్తాయి. దులారీ, గౌహర్‌జాన్, జోహ్రా, మల్కాజాన్, ఇందుబాల, కమల ఇలా ఎంతోమంది కళాకారులు తమ గాత్ర మాధుర్యాన్ని గ్రామ్‌ఫోన్ రికార్డులద్వారా వినిపించారు. నిజానికి ఇప్పుడున్నన్ని వాయిద్యాలు అప్పుడు లేవు. అయినా తక్కువ వాయిద్యసాధనాలతోనే శ్రావ్యమైన గానాలు వినపడేవి. హార్మోనియం, తబల, సరోద్, గంటలు, క్లారినెట్ ఇవే అప్పటి వాయిద్యసాధనాలు. ఠుమ్రి, గజల్, కవాలి మొదలైన పద్ధతులలో వుండేవి పాటలు. వీటన్నిటినీ మళ్ళీ రీ ప్రోసెసింగ్ కోసం హనోవర్ పంపించేవారు. ఇండియాలో వీటి అమ్మకం బ్రహ్మాండంగా సాగేది. రానురాను గ్రాంఫోన్ ఒక స్టేటస్ సింబల్‌లా తయారయ్యింది.

అప్పట్లో పాటంతా అయిపోయాక చివరలో గాయకుడు లేదా గాయకురాలు తమ పేరు చెప్పుకునేవారు.

1908లో కలకత్తాలోని బాలియా ఘాట్‌లో మొట్టమొదటి గ్రాంఫోను కంపెనీ స్థాపించబడింది. అప్పట్లో పాశ్చాత్య సంగీతం ఎక్కువ ప్రాచుర్యంలో వుండేది. లాఫింగ్ సాంగ్, పీనట్ వెండర్ మొదలైన పాశ్చాత్య సంగీత రికార్డ్‌లకి ఎక్కువ డిమాండ్ వుండేది. అయితే బాలియా ఘాట్ కంపెనీ చాలా చిన్నది కావడంచేత డిమాండ్‌కి సరిపడ ఉత్పత్తి చేయలేకపోవడంతో 1928లో కలకత్తాలోని డమ్‌డమ్‌వద్ద మరో పెద్ద ఫ్యాక్టరీ నెలకొల్పబడింది.

గ్రామ్‌ఫోన్ రికార్డ్స్ ఇండియాలోనే తయారయినా, గ్రామ్‌ఫోన్ మెషీన్‌ని మాత్రం దిగుమతి చేసుకోవలసి వచ్చేది. అందులో ముఖ్యంగా జపాన్‌నుంచి దిగుమతి అయ్యే యంత్రాలకి మరింత గిరాకీ వుండేది. ఇవి ఒక్కొక్కటీ 10 రూపాయల ధర పలికేది. ఆ తరువాత బొంబాయి, ఢిల్లీలలో కూడా గ్రామ్‌ఫోన్ ఫ్యాక్టరీలు వెలిశాయి. అయితే వాటి కాంపొనెంట్స్‌ని మాత్రం విదేశాలనుంచి దిగుమతి చేసుకునేవారు. రానురాను రికార్డింగ్‌లో అనేక కొత్తకొత్త టెక్నిక్‌లు ప్రవేశించాయి.

దేశ ఆర్థిక, రాజకీయ పరిస్థితులకనుగు ణంగా గ్రామ్‌ఫోన్ రికార్డుల్లోని పాటలు కూడా మార్పు చెందాయి. స్వాతంత్ర్యోద్యమ సమయంలో ప్రజలు పాశ్చాత్య సంగీతానికి స్వస్తి చెప్పి దేశభక్తికి, దేశ సంస్కృతీ సంప్రదాయాలకి అద్దంపట్టే పాటలను ఆదరించడం ప్రారంభించారు. బొంబాయిలోని టి.యం. రామచందర్ కంపెనీ రామాగ్రాఫ్ అనే పేరు మీద అనేక భారతీయ భాషల్లో రికార్డులను తయారుచేసింది.

మన సంగీత ప్రపంచం ఎంతో సువిశాలమైనది కావడంచేత ఒకే ఒక్క కంపెనీ ద్వారా శ్రోతలందర్నీ సంతృప్తిపరచడం కష్టతరమయినప్పుడు కొలంబియా, ఓడియాన్ కంపెనీలు ఇండియాలోకి అడుగుపెట్టాయి. వారికి స్వంత రికార్డింగ్ స్టూడియోలుండేవి. ఇంకా మరెన్నో చిన్న చిన్న కంపెనీలు కూడా చక్కని సంగీత రికార్డులను తయారు చేయడం ప్రారంభించాయి. సెనోలా రికార్డింగ్ కంపెనీ కేవలం బెంగాలీ సంగీతాన్ని అందించేది. మిగతా కొన్ని కంపెనీలవారు హెచ్.ఎమ్.వి. స్టూడియోలో రికార్డింగ్‌లు చేసేవారు. అప్పట్లో సినిమాల్లో పాటలు ఆయా నటీనటులే పాడాల్సి వచ్చేది. గాత్రశుద్ధి వున్నా లేకపోయినా తప్పనిసరిగా పాడేవారు. అయితే 1930 నుంచే ప్లేబ్యాక్ సింగర్స్ పాడటం ప్రారంభించారు.




కాలక్రమేణా పక్కవాయిద్యాలలో కూడా పాశ్చాత్య వాసనలు చోటుచేసుకోవడంతో గిటార్, శాక్సోఫోన్, డ్రమ్స్, జాజ్ వగైరా సాధనాలన్నీ సంగీతంలో చోటుచేసుకున్నాయి.

ఇప్పుడు ఇవి చాలావరకు కనుమరుగయి క్యాసెట్ల యుగం ప్రారంభమయింది.

## కలలోని నిజం

'**క**లకాన్నిదీ, విలువైనది... బతుకు...' అంటూ ఓ సినీకవిగారు జీవితంమీద చక్కని పాట రాశారు. అంటే ఇక్కడ 'కల' అనేమాట మనకి కల్ల, అబద్ధం అని అర్థం చెబుతోంది. కల అంటే కల్లే అని చాలా మంది అభిప్రాయం. కలల్లో మనం ఎన్నో ఊహాతీతమైన పనులు చేయగలుగుతాం. అసాధ్యకర సంఘటనలు తిలకించగలుగుతాం. అయితే అవన్నీ అబద్ధాలే అయితే కొన్ని కలలు నిజాలుగా మారిన సంఘటనలు కూడా లేకపోలేదు. చరిత్ర తిరగేస్తే దీనికి ఎన్నో ఉదాహరణలున్నాయంటున్నారు శాస్త్రవేత్తలు.

1812లో నెపోలియన్ సైన్యం రష్యావైపుకి దూసుకుపోతోంది. ఆ సమయంలో కౌంట్ డౌట్‌కాఫ్ అనే ఒక రష్యన్ జనరల్ భార్యకి

ఓ కల వచ్చింది. అందులో తన భర్త బోర్డి యానా నగరంలోని ఓ చిన్న సత్రంలో చంపబడివున్నట్టు కనిపించింది. ఆమెకు మర్నాడు కూడా అదే కల వచ్చింది. వెంటనే ఆ విషయాన్ని ఆమె తన భర్తకు తెలియజేసింది. అతడు కూడా భయపడ్డాడుగానీ, ఆ పేరుగల నగరమే అతడికి కనపడలేదు. దాంతో అతడు ఆ విషయాన్ని తాత్కాలికంగా మర్చిపోయాడు. 1812 సెప్టెంబర్ 7న పూర్తిగా ఓటమిని ఎదుర్కొనే స్థితిలో వున్న రష్యన్ సైన్యం తిరిగి విజృంభించి ఫ్రెంచి సైన్యంతో తలపడింది. సరిగ్గా బోర్డినా అనే గ్రామం వద్ద యుద్ధం భీకరమై కౌంట్ టౌట్ కాఫ్ ఘోరంగా చంపబడ్డాడు. అయితే కలలో కనిపించినది ఓ పెద్ద నగరమయితే ఇది ఓ కుగ్రామం. అందుకే ఆ పేరుగల నగరంలేదని ఆ జనరల్ కొట్టిపారేశాడు. ఈవిధంగా ఆవిడ కల నిజమైంది.

కలలమీద జరిగిన కొన్ని పరిశోధనల ప్రకారం చూస్తే నిద్రపోయిన వెంటనే వచ్చే కలల కాలపరిమితి చాలా తక్కువగా వుంటుందంటున్నారు. గాఢనిద్రలోకి జారుకున్నాక వచ్చే కలలు సుదీర్ఘంగా వుండి ఎక్కువసేపు వుంటాయి. నిద్రపోగానే వచ్చే కలలన్నీ సాధారణంగా మన నిత్యకృత్య వ్యవహారాలకు సంబంధించిన విషయాలై వుంటాయి. అర్ధరాత్రి దాటాక వచ్చే కలలు జీవితంలో ఎప్పుడో జరిగిన పాత సంఘటనలకి సంబంధించినవి అయివుంటాయంటున్నారు స్వప్న పరిశోధకులు.

ఆంధ్రా యూనివర్సిటీలో సైకాలజీ అండ్ పారాసైకాలజీ ప్రయోగశాలకి అనుబంధంగా, మొట్టమొదటిగా కలల ప్రయోగశాల ప్రారంభించబడింది. ఇక్కడి వాలంటీర్లందరూ నిత్యం కలుసుకుని తమకు వచ్చిన కలలను డెయిరీలలో రాస్తారు. ఈ డెయిరీలను రహస్యంగా భద్రపరుస్తారు.




సామాన్య మానవుడికి కలల గురించి అంతగా పట్టదుగాని రచయితలు ఈ కలల వల్ల ఎంతో ప్రేరణ పొందుతారని కొంతమంది అభిప్రాయం. లూయిస్ స్టీవెన్‌సన్ అనే రచయిత తన రచనలకి ప్రేరణ తన కలలే అంటాడు. అతని ప్రఖ్యాతనవల 'డాక్టర్ జెకెల్ అండ్ మిస్టర్ హైడ్'లోని ప్రధాన, ఉప ఇతివృత్తాలు రెండూ కూడా కలలనుంచి వచ్చినవే అంటాడు.

ఒకసారి అతను కలలో ఓ దొంగ జైలు నుంచి తప్పించుకుపోతున్నట్టు చూశాడు. ఆ దొంగను వెంటాడుతూ పోలీసు పరుగె

డుతున్నాడు. అంతలో హటాత్తుగా ఆ దొంగ తన జేబునుంచి ఏదో పౌడర్‌లాంటిది తీసి తనపై చల్లుకున్నాడు. వెంటనే అతను రూపు మారిపోయింది. ఇది అతనికి ఒక చక్కని నవల రాయడానికి ప్రేరణనిచ్చింది. అలాగే ఛర్‌లాట్‌బేన్ కూడా తన రచనలకి మూలం తన కలలే అంటాడు.

ఒక్క రచయితలకే కాకుండా శాస్త్రవేత్తలకి కూడా కలలు ఉపయోగిస్తున్నాయి. ఓ శాస్త్రవేత్తగారు తన కల సహాయంతో బెన్‌జైన్ కెమికల్‌ని తయారుచేశారు. కలలో ఒక పాము అణువులాగా అటూ ఇటూ కదులుతూ తన తోకని తన నోట్లో పెట్టుకున్నట్టు కనిపించింది ఆయనగారికి. అలాంటి విచిత్ర భంగిమ ఆయనను బెంజైన్ కెమికల్ తయారీకి ప్రోత్సహించింది. నోబెల్ ప్రెయిజుగ్రహీత నీజ్ ఓహర్ అనే శాస్త్రవేత్త అణువు యొక్క ఆకారాన్ని డెవలప్ చేయడం వెనుక అతని కలల ప్రేరణ వుంది. జేమ్స్‌వాట్ లెడ్ బుల్లెట్ల యొక్క ప్రాథమిక ఆకారాన్ని కలల ప్రేరణతోనే తయారుచేశాడు. సింగర్ తయారుచేసిన కుట్టుమిషన్ వెనుక కూడా అతని కలలున్నాయి.

అందుచేత చివరగా చెప్పేదేమంటే కలలు పూర్తిగా కల్లలని కొట్టిపారేయడానికి లేదు. అప్పుడప్పుడు వాటికెంతో విలువనివ్వాల్సిన అవసరం కూడా వుందని తెలుస్తోంది.

# మన మామిడి

**ప**ళ్లన్నిటిలోను మామిడి పండుదే ఉన్నత స్థానం అని చెప్పక తప్పదు. మామిడి పండు ఇష్టపడనివారున్నారంటే ఆశ్చర్యమే. ఇండియాలో పది లక్షల హెక్టార్ల భూమిలో మామిడి పంటవుంది. అందులో కేవలం ఉత్తరప్రదేశ్‌లోనే 4 లక్షల హెక్టార్ల మామిడి తోటలున్నాయి. సంవత్సరానికి 93 లక్షల మెట్రిక్ టన్నుల మామిడి ఫలసాయం అందుతోంది. ఇందులో 4వ వంతు మొత్తం ఉత్తరప్రదేశ్‌లో పండేదే. ఉత్తరప్రదేశ్‌లో ఒక్క మవిహాబాద్‌లోనే సుమారు పది లక్షల టన్నుల 'దశహరీ' మామిడిపళ్లు పండుతాయ. నిజానికి ఈ మామిడి చెట్లను పెంచి, పోషించి, ఫలసాయాన్ని జనానికి అందించే రైతులు కడు పేద స్థితిలో వున్నారు. వీరికి ప్రభుత్వం నుంచి గ్రాంట్లుగానీ, ప్రయివేటు సంస్థలనుంచి ఎలాంటి సహాయలుగానీ అందడంలేదు. లక్నోనుంచి కాకోరీ వెళ్లేదార్లో 'దశహరీ' అనే గ్రామంలో ఈ దశహరీ మామిడి చెట్టు మొదట కనుపించింది. అప్పటి బ్రిటిష్ కలెక్టరు ఆ విత్తనాన్ని ఇతర రాష్ట్రాలకు వెళ్లనివ్వకుండా చేసి దానిమీద గుత్తాధిపత్యం చెయ్యాలనుకున్నాడుగానీ అది సాగలేదు.

భారత ప్రభుత్వం ఇప్పుడిప్పుడే మేలుకొని మామిడి చెట్ల యజమానులకు ప్రోత్సాహన్నందిస్తోంది. క్రిందటి సంవత్సరం మలిహాబాద్‌నుంచి రామ్‌ఖేడా వరకుగల ప్రాంతాన్ని మాంగోబెల్ట్‌గా ప్రకటించింది ప్రభుత్వం. తగ్గింపు రేట్లతో ఎరువులు, చెట్లకు ఇన్సూరెన్స్‌లు, రుణాలు వగైరా ఎన్నోవిధాల రైతులకు సహాయం చేయడానికి పూనుకుంది.

నిజానికివన్నీ పైపై చర్యలేగానీ అసలైన పేద రైతులకు ఇవేమీ సరిగ్గా అందడం లేదని కొంతమంది ఆరోపణ. ఇప్పటికీ అక్కడక్కడ ఈ మామిడిచెట్లు ఝుంకా, రెడ్‌పెస్ట్, బుకుని మొదలైన వ్యాధులు సోకి పాడయిపోతున్నాయి. వీటి నివారణకు ఉపయోగపడే మందుల ధరలు ఆకాశాన్నంటడంతో సామాన్య రైతులు వీటిని ఉపయోగించలేక పోతున్నారు. ఒకప్పుడు 'తుమ్‌కీ' మామిడి పండ్లు విస్తారంగా కాసేవి మనదేశంలో. కానీ ప్రభుత్వం చూపే అశ్రద్ధవల్ల అప్పటి పంటలో ప్రస్తుతం 4వ వంతుకూడా ఇప్పుడు లేదు.

ఇవికాక కొన్ని నకిలీ మందులు కూడా మార్కెట్‌లోకి రావడంతో భయపడే రైతులు




చొరవగా ముందుకు రాలేకపోతున్నారు. రైతుకు కష్టానికి తగ్గ ఫలితం పండిన పంటకు దక్కడంలేదు. బయట బజారులో కిలోకి 8 నుంచి 10 రూపాయలు ధరపలికే మామిడి పండు రైతు చేతికి మాత్రం కిలోకి రెండులేక మూడు రూపాయల్ని అందజేస్తోంది. మధ్యలోని ఏజెంట్లు, కమిషన్‌దారులు లాభాలు చేసుకుంటున్నారు. రైతులు అమాయకులు, చదువులేని వారు కావడం దీనికి కారణం.

మామిడి చెట్లకు సోకే వ్యాధులన్నింటికీ అత్యంత శక్తివంతమైన మందులున్నాయి గానీ సైంటిస్టులకి, రైతులకి మధ్య అవగాహన, సరైన ఒప్పందం వుంటేనే అవి రాణిస్తాయి.

మొత్తంమీద ప్రభుత్వం కల్పించుకుని తగిన చర్యలను తీసుకుని రైతులకు ప్రోత్సాహాన్నిస్తే మామిడి పంట దేశంలో మరింత ఇబ్బడిముబ్బడిగా పండటం ఖాయం.

## సంగీతం ఓ చక్కని ఔషధం

'సంగీతానికి రాళ్లు కూడా కరుగుతాయి' అన్న మాట మనకు తెలిసిందే. రాళ్లు కరిగినా కరగకపోయినా శారీరక, మానసిక అనారోగ్యాలకి మాత్రం సంగీతం ఓ చక్కని ఔషధం అని ఈ మధ్య కొంతమంది పెద్దలు నిరూపించారు కూడా. సంగీతంతో చికిత్సా విధానం ఈమధ్య చాలాచోట్ల నిర్వహించబడుతోంది.

మదనపల్లికి దగ్గరగా సముద్రమట్టానికి 2400 అడుగుల ఎత్తున వున్న రుషీవాలీలో ప్రముఖ తత్త్వవేత్త జిడ్డుకృష్ణమూర్తిద్వారా ఓ స్కూలు స్థాపించబడింది. అందులో లెక్కలు, సైన్సు, ఇతర భాషా శాస్త్రాలతోపాటు, కర్నాటక సంగీతం, మృదంగం, భరతనాట్యం వగైరాలు కూడా నేర్పిస్తున్నారు.

నిజానికి అలాంటి ప్రశాంత వాతావరణంలో సంగీతం నేర్చుకోవాలనే ఉత్సాహం ఎలాంటివారికైనా కలుగుతుంది. ఆ స్కూల్లో కర్ణాటక సంగీతాన్ని నేర్పే ఉపాధ్యాయురాలు మరెవరో కాదు, ప్రఖ్యాత గాయని ఎమ్.ఎల్. వసంతకుమారి. అప్పటి యునైటెడ్ నేషనల్ అఫీషియల్ సి. వి. నరసింహం, మృదంగ విద్వాంసులు పాల్‌ఘాట్ మణి అయ్యర్, అప్పటి ప్రఖ్యాత గాయకుడు జి.ఎన్. బాలసుబ్రహ్మణ్యాం మొదలైన వారందరి కోరికపై ఆమెని అక్కడి స్కూల్లో సంగీతం టీచర్‌గా నియ

మించడం జరిగింది.

ముఖ్యంగా అప్పట్లో ఎమ్. ఎల్. వసంత కుమారికి తన కుటుంబంలో ఏర్పడిన కష్టాలు తీరని ఆవేదనకి గురిచేసిన సమయంలో సాంత్వన కలిగిస్తూ వచ్చిందీ అవకాశం.

మొదట్లో అలా స్కూల్లో ఓ పద్ధతి ప్రకారం, సిలబస్ ప్రకారం సంగీతాన్ని నేర్పడం కష్టమే అనిపించింది ఆమెకు. అయినా రానురాను అది ఆమె నిత్యకృత్య జీవితంలో ఓ భాగంగా, శాంతిని ప్రసాదించే వరదాయినిలా అయింది.




ఆమె మొట్టమొదటి గురువు తండ్రి అయ్యాసామి అయ్యర్. తల్లి పేరు లలితాంగి. 12 ఏళ్ళ వయసులోనే వసంతకుమారి స్టేజిమీద సంగీతకచేరీలు చెయ్యడం ప్రారంభించింది.

ఆమె తండ్రి అయ్యాసామి అయ్యర్‌కి, తల్లి లలితాంగికి కూడా పురందరదాసు కీర్తనలంటే ప్రాణం. తన తల్లి పురంధర విఠల నామాన్ని జపిస్తూనే తుదిశ్వాస విడిచింది అంటుందామె. ఆవిధంగా ఆమెకు చిన్నతనంనుంచీ పురందరదాసు కీర్తనలంటే ఎక్కువ ఇష్టపడేది. 1945లో ఆమెకు సినిమాలో నటించాలన్న కోరిక కలిగింది. సుదర్శన్ అనే తమిళ సినిమాలో ఆమెకు అవకాశం కూడా వచ్చింది. కానీ నిర్మాతలకు ఆమెకు మధ్య ఒప్పందం కుదరక ఆమె దానిని వదిలేసుకుంది.

1948లో 'రాజముక్తి' అనే సినిమాలో శివుడిపై భక్తిగీతాలను పాడే అవకాశం మొదటిసారిగా వచ్చిందామెకు. అప్పటినుంచీ 1955 వరకు ఆమె సినిమాలలో పాటలు పాడింది.

1967లో ఆమెకు పద్మభూషన్ అవార్డ్ వచ్చింది. తిరుపతి దేవస్థానం ఆస్థానవిద్వాంసురాలిగా కొన్నాళ్ళు కొనసాగారు. తండ్రి తరువాత ఆమెకు గురువుగా సంగీత సాధన చేయించిన జి. యమ్. బాలసుబ్రహ్మణ్యంగారంటే ఆమెకు ఎనలేని భక్తి ప్రపత్తులున్నాయి. ఆయన తన అవసాన దశలో తన ప్రియశిష్యురాలికి ఒక తంబూరాని బహూకరించి "దీన్ని మాత్రం ఎవరికీ ఇవ్వకు" అని చెప్పారు. ఇప్పటికీ దాన్ని దైవ సమానంగా కొలుస్తుంది ఆమె. అలాంటి గురు భక్తీ, శిష్యవాత్సల్యం ఈరోజుల్లో అరుదేననిపిస్తుంది.

## సచిత్ర విచిత్రం

# పొట్టి పొడుగు ప్రేమ

1987 గిన్నెస్‌బుక్‌లో ప్రపంచంలోని అతిపొట్టి మనిషిగా నమోదయిన ఈ మహానుభావుడు ఆ అమ్మాయితో ప్రేమలోపడ్డాడు. తీరా పెళ్లికి కొద్ది రోజుల ముందు ఏదో మనస్తాపాలొచ్చి ఇతనే 'నో' అనేశాడు.



# 'నీళ్లలో చంద్రుడు' పై సమీక్షలు

మార్చి 'చతుర'లో ప్రచురితమైన అక్కినాపల్లి సుబ్బారావు రచన 'నీళ్లలో చంద్రుడు'పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## మార్పుకు కారణం- పాశ్చాత్య సంస్కృతే

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

**మా**రుతున్న మానవసంబంధాలను, సంస్కృతీ, సంప్రదాయాలను గతంతోను, మరోవైపు అమెరికాతోను పోలుస్తూ, ప్రశ్నలెన్నిటినో పాఠకులపైకి సంధించి వదిలిన నవల 'నీళ్ళలో చంద్రుడు'. సంప్రదాయాల పట్ల గౌరవం, దాంతోపాటే మారుతున్న పరిస్థితులతో సర్దుబాటు ధోరణిని రచయిత నవల ఆద్యంతం ప్రతిబింబించారు. అమెరికా చేరేందుకు భారతీయులు ప్రయత్నించే తీరు, చేరాక ఇండియాను విమర్శించడం, గొప్పలను మాత్రమే పార్టీలలో ప్రదర్శిస్తూ ఇదే ఇండియన్ కల్చర్ అని అమెరికన్లు భావించేవిధంగా ప్రవర్తించే పద్ధతిని రచయిత వర్ణించిన తీరు బాగుంది.

తండ్రి డైరీ ప్రభావంవల్ల ఇండియాకు వచ్చిన సురేష్‌కు అనేక మార్పులు మింగుడు పడక, పలు ప్రశ్నలు ఎదురవుతాయి. పెరిగే జనాభా, ట్రాఫిక్, కాలుష్యం, అవినీతి, పేదరికం- ఇలా అనేక సమస్యలను అమెరికాతో పోల్చి చూసుకొని, అమెరికా బెటర్ అనుకుంటాడు. ఇదికాక భారతదేశంలోని సంస్కృతీ సంప్రదాయాలను, మానవ సంబంధాలను రచయిత విశ్లేషించారు. నలభై ఏళ్లక్రితం తండ్రి డైరీలో వ్రాసుకున్న సంస్కృతీ సంప్రదాయాలకు బదులుగా అనేక అసమంజసమైన సంప్రదాయాలు సురేష్‌కు కనపడతాయి. రచయిత పేర్కొన్న అంశాలు అసమంజసమైన సంప్రదాయాలేనని పాఠకులు కూడా అంగీకరిస్తారు.

అయితే ఈ సమస్యలకు సమాధానాలను, కారణాలను వెదకడంలో కొన్ని ముఖ్యమైన అంశాలను వదిలేసినట్లు అనిపిస్తుంది. వాటిలో మొదటిది- (రచయిత చివరలో కొంత ప్రస్తావించినప్పటికీ) పాశ్చాత్యదేశాల ప్రభావం వర్ధమానదేశమైన భారత్‌పై పడటం. ఎమ్‌టివి అమెరికాలో ఏవిధంగా ప్రసారమవుతుందో మనకు తెలియదు. కానీ భారతదేశంలో అతితేలిగ్గా ప్రసారమవుతూ అంతులేని ప్రభావాన్ని కలిగివుండటం కేవలం ఒక ఉదాహరణ మాత్రమే. ఇక రెండవది ప్రపంచవ్యాప్తంగా ఆర్థిక వ్యవస్థలో చోటుచేసుకుంటున్న పరిణామాలు ఏకధ్రువ ప్రపంచం, గ్లోబలైజేషన్, లిబరలైజేషన్ వంటివి. వీటిని వదలి మనం మానవ సంబంధాలు ఆర్థిక సంబంధాలుగా మారడానికి కారణాలను సంపాదించలేం. అలాగే కొన్ని పరిస్థితులను, నేపథ్యాలను లెక్కలోకి తీసుకోకుండా ట్రాఫిక్, కాలుష్యం వంటి సమస్యలను అమెరికాతో పోల్చడం సరైనది కాదు. అమెరికా అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీదేశం, పూర్తిగా నగర వాతావరణం కన్పించేదేశం. అయితే ఇండియా పారిశ్రామికీకరణదిశలో అభివృద్ధి చెందుతున్న దేశం. ఇక్కడ గ్రామీణ పరిస్థితులతో కూడిన నగర వాతావరణం మిశ్రమంగా కనిపిస్తుంది. కనుకనే రోడ్డుమీద అధునాతన వాహనాలతోపాటు, ఆవులు, గేదెలు కూడా దర్శనమిస్తాయి. ఫుట్‌పాత్‌పై నివసించే ప్రజలు, క్వార్టర్ కోసం వెంటపడే బిచ్చగాళ్లు- 'సంపన్న' అమెరికాలోనూ అగుపడతారు. మారణా

యుధాలతో స్వేచ్ఛగా తిరిగే బాలబాలికలు, పధ్నాలుగేళ్లు దాటని పెళ్ళికాని తల్లులు- ఇటువంటి అమెరికా సంస్కృతితో మన సంస్కృతిని పోల్చుకోవడం తగనిపని. సమాజపు ఆంక్షల కారణంగానే నిలబడి, ఎన్ని వైరుధ్యాలున్నాసరే ఉక్కిరిబిక్కిరవుతూ కాపురాలు మగ్గిపోవడం అంత మంచిది కాకపోవచ్చుగాక, కానీ విచ్ఛిన్నమవుతున్న అమెరికా కాపురాలు, అనాధలను తయారుచేసే వివాహ వ్యవస్థకంటే ఈ వివాహ వ్యవస్థ ఖచ్చితంగా విశిష్టమైందే.

"ప్రజలకు డబ్బంటే పడిచచ్చే ధోరణిలో అమెరికాలోకంటే ఏమీ తీసిపోదు'' (ఈ దేశం) అంటారు రచయిత. నిజమే ఈ జబ్బు అక్కడినుంచే దిగుమతయింది. కారణాలు ఏవైతేనేం 'వాంఛనీయమైనా, అవాంఛనీయమైనా మార్పు తప్పనిసరి. అయితే అవాంఛనీయమైన మార్పును ప్రతిఘటించలేకపోతే సురేష్‌కులాగే అందరికీ ప్రశ్నలే మిగిలిపోతాయి. "మనిషికి మంచి ఊహలు, ఆలోచనలు వుండగానే సరికాదు. వాటిని వ్యక్తపరచి, ఇతరులను మలచగలిగినప్పుడు వాటికి విలువ. నీలో ఏదైనా సామర్థ్యం వున్నా వ్యక్తపరచకపోతే అది ఎవరికీ ఉపయోగపడదు''

-ఎం. ప్రగతి,
అనంతపురం-515 005

## ప్రత్యక్ష సాక్షాత్కారం

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

ప్రతి మనిషి జీవితంలోనూ ఎప్పుడో ఒకసారి తారసపడే "నాకు నా అన్నవారెవ్వరూ లేరు'' అనుకొనే పరిస్థితిని ఎదుర్కొంటూన్న ఓ యువకుడు తండ్రి డైరీల ప్రభావంతో, అమెరికానుండి వచ్చి స్వదేశమైన భారతదేశంలో చేసిన అన్వేషణ "నీళ్లలో చంద్రుడు'' ఊహించని మలుపులు, ఊపిరి బిగబట్టే సస్పెన్స్‌లూ గొప్ప గొప్ప సందేశాలు వంటి హంగూ ఆర్భాటాలు లేకుండానే నవల నల్లేరుపైబండి నడకలా సాగింది.

ప్రపంచంలోనే అభివృద్ధి చెందిన దేశంగా ఖ్యాతినార్జించిన అమెరికాలో పెరిగిన సురేష్‌కు, అధిక జనాభాతో, అవినీతితో, అపరిశుభ్రతతో అభివృద్ధివైపు కుంటినడక నడుస్తూన్న భారతదేశంలోని సంఘటనలు ఆశ్చర్యం గొలపడంలో విశేషం లేదు. మనసు లోలోతుల్లో ఉన్న ఆప్యాయత, అనురాగం అనే పొరలని డబ్బు, కృత్రిమ మర్యాద, అపరిశుభ్రత ఇవేవీ స్పృశించ లేవు. నిజమైన ఆప్యాయత ఒక్కటే దానిని తట్టిలేపగలదు. మనదేశంలో కొనూపిరితోనున్న ఆప్యాయతని అందుకొనడంవలననే సురేష్ తిరిగి జనజీవనంలో కలువగలిగాడు.

మనదేశంలో యువత నిరుద్యోగంతో, భవిష్యత్తుపట్ల అభద్రతా భావంతో, నిరాశా నిస్పృహలతో ఎలా త్రిశంకు స్వర్గంలో బ్రతుకుతున్నారో ప్రసాద్ పాత్ర చెబుతుంది. పండిపోయి రాలిపోయే వయస్సులో కూడా భర్తకు చేదోడువాదోడుగా ఉండటం కోసం ఎండనకా, వాననకా జొన్న పొత్తులమ్మే అవ్వ, చదువరి, సంస్కారి అన్న ముసుగులో భార్యను చిత్రహింసలు పెట్టే సరళ భర్త ఒకే వ్యవస్థలోని భిన్న ధృవాలకి తార్కాణాలు. అభిప్రాయభేదాల కారణంగా సురేష్, కేతరిన్ విడిపోతే, శాడిస్ట్ భర్తనుంచి పారిపోవడానికి సరళ ప్రయత్నం. సంసారాలు విచ్ఛిన్నం కావడానికి దేశ, కాల పరిస్థితులుకాక మానవ మనస్తత్వాలే కారణమనిపిస్తుంది.

పాత తరానికి ప్రతినిధి అయిన సంధ్య ఆంటి తన ప్రేమపుస్తకంలోని ప్రతి సంఘటననీ ఒక మధురస్మృతిగా జ్ఞప్తిగా తెచ్చుకుంటే, ఈ తరానికి ప్రతినిధిలాంటి సురేష్ తన ప్రేమానుభవం అనుక్షణం ముల్లై బాధిస్తుంటే దానిని గత స్మృతులలోకి నెట్టి మరిచిపోవడానికి చేసే ప్రయత్నం మారుతూన్న ప్రేమ విలువని సూచిస్తుంది. కేతరిన్‌కి జీవితంలో తిరిగి తన చేయినందించి సురేష్ తప్పటడుగు వేయకపోవటానికి కా

రణం, నా అన్నవారి సాంత్వనతో కుదుటపడ్డ మనసే.

మొత్తానికి సమాజంలోని వివిధ మనస్తత్వాల ప్రత్యక్ష సాక్షాత్కారమే నీళ్లలో చంద్రుడు.

**-బోయలకుంట్ల శ్రీదేవి,**
తిరుపతి-517 501.

## కాదనలేని వాస్తవం

***(తృతీయ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)***

స్వదేశీ- విదేశీ సంస్కృతీ సంప్రదాయాల మేళవింపుతో, చక్కని సృజనాత్మకతతో, అంతకుమించిన ఆలోచనా పరంపరలతో అక్షరాలను పరవళ్ళెత్తింపచేసిన పరిపూర్ణ రచన మార్చి నెల 'చతుర'లో ప్రాణం పోసుకున్న 'నీళ్లలో చంద్రుడు' నవల! అమెరికా పౌరసత్వాన్ని పొందిన ఒక భారతీయ యువకుడి జీవన సరళిని ప్రతిబింబిస్తూ ఆ పాత్ర ద్వారా రెండు దేశాల జీవనగతుల్ని సమన్వయపరచిన తీరు రచయిత నేర్పుకి అద్దం పట్టింది.

ఇండియా పెట్టిన విద్యా, విజ్ఞాన భిక్షతో అమెరికాకు ఎగిరిపోయిన డా॥ సంపెంగి, పారాలవంటి అవిటి మనస్కులైన కృతఘ్నులు తాము చదివిన కాలేజీలను పందుల దొడ్లుగా, చదువు చెప్పిన ప్రొఫెసర్లను మూర్ఖులుగా, పుట్టిన దేశాన్ని డర్టీ ఇండియాగా చెప్పుకోవడాన్ని చూస్తే. అసలు ఇండియాను మోసంచేసి వెన్ను విరుస్తున్నదెవరో బోధపడుతుంది. ఈ శాడిస్టులను చూసి బాధపడాలో లేక జాలిపడాలో అర్థంకాని విషమపరిస్థితి ఎదురవుతుంది. ఒక సందర్భంలో "ఈ దేశప్రజలు పైదేశం వెళ్ళి ఇతరుల సామాన్య జీవనసరళిని చూస్తే వాళ్ళ ధోరణిలో మార్పు వస్తుందేమో'' అంటాడు సురేష్. నిజమే! అతని ఆలోచన బాగానే వుంది. కాని ఇప్పటివరకూ ఇండియాని విడిచివెళ్ళిన వాళ్ళలో చాలామంది పైన ఉదహరించిన మూర్ఖపు ధోరణినే స్వంతం చేసుకుని అవలంభిస్తున్నారనేది కాదనలేని వాస్తవం.

తన తండ్రి గతాన్ని తెల్సుకోవడానికి, మాతృదేశ సందర్శనానికి అమెరికానుండి విచ్చేసిన సురేష్ కొన్ని నెలలపాటు ఇండియా వ్యవస్థలో ఉన్న లోటుపాట్లను, అవినీతిని, స్వార్థపరత్వాన్ని చూసి కలవరపడ్డాడు. అలాగే ఇక్కడి మనుషుల్లో వెల్లువెత్తిన ఆత్మీయతానురాగాలను, ప్రేమానుబంధాలను చూసి ముచ్చటపడ్డాడు. ఇండియాకి రాకపూర్వం ఒంటరితనంతో పిచ్చెత్తిపోయిన అతను ఇండియాకి వచ్చి ఇక్కడి పరిస్థితుల్ని అర్థం చేసుకున్న తర్వాత తనవాళ్ళతో కలిసి జీవించకుండా మళ్ళీ తిరిగి అమెరికా వెళ్ళిపోయాడు. రెండు దేశాల జీవన విధానాలను అధ్యయనం చేసిన అతను చివరికి యాంత్రిక జీవనానికే తలొగ్గి ఆత్మీయతానురాగాలను కాలదన్ని వెళ్ళిపోవడాన్ని బట్టి చూస్తే అర్థమౌతుంది నేటి యువత విపరీతపు పోకడ ఏమిటో, జీవిత గమ్యం ఎటువైపో. హుఁ... సగటు భారతీయులుగా మనల్ని చూసి మనం జాలిపడటమే నేటి ఇండియా యొక్క దౌర్భాగ్యం!

**-నూనె శాంతాదేవి,**
నేలటూరు-533 308

## తూర్పు-పడమర

***(నాలుగవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)***

''నీళ్లలో చంద్రుడు'' నవల చిరుగాలికి కదిలిన నీటిలో చంద్రుడు ఉండీ లేనట్లుగా వున్నది. సాదాసీదాగా వున్నా చదువుతున్నంతసేపు బాగానే వున్నది. మన సంప్రదాయం, సంస్కృతి గురించి కొద్దిగా చెప్పినా మనలో వున్న లోపాల్ని, మనదేశ రాజకీయ ఆర్థికస్థితి గురించి ముఖ్యంగా నగర జీవనగతుల గురించి చాలా ధైర్యంగా ఎత్తి చూపించారు రచయిత అక్కినాపల్లి సుబ్బారావుగారు. ఎంతో కష్టపడి చదువుకుని,

అర్హత వుండీ ఉద్యోగాల్ని సంపాదించితే విదేశాలకి ఎగిరిపోయే యువత, కనీసం తాము అయినా బాగుండాలని కోరుకుంటున్నారు. అలా చేయలేని మధ్యతరగతి మనిషి ఏదో ఒక ప్రైవేటు కంపెనీలో స్థిరపడి జీవితంతో రాజీపడటం నేర్చుకున్నాడు. ఈ సమస్య రోజురోజుకీ ఎక్కువ అవుతోంది. చివరకు యువత నీరసపడి నిరాశావాదం అలవర్చుకుంటున్నారు. స్వార్థం అవకాశవాదం అన్నిచోట్లా వుంది అది ఏదేశమైనా సరే. కనీసం మనదేశంలో కన్న తల్లితండ్రుల్ని ఓల్డ్ ఏజ్ హోమ్‌లో చేర్చటం అంటూ లేదు. కానీ విదేశాల్లో ఇది మామూలే. అంతేకాదు వివాహ వ్యవస్థ వారికి ఒక విస్తరాకు మాత్రమే. సురేష్, కాతరిన్‌ల వివాహమే దీనికి నిదర్శనం. బంధం, బంధాలు అంటూ ఏమీలేవు అక్కడ.

సుబ్బారావు పాత్ర సూటిగా తెలియకపోయినా అసలు కథానాయకుడు అతడే. ఎన్నడో పాతికేళ్ళనాటి ప్రేమకథ ఇంకా మనసులో దాచుకున్న మధురమైన వ్యక్తి అటువంటి ప్రేమమూర్తులు అరుదు. సంధ్య పాత్ర కూడా హుందాగా వుంది. సురేష్ మనదేశం గురించి, తను స్థిరపడిన స్వదేశం కాని దేశం గురించి బేరీజు వేసుకుని ఎంతో మధనపడి ఏమీ చేయలేక తిరిగి విదేశాలకి వెళ్ళిపోయాడు. సంస్కృతి, సంప్రదాయాల్లో అవి ఎప్పుడూ తూర్పు-పడమరగానే వుంటాయి.

-యన్. ఇందిర
సికింద్రాబాద్-500 015

# తరాల అంతరాలు

*(అయిదవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

నవలలో ముఖ్యంగా భార్యాభర్తల మధ్య బంధాన్ని వివరించడం జరిగింది. ప్రేమ వ్యవహారాల్లో తరాల మధ్య అంతరాలు ఒకతరానికీ వేరొక తరానికి చెందిన వ్యక్తుల ప్రవర్తనా సమస్యలు వివరించడం జరిగింది. నవలా నాయకుని తల్లిదండ్రుల మధ్య కమ్యూనికేషన్ గేప్ నవలా నాయకుని తండ్రి మరియు సంధ్యల మధ్య కమ్యూనికేషన్ గేప్‌లను స్పష్టంగా తెలియజేస్తోంది. మనదేశ వ్యవహారాలు, విదేశీ వ్యవహారాల మధ్య తారతమ్యత, మనదేశీయుల ప్రవర్తనకీ, విదేశీయుల ప్రవర్తనకీ మధ్య తారతమ్యత, విదేశాలకు వెళ్ళి కూడా మార్చుకోని మనదేశీయుల సంకుచిత స్వభావాల్ని తెల్పుతుంది.

నవల భార్య, భర్త ప్రియురాలుల మధ్య నడవాల్సి వున్నా ఎక్కువ భాగం పోలికలోనే నడిచింది. నవలా నాయకుడు విదేశీయుడైనా, కథాంశం దేశీయం కావడం వలననేమో, దేశీయపు పోకడలు ఎక్కువగా కన్పించాయి. నవల ముఖ్యంగా నాయకుని చుట్టూగాక, అతని తండ్రి చుట్టూ తిరిగింది. అందువల్ల నవలలోని నాయకునికి ప్రాధాన్యత తగ్గింది. సంధ్య భర్త రమేష్‌ని గూర్చి ఇంకొంచెం వివరణ ఇవ్వాల్సింది.

తనకున్న రోగం కారణంగా సంధ్యని వివాహమాడమని అడగడానికి వెనుకాడిన తండ్రి, తన సర్దుబాటు ధోరణి కారణంగా భార్యతో సరిగా నడువలేని తండ్రి, తండ్రి జీన్స్‌వల్ల తనకబ్బిన, సరిపుచ్చుకుపోవడం అనే స్వభావంవల్ల తనతో కలిసివుండడానికి వ్యతిరేకించిన భార్య ఇలా మనస్తత్వాల్ని గూర్చి తెల్పుతోంది ఈ నవల. నిజం చెప్పాలంటే విషయాల్ని ఇదమిత్థంగా తేల్చి చెప్పలేకపోయింది.

-జె. భాస్కర్‌పట్నాయక్,
సికింద్రాబాద్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3399444; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942.

CHATURA Telugu Monthly Hyderabad - 500 482 Regd. No. H/HD/402